| | | సం | పుట |
|---|---|---|---|
| సమస్య—వెంక్కపాటి స్వరాజ్యలక్ష్మిగారు (త్రి. చి.) | ... | ౭ | |
| సర్ విలియం హెర్షెల్—గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు | ... | ౧౧ | ౪౬౭–౪౭౦ |
| సాహిత్యంలో చంద్రుడు—వావిలాల సోమయాజులుగారు | ... | ౧౦ | ౩౫౧–౩౫౬ |
| సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము—పిల్లలమఱ్ఱి వెంకటహనుమంతరావుగారు | | ౮ | ౧౨౩–౧౨౬ |
| సాహిత్యము—ప్రచారప్రబోధములు—పిల్లలమఱ్ఱి వెంకటహనుమంతరావుగారు | ... | ౧౨ | ౫౭౧–౫౭౪ |
| సూర్యుడు: సూర్యకాంతి: కాంతికిరణముల ఉరువడి—గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు | ... | ౯ | ౨౩౯–౨౪౩ |
| స్వతంత్రభానుడు—రేకేటి సీతారామస్వామి గారు (ప) | ... | ౯ | ౯౯–౧౦౦ |
| స్వాతంత్ర్యభారతి—భట్టిప్రోలు కృష్ణమూర్తిగారు (ప) | ... | ౮ | [illegible]–౧౦౮ |
| స్వరాజ్యసిద్ధి—కపిల కాశీపతిగారు (క) | ... | ౮ | [illegible]–౩౩ |
| స్వర్గంలో స్వాతంత్ర్యోత్సవం—కపిల కాశీపతిగారు (క) | ... | ౯ | ౨౨ –౨౩౪ |
| స్వర్గద్వారము—జనమంచి రామకృష్ణగారు (వ) | ... | ౮ | ౧౭౪–౧౭౯ |
| స్వాతంత్ర్యదినము—తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు (ప) | ... | ౯ | ౨౮౪ |
| హరిచరణుడు—తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులుగారు (న) | ... | ౧౦ | ౩౩౫–౩౪౨ |
| ,, ,, ,, ,, | ... | ౧౧ | ౪౪౩–౪౫౪ |
| ,, ,, ,, ,, | ... | ౧౨ | ౫౫౧–౫౬౧ |
| హాస్యరసము—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ... | ౧౨ | ౫౯౫–౫౯౭ |
| హేమమాలి—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు (వ) | ... | ౭ | ౫౭–౬౨ |






భారతి, జూలై '47.

సమస్య

చిత్రకారిణి : శ్రీమతి ముక్కపాటి స్వరాజ్యలక్ష్మి.



సంపుటము 24
సంచిక 7

# భారతి

జూలై 1947
సర్వజిత్తు, ఆషాఢము

# రథము - మంత్రము

[స్వాతంత్ర్య ఖండము]



– శ్రీ పాలెపు వేంకటరత్నము –




సారనైగమఘంటికాఘూర్ణనద
మేదురంబయి భాసురాత్మీయశక్తి
కలితశుభ్రాశ్వసంచయలలిత మగుచు
తే రొకటి భారతావనిఁ బొలుతెంచె.

అది త్రయీసంచయపురాణహారికాంతి
పుంజలసితంబు, శాంతిప్రపూరితంబు
సర్వమతసమ్మతం, బహింసాయుతంబు
భారతాంబాధివాససంభావితంబు.

అది పురాణర్షిగణపూజ్య, మఖిలభువన
పూజనీయప్రభావము, పుణ్యతరము
పారతంత్ర్యాపహప్రభాబంధురంబు
సర్వమానవసౌభ్రాత్రసంయుతంబు.



దాని నొగలందు తోత్రంబు పూనియున్న
బక్కసారథి తా ధృతప్రగ్రహుఁ డయి
పరమశాంత్యహింసామంత్రపఠనతోడ
తోలుచున్నాఁడు పావనోద్వేలశక్తి.

మాంత్రికుండగు సారథి మహిమ యేమొ ?
తిరిగినవి వేలరాట్నముల్ గిరగిరమని ;
నవ్వడికి 'లాంకషైరుమాంచస్టరు' మిత్తి
లేని భీతిని చేష్టలు మానుకొనఁగ.

మరల నాతేరె;—అతఁడే మంత్రములను
తిరిగి పఠియించి దిక్కులఁ దిరుగఁజూగె ;
పొంగినది శక్తి లవణాబ్ధి ; పూర్ణజలధు
టాళికిఁ గృశానుకీల తోడై తపింప.

మూలఁబడియున్న ముప్పదిమూఁడుకోట్ల
ప్రజలు స్వాతంత్ర్యసౌఖ్యపిపాస వెలికి
ఉబుక 'జయ్ ! భారతీ' యని యుజ్జ్వలాత్మ
శక్తి నరదము లాగఁగా సాఁగినారు.

కుండలను నీరు సలసల కుతకుతమన
గుండెలో భీతి మెండుగా గుబులుకొనఁగ
బట్టతలరాజప్రతినిధి బయలుదేరి
సీమఁ జేరంగ నానాఁడె 'స్టీము'రెక్కె.

మరల నాతేరె:—ఆ బక్కమాంత్రికుండె :
మగుడఁ బల్కె నుచ్చాటనమంత్రములను
విపులభారతరమణీయవృక్షవాటిఁ
దనరు పరపక్షిపక్షముల్ 'తటతట'మన

ప్రోజ్జ్వలాత్మీయశక్తిప్రపూరితమగు
'తొలఁగిపొం'డను కేకతో విలవిల మని ;
ఆశ్రయములేని శ్వేతాండజాళి. గూడు
వీడి తమలోన నే వాదులాడఁ గడఁగె.

ఆ నిరాఘాటరథగమనాధికప్ర
భావకలితమంత్రస్వనబంధురతకుఁ
దలఁకి శ్వేతోరగావళి తలలు వంచి
యరదమును మెచ్చి జోహారు లందఁజేసె.

పర్వినది దివ్యమంత్రప్రభావ మఖిల
ఖండఖండాంతరముల కఖండశక్తి ;
చండతరభీషణోజ్జ్వలజ్వాల లంటి
మండినది పశ్చిమంబెల్ల గుండెపగుల.

భారతీయరథాంగప్రభావగరిమ
నెల్ల దేశాలవారు గుర్తించినారు :
జోత లిడినారు, వెఱఁగంది చూచినారు,
ఆ రథమె కావలయునని కోరినారు.

తొలుత [1]నొక పక్షి దివినుండి యిలకు వ్రాలి
తేరి మాంత్రికసారథిఁ జేతిపాఱఁ
జూడఁ జాలక నిలిచి మాటాడలేక
సరిగ వచ్చిన దారినే తిరిగిపోయె.

పిదప [2]మూఁ డండజమ్ములు పృథివి వ్రాలి
యరద మెదురుగా సాష్టాంగ మాచరించి
తాము నేర్చిన వాక్యవిత్త్వంబు కొంత
పలికి, యట నిల్వఁజాలక తొలఁగిపోయె.

***

అపుడు పార్థవిక్రమయుతుండైన యొక్క
[3]భరతవీరుఁడు సారథి కెఱఁగి నిలిచి
పలికెః-"స్వాతంత్ర్యపరిషత్సభాభవనముఁ
జేరఁబోనిండు రథ" మని ధీరగరిమ.

---

1. స్టాఫర్డ్ క్రిప్స్.
2. అమెరికాక్రియను.
3. జవహర్ లాల్ నెహ్రూ.

రథము రాజ్యాంగ పరిషత్సుపథముఁ బట్టి
మరల నొక పెద్ద [4]వెలిపిట్ట యరుగుదెంచి
యరదమును డాసి సారథియడుగు లంటి
పలికె నీరీతి వినయసద్భావ మొప్ప:

"తోలు మరదంబు సారథీ! తోలుకొనుము
నిలువలే మింక నీ మంత్రముల కెదిర్చి
శాంతిపూరితస్వాతంత్ర్యసకలసౌఖ్య
ముల ననుభవింపుఁడీ మాకు సెలవొసంగి"

తేరు నడచిన విమలమా దారులందు
సంకురించె స్వాతంత్ర్యసస్యాళి, ధీర
నాయకశయాంబుజాతసంతతవినిర్గ
తాచ్ఛసద్వారిపరివర్ధితాభ యగుచు.

4. మౌంట్ బాటెన్.



# శ్రీనాథుని ఉపసర్గ సంధానము

— శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి —

నన్నయనుండి శ్రీనాథునిదాక తెలుగు కవితా వాఙ్మయము యొక్క యథాయుక్తధోరణిలోనిది. నన్నయ లోకజ్ఞుడు, తిక్కన రాజకీయవేత్తయు నగుగాక! వారివారి కవితాశైలిలో, శ్రీనాథునిలో నున్నంతగా డాబు-దర్పములు కనిపింపవు. నన్నయ అక్షరరమ్యత నాదరించుచు సంసారపక్షములో కవిత్వము నడపించినాడు. తిక్కన భావనలో గొంత లోతులు తడవినాడు. ఈ యుభయుల రచనలలోను పాత్రపోషణము, రసస్ఫూర్తి పతాకలెత్తినవి. ఎవరెటులు వ్రాసినను నన్నయతిక్కనలకు దగ్గఱచుట్టఱికము. నన్నయ నడచినచో, తిక్కన నాతని దలవంచుకొని నడచును. ఆ నడకలో, మొదటివానిది మత్తమాతంగగమనము, రెండవవానిది హంసయానము కావచ్చునుగాని, శ్రీనాథునిది మాత్రము ముఖము పైకెత్తి, లోమ్మతీర్పుగాని డాంబికముగా నడచు సింహపునడక. శ్రీనాథునివలె, నన్నయతిక్కనలు తర్కవ్యాకరణాదులు పిక్కచేసి వల్లించినవారు కారా! కాళిదాసాదుల కావ్యరచనలో మెలకువలు తెలిసికొన్నవారు కారా! అని నేను చేయు ప్రశ్న.

నన్నయ—తిక్కనలు శాస్త్రపారము నెఱిగినవా రనుటకు సందేహము లేదు. కాని, వారి రచన చదివిన చదువునకెల్ల అద్దముపట్టి నిలబడదు. శ్రీనాథునిదో, అక్షరాక్షరము పాండిత్యమును వెల్లగక్కుచున్నటులుండును. అదియంతయు వారివారి స్వభావములనుబట్టి యేర్పడిన రచనాభేదము.

శ్రీనాథుడు శాస్త్రవేత్తయైనను, నన్నయవలెనే పురాణజ్ఞుడనని నైషధములో సూచించుచున్నాడు:—

“బ్రాహ్మీదత్తవరప్రసాదుడ వురు
ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుడ వీశ్వరార్చనకళా
శీలుండ వధ్యాత్మహిత
బ్రహ్మాండాదిమహాపురాణచయతా
త్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీ
భాగ్యంబు సామాన్యమే!”

కృతిపతిచే బలికించిన ఈ పద్యములో ప్రధానముగా శ్రీనాథుడు చెప్పింపదలచుకొన్న సంగతి మూడునాలుగు పాదములలోనే యున్నది. కాగా, మొదటి చరణములు రెండును గల్పించుకొనెను. అవి విశేషణదళము లా మహాకవియెడల సత్యార్థములు కావని కాదు నేను వ్రాయుట. ‘బ్రహ్మాండాదిమహాపురాణ……’ అని చెప్పదలచుకొని, ‘బ్రాహ్మీదత్తవరప్రసాద……’ అని ‘హ్మ’ ప్రాసముతో పద్యము విధిగా నుపక్రమించియుండునని ఛందోరహస్యము నెఱిగిన కవులు కనిపెట్టుదురు. శ్రీనాథున కీబాధ యేల? బ్రహ్మాండపురాణాదులలో నెఱుకయున్నటులు తెలుపుకొనుట యొక్క ఘనమా? అనరాదు. నన్నయభట్టారకుడు “తన కుల బ్రాహ్మణు ననురక్తు నవికళజపహోమతత్పరు, విపుల శబ్దశాసను, సంహితాభ్యాసు బ్రహ్మాండాదినానా పురాణవిజ్ఞాననిరతు…………” అని వ్రాసికొనెను. ఆనాడు పురాణవిజ్ఞానము శాస్త్రప్రవేశముకంటె కవులకు గావలసిన దన్నమాట. ఆ సంప్రదాయము ప్రకారము నన్నయ యటులు చెప్పుకొనెను. నన్నయ ఎందుకు చెప్పుకొనెనో, శ్రీనాథుడు నందులకే చెప్పుకొనెను.

మహాభారతము తానై తెనిగింపబూనిన భట్టారకుడు నన్నయ, ఉభయభాషాకావ్యరచనాభిశోభితుడ ననియు, పురాణవిజ్ఞాననిరతుడ ననియు మాత్రమే చెప్పు

కాదేమో. ఈ చెప్పుకొనటనుబట్టి, అతనికి శాస్త్రప్రవేశము లేదేమో యని యనుమానించుట కూడ అపరాధమగును. కాని, శ్రీనాథుని చూడుడు. అతడు శాస్త్రార్థము చేసి గౌడడిండిమభట్టు కంచుఢక్కను పగులగొట్టించినాడు. ఇంత చేసిన శ్రీనాథునకు కూడ శాస్త్రప్రసక్తి తెచ్చుకొనక నన్నయవలె బ్రహ్మాండాది పురాణవిజ్ఞానవిషయమే తెలుపుకొన్నాడు.

స్థూలముగా, నన్నయకవితలో నతని శాస్త్రజ్ఞత తలయెత్తదు. కవిసార్వభౌమునిదో, పాడెత్తించి "ఔరా! ఎన్ని తెలిసినవాడు" అనిపించును. ఏతావతా, నన్నయకంటె, తిక్కనకంటె శ్రీనాథునిలో గొంత డాబుచేయు శక్తి యున్నది. అదిగాక, కాలము సాగరతలో బడి, కవిసార్వభౌముడు దేశములంతిరిగి, రాజులను దర్శించి, తీరకవితావిహారములచే గనకాభిషేకము చేయించుకొని, బిరుదములను గట్టుకొని, ఉన్న శక్తిని చాటుకొన్నాడు.

బాహిరముగాను, ఆంతరముగాను శ్రీనాథునిలో దర్పము కనిపించును. నన్నయ—తిక్కనలు ప్రాతలైనను, చేతలైనను చల్లగా జేసికొనిపోవువారు. నాదృష్టిలో వారు శాంతవాదులు. శ్రీనాథుడు ఖడ్గవాది. శాంతవాదికంటె ఖడ్గవాదిలో చాకచక్యముండును; శక్తిసంపత్తి యుండును; మేధాపటుత్వముండును; సాహస ముండును. శాంతవాది యొక రకముగా మోసగాడు. తనలో నెంత శక్తి యున్నదో బయటికి దెలియనీయక యెదుటివానిని నలిపి చంపును. అశక్తు డయ్యుగూడ, శక్తునివలె నటింపగల నేర్పు శాంతవాదికి సహజమైనది. ఇది నన్నయతిక్కనలకు లేదునుడీ! పండితకవి యుండవలసిన దర్పముతో—అగాధశక్తిమంతిమగు తన హృదయమెల్ల గ్రంథముల ద్వారా మన కందిచ్చిన శ్రీనాథుడే చివరకు సాదు గాచలసినవాడు. అతని కవితాశైలిలో దర్పస్ఫురణ మదుగడుగున నుండు ననుటయే యీ వ్రాతయుద్దేశము.

కరకులు వంచకుండ సీసపద్యములు నడపించుటలో - గంభీరమైన ధోరణిలో సంస్కృతసమాసములు విసరుటలో—ఒకదానిలోగాదు, ప్రతివిషయమునను, శ్రీనాథుని కవిత్వమున 'హుందా' యున్నది. మయూరునిది—మురారిది—కాళిదాసునిది—భవభూతిది-ఒకరిదేమిటి! ఎందరో పూర్వకవుల కూర్పులు నేర్పుతో దెలుగున శ్రీనాథుడు తన కృతులలో బెట్టికొన్నాడు. "ఇదేమి యన్యాయమయ్యా!" అని యడిగినవారిని సాచికొట్టుద మన్నంత సాహసముతో, నత డటులుం బెట్టుకొన్నటులుం గనిపించును. తాను మహాపండితుడుగావున, నీ చేయుచున్న పని యనుహరణముగాని, యనుకరణముగాని, అపరాధముగాని కాదని యతని ధీమా. అది యొక దర్పము. అది యొక నిరంకుశత.

విలక్షణప్రయోగములలో శ్రీనాథుడు చూపిన నిరంకుశతయు, దర్పమును ఉపసర్గసంధానములోగూడ నగపడెనని తోచినది.

అసలు, ఉపసర్గము లర్థవిశేషద్యోతకములు.* ఒక్కొక్క ప్రయోగముతో నొక్కొక యుపసర్గమున నొక్కొక క్రొత్తయర్థము వచ్చును. ఒక ప్రయోగమున మంచి యర్థమొసగిన యుపసర్గము, వేఱొక క్రియతో గూడి చెడిపోవును. పరిగణ-పరిహారశబ్దముల కసి-నాస్తుల కున్న యంతర మున్నది. అదియంతయు ప్రకరణమునుబట్టి యవగతము చేసికొనవలయును. అధికమనగా హెచ్చు. అత్యధిక మనగా మిక్కిలి హెచ్చు. సమత్యధికమనగా మరి మిక్కిలి హెచ్చు. 'మిగుల మిక్కిలి హెచ్చు'అని చెప్పవలసినచోటగూడ నొకప్పుడు కవి 'అధిక' పదముతో పరిపెట్టును. సామాన్యముగా "హెచ్చు"అని చెప్పవలసివచ్చినపుడు 'సమత్యధిక'అని కొక్క చెప్పరు. అది ఆయాకవుల కవిత్వపు తీరులో నుండును. నన్నయతిక్కన లైనచో 'సమత్యధిక'అనవలసినచోట సామాన్యముగా 'అధిక'అని యూరకుందురు. శ్రీనాథుడో, "సమత్యధిక" అనితీరును. అది యతని "కవిత్వపు"పవాలు.

---

* ఉపసర్గాస్త్వర్థవిశేషస్య ద్యోతకాః: ప్రభవతి, పరాభవతి, సంభవతి, అనుభవతి, అభిభవతి, ఉద్భవతి, పరిభవతీత్యాదౌ విలక్షణార్థావగతేః. ఉక్తంచ-

"ఉపసర్గేణ ధాత్వర్థో బలా దన్యః ప్రతీయతే,
ప్రహారాహార సంహార విహార పరిహారవత్."

(భట్టోజి)

౧

"సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జనసేయం." (కాశీ ఖండము ౪ అ. ౮౧ ప.)

ఇచట వెనకముందులు మార్చి సంధ్యావందన మనవచ్చును. అది యటుండి, సంధ్యావందనము శ్వేత కోరమున రూఢముగా నున్నది. ఇక్కడ అభివందన మనుట యొక్క గడుసుదనము. ఆ సీసపద్యపు నడకలో నదియొక విశేషము.

౨

"ప్రాగీయమాన వైభవనిధికిన్" (కాశీ. ౧-౬౧)

ప్ర + ఆఙ్ + గీయమాన— "ప్రగీయమాన" అని ప్రయోగము ఉండును; "పరిగీయమాన" అనియు ప్రయోగము ఉండును. "ప్రాగీయమాన" అని వాడుట శ్రీనాథుని క్రొత్తదనము. శాబ్దరహస్యము తెలిసిన కవి గాని యిది యిట్లు ప్రయోగింపలేడు.

౩

"పంచాస్యస్ఫుటకంఠనాదహతసం
భిత్కుంభికర్ణ్యాగ్రమున్
న్యంచచ్ఛృంగాటక భూమిభృచ్ఛిఖరగ
ర్వాసంగ్యము న్వ్యంగ్యమున్"

శ్రీనాథేతరుడు "ప్రాంచచ్ఛృంగాటక" అని వ్రాయును గాని, ఇచట 'న్యంచచ్ఛృంగాటక' అనలేడు. ఇది యుపసర్గల మెళకువలు తెలిసి ప్రయోగించుట.

౪

"ప్రతివసియించు గోవుల ఖురంబులయందు" (కాశీ. ౨-౧౫ ప)

ఇచట 'ప్రతి' యను నుపసర్గము అనపసర్జన మన్నటులు దోపదు. 'వసించు'లో నెంత యర్థమున్నదో 'ప్రతివసించు'లో గూడ నంతే యర్థము. కాని 'ప్రతిగోవుఖురములయందు' అను నొక విశిష్టార్థమును పరిస్ఫురింపజేయుచు నీ యుపసర్గ మిచట నాలోచింపగా, ఉపసర్జనము కాదనియే యూహకు దట్టును. ఇది తెలిసి ప్రయోగించిన ప్రయోగము.

౫

"నలినప్రోద్భవమూర్తి గన్గొనిరౌ" (కాశీ)

ఇట 'ప్రోద్భవ' అనుచో రెండుపసర్గములు. 'నలినభవ' అనవచ్చును. 'నలినోద్భవ' అనవచ్చును. 'నలినప్రభవ' అనవచ్చును. ప్ర + ఉత్ — ఈ రెండును గలిపి 'నలినప్రోద్భవ' యనుట కవిసార్వభౌముని చేతక. 'జరాయుప్రోద్భూతములు' (కాశీ. ౩-౯౩) ఇత్యాదు లీ తెగలోనివి.

౬

వ్యాటీకిత—సముదీర్ణ—అభ్యుపగమించు—సమున్నిద్రప్రతాప—వ్యపాయుక్తమంబు — సమధిష్ఠితాంతర్వాణి—సంప్రభూత — సముత్తుంగతేజఃప్రకాశన—సమభ్యర్థిక—ప్రవితతసముచ్ఛేద — సంప్రసాద - ఈ మొదలైన సోపసర్గప్రయోగములు తఱచుగ శ్రీనాథుడు తనయిష్టానుసారము వాడుచుండును. ఇష్టానుసారమనగా, ఇతరకవులు ప్రాయికముగ వాడలేని తన్నమాట.

ఆదిపర్వములో నన్నయ "......తపాస్యగత శ్రమశాలి నన్న యత్యనఘుల వాలఖిల్యులను నమ్మునినాథుడు గాంచి నెమ్మితోన్." అన్నాడు. అనఘులు అనగా పాపరహితులు. అత్యనఘు లనగా, ఏపాపమును లేనివారని యర్థము చెప్పకోవలెను. ఇది యొత్తి పలుకుట. ఇట్టిచోట్ల నట్టి 'అనఘులు' అన్నను ప్రమాదము లేదు. వాలఖిల్యుల విషయములో నీ సామాన్యత చాలదనియో! నన్నయ 'అత్యనఘు'లనెను. ఇది నన్నయ ఉపసర్గసమాసజ్ఞత. నన్నయలోగాని, తిక్కనలోగాని, మఱొక శ్రీనాథుని వెనుక ముందు గల కవిలోగాని, ఉపసర్గాదుల నెఱిగి విచ్చలవిడిగా ప్రయోగించుచాతురి, అలవాటు తక్కువ. అది శ్రీనాథుని సొమ్ము. అతని కవిత్వపు నారకు, అతని సమాససంఘటనమునకు ఆ ఉపసర్గసంధాన మెంత యంద మిచ్చినది. ప్రతిచోట, శ్రీనాథుడు వాడిన సోపసర్గశబ్దములు బొత్తి తీపరిపాకములుగా నున్న వనుటకును వీలుపడదు. ఒక్కొక్క కవిశైలికి ఒక్కొకటి సొగసు.

# మా కవిత్వము - నా విమర్శ

(హాస్యరచన)

●

— శ్రీ సామవేదుల సీతారామశాస్త్రి —

నేనిమీదికి రాజశ్రీ నేనుకవిగారిని ప్రవేశిస్తాను. తెరలో—"జయ జయ అనన్యసామాన్య కవితావిమర్శనాశారద రాజశ్రీ నేను కవిగారికి"—

అంతట రాజశ్రీ నేనుగార్ని ప్రారంభిస్తాను.

"ఆర్యులారా! సోదరులారా! ఈ మీటింగు పెట్టడంలో నాయొక్క ఉద్దేశ్య మేమిటో మీకు తెలుసు. మీ రెందుకు వచ్చేరో నాకుకూడ తెలుసు. కాని ఈ సభకు సోదరీమణు లెవ్వరూ రాకపోవడంవల్ల ఒక తీరని కళంకం ఈ సభను ఆక్రమించుకుంది.

"ఇటువంటి సందర్భంలో, మీ కాలాన్ని వృథాచెయ్యకుండా, నా అమూల్యమైన అవకాశానికి భంగం రాకుండా, మీ యెదుట, నేడు, రాజశ్రీ నేనుగార్ని లోకాతీతమైన కవితాస్రవంతియొక్క అద్భుత భావప్రవాహతరంగాలలో మిమ్ములను ఒక్కొక్కరను ముంచి, అనంత ఆనందంలోకి నెట్టుటకై నిలిచేను.

"అన్నట్టు మరిచేపోయేను—ఇంతటి గొప్ప మీటింగులో, ఇంతటి గొప్ప అడియన్సుముందు, ఒకానొక లెక్చరు యివ్వబడుతున్న సమయంలో, అధ్యక్షుడనేవాడు లేకుండా ఉండడం భావ్యంకాదని మీలో చాలామంది తలుస్తారని నే ననుకోకపోలేదని మీకు తెలుసును. 'ఇంతమందియెదుట మాట్లాడగలిగే శక్తి గలిగియున్నటువంటి యీతని కొక అధ్యక్షుడు కూడా ఉండాలా' అన్న ఊహకూడా మీలో కొందరు తెలుసుకోలేకపోలేదని నే ననుకొన్నందుకు మీరు క్షమిస్తారని నేను తలుస్తాను—ఏది యెలా ఉన్నా మీలో ప్రతివాడూ కూడా 'నన్న అధ్యక్షుణ్ణుండమంటారుగాబోలు' అంటే నన్నే అధ్యక్షుణ్ణుండమంటారుగాబోలు'నని అనుకుంటున్నప్పుడు అందులో ఒకరి ఆకాలత చిగురులేకుండా ప్రశ్నించగా, ఇంకొకళ్ళ ఆశ మామిడిచెట్టు ఆకాలంలో ఆకురాల్చే స్థితిలోనుండగా నేను చూడలేక భోరుమనిఏడుస్తే, మీ రెవ్వరూ సహించలేరని ఎరిగి, అంతటి కిరాతకార్యానికై విముఖత కలిగి, ఈ అధ్యక్షపదవిని నేనే ఏదోవిధంగా స్వీకరిస్తాను." అని టేబిలుమీద వున్న పూలదండను తన మెళ్లో తనే వేసుకొని, "అందరూ చప్పట్లు కొట్టండి" అని తనే అందరికంటే గట్టిగా చప్పట్లు కొడతాడు.

"ఇక రాజశ్రీ నేనుగార్ని అధ్యక్షోపన్యాస మిస్తాను—

"సభాసదులారా! ఆధునిక కాలంలో, యుద్ధానంతర ప్రపంచకంలో, విశ్వవీథికంలో జరుగుతున్నట్టి మార్పులు మీరు చూస్తూనే ఉన్నారు. నేనూ చూస్తూనే ఉన్నాను. దానినిగూర్చి మీరు వినదలుచుకోలేదు గాబట్టి నేను చెప్పను.

"ప్రతీఖండంలోనూ యిప్పుడు యంత్రయుగం ప్రారంభమయింది. పూర్వము మనుష్యులు నడిచేవారు. ఇప్పుడు పరిగెడుతున్నారు; ఎగురుతున్నారు... ఇంకా...ఎగిరి పోతున్నారు—ఇంతకుముందు విమానాల్నాధారంచేసుకొని కొద్దిమందే ఎగురగలుగుతే, యిక ముందు పరమాణుశక్తివల్ల ఒక్కమాటుగా, దేశాలకి దేశాలే ఎగిరిపోతాయి. ప్రస్తుతం నాగరికతాచక్రం యొక్క పరిభ్రమణవేగం చాలా హెచ్చిపోయింది... ఈవిధంగా అన్ని దేశాలూ ముందుముందుకి మెయిలుట్రెయిన్లలా నడిచిపోతూఉంటే మనం మైలురాళ్ల లాగ ఒక్కచోటనే ఉండిపోడం భావ్యం కాదు.

మయి ఉండవలసిన అవసరం లేదు. భావమభావమయినా భయం లేదు. రసం సింకించినా రసాభాస సయితం లేదు. అంతేకాదు...వాక్యములకు సందర్భం ఉండనక్కరలేదు. మాటలకే అర్థ మక్కరలేదు. అయితే, సాహిత్య మేమిటంటారా! కవిత్వ మేమిటనరుగారా! రచన యేలాగ నంటారా! అదే తమాషా! అదే ప్రత్యేకత ...ఏమీ లేకుండానే దస్తాలదస్తాలు నిండిపోతున్నాయంటే ఆశ్చర్యంకాదూ! అందుకే మనం ఆనందించాలి...పూర్వులు తమ కవిత్వానికి ఒకటికంటే ఎక్కువర్థాలు కల్పించి, ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాలను వ్రాసేరుగాని, ఒకటికంటే తక్కువ, అంటే ఒక్క అర్థంకూడా లేని, నిరర్థక వ్యర్థ కావ్యాలను వ్రాయగలిగేరా!...అది కొంతమంది నవకవులకే చెల్లింది... అంతకంటే గొప్పపేరు సంపాదించుకొన్న మాకే చెల్లింది.

"ఆరంభోపన్యాసంతోనే మీ టైమంతా పాడు చెయ్యదలుచుకోలేదు. మీకు మా కవిత్వాలోనున్న క్రొత్తపద్ధతులను కొంచెం చూపి విరమిస్తాను. వారు, అంటే మా సంఘసభ్యులు మీయెదుట వారి పుస్తకములను చదివినప్పుడే మీకు వారియొక్కయూ, రాజశ్రీ నేనుగారియొక్కయూ ఘనత అర్థమవుతుంది.

"నా గద్యపద్యాలనే పిస్తోలుతో పద్యాల కాళ్లను తెగనరుకుతానని మాగురువుగారు మాయీసమితికి మూలవాక్యాన్ని జారీచేసి, ఒక నూత్నభావం మా కందజేసే రని మీకు నేను మనవిచేసుకున్నాను. కాని, ఆయన ఇంకా పూర్తిస్వాతంత్ర్యం చూపడానికి భయపడ్డారు. అతను ఇంకా ఎందుకో మొహమాటపడుతున్నట్టున్నారు. ఎందుకో ఆలోచిస్తున్నట్టున్నారు. కాని, మా కాభయం లేదు. నలుగురూ నవ్వుతారన్న సిగ్గులేదు. ఎవ్వరి! అర్థంకాలేదనే కించ లేదు. మేమే గాని ఆ భావాన్ని వెల్లడిచెయ్యాలీ అంటే "నా గద్యపద్యపిస్తోలుతెగనరికితపద్యాలకాళ్లన [illegible]" అని ఒక్క సమాసంలో కొట్టిపారేస్తాం. మనం సంస్కృతాన్ని భాషలో వాడుకుంటున్నప్పుడు దాన్ని తెలుగునించి ఎడంగా ఉంచడమేమిటి! ఈ అస్పృశ్యతాయుగంలో సంస్కృతాన్ని తెనుగంటకూడదనే అర్థంలేని పురాతనాచారాన్ని మనం శుద్ధిగా అనుసరించడం చాలా శోచనీయమని నే తలుస్తాను. అందరూ కలిసిపోవాలి...అన్నిభాషలూ కలియాలి...నాలుగుచేతులూ కలియాలి.

"ఈవిధంగా మేం క్రొత్తక్రొత్త పద్ధతులతో కవితాపుష్పాల వందజేస్తాం—అవి ఒత్తి కాగితంపూవులని మీలో కొందరంటారా? కాగితపూ, గడ్డిలో పుష్పాలనే పేరు దాని చివర నిలిచేరుగదా! అదే చాలు.

"నా క్రీ అక్షరకవిగా రూపొందిస్తారు—ఆయన లోపలనుండి వచ్చేలోపల మీకు అక్షరకవిత్వాంయొక్క అభిప్రాయం వెల్లడిచేస్తాను.

"అసలు భాషాప్రారంభంలోనే ఈశ్వరుడు తన ఢమరుకను మ్రోయిస్తూ, ఆ లయకు సరిపోయేటట్టు, నోటికి వచ్చిన ఉచ్చారణలను 'అఇఉణ్' అనే అక్షరముల రూపకంగా వెలిగ్రక్కేడు. అవి మహాభావార్థ యుక్తమయిన బీజాక్షరాలుగా అప్పటి మహర్షులు గ్రహించి, వాటికి వారి యిష్టమువచ్చిన అర్థాలను కల్పించుకొన్నారు. అప్పటికాలంలోనివాళ్లందరూ "ఓహో"అంటే"ఓహో" అనడంవల్ల ఆ అర్థంలేని అక్షరాలే, మహామహిమను వెల్లడించే బీజాక్షరాల్లాగ, మంత్రాల్లాగ, తయారయినాయి. అదంతా ఎడ్వర్టైజ్మెంటుయొక్క ఫలం! ప్రకాశకులయొక్క చలాకీ! కావ్యాదర్శయొక్క గడుసుదనం—ఆ తరువాతిరూప "ఓం హ్రీం హ్రాం" అనే అక్షరకవిత్వం వెల్లివిరిసింది. అప్పుడు ఉన్న ఆ కొద్దిమందీ ఏవో వాటికి ఉన్నట్టు, లేనట్టు, అర్థాలు అక్షరాని కొపది,పదిహేనేసి చొప్పున పెట్టుకొని సర్దుకొనేవారు. ఆ వెనక, దేశాలు పెరగడంవల్లను, సంగతులు వృద్ధిఅవడంవల్లను, అభిప్రాయభేదాలభివృద్ధి పొందడంవల్లను ఒక్క అక్షరార్థంలోనే కత్రలు విరగవలసివచ్చిన పరిస్థితిలో మాటయొక్క సృష్టి బయలుదేరింది. ఆ మాటలనుండి వాక్యాలు బయలుదేరాయి. ఈ విధంగా ఇప్పుడు, ఒక ఉద్దేశం తెలుపుకు చెయ్యాలీ అంటే, చాంతాడంత సమాసాలతో, మూడు నాలుగు పేజీల వాక్యాలు వ్రాస్తేనేగాని అర్థంకాని అవస్థ వచ్చింది. ఉదాహరణకి:— "శ్రీయేశతాక్కార్యాచరణకుప్తుంనకై నేను అమందానందకందళిత హృదయార

వింతంత సైతి"వని ఒక గ్రంథాంతసమాసాంతవాక్యంలో వాడు చెరువులు నింపే కుంపట్లతో చెప్పే ఆ భావాన్ని మా సమాజానికి చెందిన అక్షరకవిగారు "శ్రీ" అనే ఒక్క అక్షరముతో వెల్లడిచేస్తారు. ఇది ఒక Fundamental Example మాత్రమే. ఆయన మీముందు చదువబోయే గ్రంథములలో మీకు దాని యొక్క గొప్పతనం తెలుస్తుంది. మనం మనయొక్క జాతీయతను నిలుపుకోవాలీ అంటే సనాతనపద్ధతులను తిరిగి పునరుద్ధరించి మనం మాతృ సగుణత్వానికి తీసుకురావాలి. అదుగో—శ్రీ అక్షరకవిగారు వస్తున్నారు. రాజశ్రీ సేనగార్ని యింతటితో విరమిస్తున్నాను. మీరుమాత్రం చప్పట్లుకొట్టండి." అని తను చప్పట్లు కొడుతూ కూర్చుంటాడు. అంతలో శ్రీ అక్షరకవిగారు చప్పట్లుకొడుతూ ప్రవేశిస్తాడు. అసలు పేరు N. I. R. అక్షరకుక్షి...శ్రీ అక్షరకవిగారు చేతులు జోడిస్తూ సభవైపు తిరిగి, నమస్కరించి, కొంతసేపు కన్నులు మూసుకొని, తెరిచి, "శ్రీ" అంటాడు. రాజ శ్రీ సేనగారిని మళ్లా లేచి—

"అయ్యా! ఒక్క మనవి—మీరు యిప్పటికున్న కావ్య ప్రబంధాలలో అలవాటుపడిపోయి, ఇటువంటి నవ్య భావాలవారైన యీ అక్షరకవిత్వంలోని మహత్త్వం గ్రహించలేరని తెలుసు. దాని భావం నాలాంటి విమర్శకులకే తప్ప అసలు కవిగారికూడా తెలీదని నా విశ్వాసం. కవిత్వం అనేది ఎలాగుండాలీ అంటే, అందులోంచి మన యిష్టంవచ్చిన అర్థం పిండుకొనే అవకాశం ఉండాలి. మీకు యీయనకవిత్వంలోని భావాలు అర్థంకావుగాబట్టి, నేను దానిని వ్యాఖ్యానించి, విపులీకరించి, మీయందరిముందు ప్రసరిస్తాను.—

అసలు, మొట్టమొదట ఈ కవిగారు ప్రార్థనా పద్యంగా 'శ్రీ'అని ఉచ్చరించారు. ఆహా! ఇందులో భావం ఎంత అనంతమయింది! ఎంత అగాధమైనది! ఎంత అనిర్వచనీయమైనది! ఇది అసలు నాకుగూడ Explain (వివరణ) చెయ్యడానికి అందని భావాలు కలవు. అయినా, మీకంటే నాకు చాలాగట్లు ఎక్కువ తెలుసునుగాబట్టి, మీరర్థంచేసుకోగలిగినంత చెప్తాను.

"శ్రీ"—అన్నారు కవిగారు. పూర్వం 'శ్రీకారము పెట్టి-ని ప్రారంభించన్నచాలు' ఏదో జరుగుతుందని ఏకవిగారో అన్నారు. వారికికూడా పాపం ఆ 'శ్రీ'కారంలో మహాత్యం పూర్తిగా తెలిసినట్టు కనబడదు. అయినా, కొద్దిగానైనా గ్రహించుకోగలిగేరు కాబట్టే, పద్యాది నుంచమన్నారు. కాని, దాని పూర్తిభావం గ్రహించిన యీ కవిగారు దానిని పద్యాదిని గాక పద్యమధ్యమునందు, పద్యాంతమందుగూడ అంటే, అంతపద్యాన్ని అదే ఆక్రమించుకొనేటట్లు సర్వం చెప్పేశారు— 'శ్రేష్ఠా' కవీ! 'శ్రేష్ఠా'!! నీ ధీశక్తి, నీ భావం, నీ అర్థం ఎంత ఘనమైనది!

"శ్రీ" అన్నదానిలో—'శ'కార 'ఈ'కార 'ర'కారము లున్నవి. అంటే శ—శంకరుడు, ఈ—ఈశ్వరుడు, ర—రక్షించుగాక, అనే దీర్ఘ ఆశీర్వచనం కూడ యిందులోనే గర్భితమై యున్నది. ఇదిఒక అర్థం. ఇంకో అర్థం—శ, ర, ఈ అని విడదీసేం కదా! కలిపి చదువ్తే శరాయి అయింది. అసలు మన తెలుగుభాషలో సకారమే గాని శకారము లేకపోవడంవల్ల 'శరాయి' అంటే 'సారాయి' అయి కూర్చుంది. దీనిభావం ఏమిటో మీ కింకా అర్థంకాలేదు కదూ!... 'సారాయి' అనడంలో—'నా యొక్క యీ అక్షరకవితారసాన్ని గ్రోలినవారు, అప్పుడే కాచి, వడబోసి, తేర్చి, యిచ్చిన సారాయిలోని స్వాదుత్వాన్ని అనుభవించి, తలపుగొలుసుల కట్టుబడిన ఆనంద డోలికలలో ఊగియాడుతూ ఉంటారని భావం...ఇంతే కాదు, ఇందులో ఇంకో ధ్వన్యర్థంకూడా వున్నది. ఇన్నాళ్లబట్టీ, ద్రాక్షాపాకాలను, యిక్షుపాకాలను, నారికేళ పాకాలను త్రాగలేక, బాధపడిన మీకు నేటి నా కవిత్వంలోని 'సారాయి' ఒక నూతనత్వం కాన్పరచి క్రొత్తలోకాలలో విహరింపజేస్తుందని.

"శ్రీ"—మరో అర్థం ఆలోచిద్దాం. శ ఈ రా అని విడదీసేం కదా! దాన్ని ద్విత్వోచ్చారణం చేస్తూ త్వరగా అనండి— 'శాయిరాశాయిరాశాయిరా'......ఏమిటయింది? రాశాయిరా, రాశాయిరా—. అది అతని యొక్క 'Theme' (వస్తువు)ని వర్ణిస్తుంది—వ్రాతయే తనయొక్క పరమావధి అనిన్నీ, తన జీవితాది

మహాగ్రంథములు 'రామాయణా'లనే మాత్రంమీదనే ఆధారపడియున్నాయని భావం.

“శ్రీ”—యింతాచేసి ప్రార్థనావద్యంలో ప్రార్థన విషయమే ఏమీలేదే అని మీలో కొందరనుకుంటు న్నట్టున్నారు. ప్రార్థనార్థం లేకపోవడమేమిటి! శ్రీకా రంలోనే లక్ష్మీస్తుతి ఉంది. అంతేగాక, అందులోని మూడువర్ణాలూ కలిసింది వాటి అధిష్ఠాతలు 'శంకర' అనే వాటిలో పార్వతీస్తుతి ఉంది. ఆ విధంగానే 'వాణీ మనోహర' అనే సరస్వతీస్తుతికూడా ఉంది. ఇది యింకా వైచిత్ర్యం. ఇంకా ఈ ఒక్క వర్ణానికే— 'ఈ ఒక్క అక్షరాన్ని పట్టుకొని వర్ణం, వర్ణం అని తికేస్తున్నారేమిటో' అని అనకోకండి—చివర వర్ణాల్లోనే అక్షరవర్ణాలను రచించిన ఈ కవి ఆ పేరే తన రచనకు పెట్టుకున్నారు. ఇంకా ఈ ఒక్క వర్ణానికి రామాయణ, భారత, భాగవత గీతా ప్రాచీన మహాపురాణాదులలోని సర్వసారాంశాలనుంచి గ్రంథార్థసారము చెప్పవచ్చును. దీన్ని చదివింది, విన్నది, చదివింది, పాడింది ఆనందించేవారికి దాని అర్థం బోధపడుతుంది. కవిగారూ! ఇక కానీండి.

“ఊ-క”

“శేష, శేష! ఏం సున్నితత్వం! ఏం మన స్తత్వం! ఏం భావసత్త్వం! నిజంగా యింతటి గొప్ప భావాలు యింత చిన్న, చిలిపి, పొట్టి, సున్నిత, కొనఅక్షరాలలో, రెండే రెండు అక్షరవర్ణాలలో ఇమిడించగలిగేరూ అంటే అది మా యొక్క గొప్పే నను కోవాలి.

'ఊక'—ద్వైతంగాని, పరమతత్వంగాని, జటిలత్వంగాని లేక, ముంమిడిందుల్లోని చల్లగా, మెత్త గా, నిజంగా 'ఊక'లాగే తేలిగ్గా, ఆహా! ఎంత చక్కగా ఉంది! సరే, దీని అర్థం చెప్తాను వినండి— అసలు మీకు ఎవ్వరికీ వేదాంతంలో పరిచయం లేదు. అందుచేత యిలాంటి అర్థం రావు. కవి అన్నవాడు అవు పరాన్ని బట్టి వేదాంతికూడాగా బట్టి, ఈయన దీన్ని వేదాంతపరంగా వ్రాసేరు.

'ఊక'—ఇదివరకు నే చెప్పినట్లు దీన్ని ద్వైత దర్శనం చెప్పాలంటే—'ఊకతూకూ'—ఏం! అర్థ మయిందా? అంటే—'ఓ! జీవా! నీ వొక ఊక- అంటే Husk ని 'కావ్యమనూ' అన్నమాట. శేష! శేష! ఇతన్ని ఎవరైనా పొగడగలరా! ఒక్క 'ఊక' అనే రెండక్షరవర్ణాలలో ఒక్క ఊక అనే పొట్టు మాటల్లో ఎంతటి మహత్తరభావం యిమిడ్చేడో చూడండి. ఆ 'ఊక'లో బియ్యపుగింజని యిమిడ్చి ధాన్యం రంకుడు మనకు ధాన్యాన్నిచ్చినట్టే, యీయనగూడ యీ ఊకలో భగవద్గీతాసారాన్నంతా యిమిడ్చేరు. అయితే, యింతలోని బియ్యపుగింజ కనిపించడం లేదని మీరు దిగులుపడుతున్నారా! దాన్ని మీరు ఊహించుకోవాలి. అనుమానించుకోవాలి. తెలుసుకో వాలి...ఇంకా యిలాగే గింజకోవాలి—ఇంకా వినండి.

“ఊకతూకూ-తూకూతూకూ”—ఇది రెండవది. అంటే, మట్టి ఊకవంటి ఈ శరీరంలో 'కావు, కావు' అనే జీవాత్మను కలవాడవు నువ్వూ అని. ఈ జీవాత్మను కాకియొక్క స్వరంతో పోల్చడంలో మీకు ఏమి ఉద్దేశ్యం తట్టలేదా! ఏ భావంబును పుట్టలేదా! ఏమి చెప్పడం కలుగలేదా! పోనీ, వ్యాకరణాలలో పండితులం లేకపోతే గ్రామ్యాలలోనైనా పండితులం కలుగవలెనే!... 'కాకి చిరంజీవి' —కాకి జీవనమెంత చిరంజీవితత్వంతో అంతటిదనుక సమర్థంగా చెప్పినట్టున్నది. అటువంటి చిరంజీవైన 'కాకి' ఈ 'ఊక'లో చేయబడుతుంది. అంటే, ఎటువంటి నూకనే, ఏదారికొకటి కట్టుకొని, ఆ రోటాడి గడిపిపోగానే ఏ విధంగా ఆ గూడు విడిచి, యింకో గూడులో చేరుకుంటుందో ఆ విధంగానే ఈ జీవాత్మనే చిరంజీవైన కాకి ఈ ఊకలాంటి శరీరాన్ని విడిచి మరో ఊకని చేరుకుంటుంది. సరే, దీని వేదాంతపరార్థం మీకు చెప్పను. ఇంతేకాక, యిందులోనే మంచి శృంగారరసం చిలికించేటి భావంకూడా నిబిడీకృతమయ్యుంది.

“ఊ-కా”—చిన్నప్పుడు మీరు కుమారసంభవం చదువుకున్నారనే తలుస్తాను. అందులో ఆ కాళిదాస కవి పార్వతీదేవికి 'ఉమా' అనే పేరు రావడానికి సబబుందో చెప్తాడు. ఊ-ఓ చిన్నదానా! మా—మానుమా! అంటే, ఓ చిన్నదానా! తపస్సు మానుమా అని ఆవిడ తల్లి గారు తిరిగి తిరిగి చిదికన్నను బుజ్జగిస్తూ ఉండడంవల్ల అదే ఆవిడ పేరుగా పరిణమించిదట. ఆ విధంగానే, ఈయన తన ప్రేయసిని, 'ఊ—ఓ చిన్న

దానా! క-Come on-అంటే, కదలిరమ్మ'అని సంబో
ధించేను. ఆహా! ఇతని ఆత్మవిశ్వాసం ఎంత గొప్పది!
...మిగతా పిరికికవులలాగ యీయన ఈవారనుండి
ఆ వారనుండి, ఈ చెట్టుచాటునుండి ఆ యింటి కన్నా
మీదనుండి, ఏ కాకిమీదనో ఏ పిచికమీదనో పెట్టి,
ఎవ్వరికీ అర్థం కానట్లు చెప్పి, అందరికీ అర్థమయిపోయే
టట్లు ప్రవర్తించి, చంద్రుణ్ణి తిట్టి, యింద్రుణ్ణి తిట్టి,
చచ్చి, చెడి, మూడుచెంబులనీళ్లు త్రాగినట్లు కాకుండా,
డైరెక్టుగా, ముఖాముఖీగా, బ్యాంకులోని డబ్బు తీసు
కొంటున్న వర్తకర్లాగో, ముకాణంవాడికి అప్పుతీర్చడానికి
వెళ్లే ధీమాతో 'Come on my Darling' అని పిలి
చేడు.—'దగ్గరకు రావే పిల్లా' అన్నాడు. చల్లకు వచ్చి
ముంతదాచడ మెందుకన్నదే అతని భావం. నేను
పిలుస్తే రాకపోతుందా అనే విశ్వాసం—అన్నీ ఇందు
లోనే వ్యక్త మవుతున్నాయి. ఈ కవిగారి ప్రవర్తన,
అంటే గుణావగుణాలన్నా, యీ కవిగారి మానసిక
విజృంభణము అన్నీ ఈ 'ఊక' అనే పదన్యాసం
లోనే విశద మవుతున్నాయి. ఆయన తన ప్రియుసికి
'ఊక' అనే పేరు పెట్టుకున్నాడు. తన పుస్తకానికి
'ఊక' అనే పేరు పెట్టేను. తన కావ్యాన్నంతటినీ
'ఊక' తోటే నింపేశేను...ఏకీ నేనింకా కొంచెమే
చెప్పేను. దీనికిగాని శంకరుడు భాష్యం వ్రాస్తే
ప్రస్థానత్రయభాష్యానికి రెండున్నరరెట్ల గ్రంథం తయా
రయేదేమో! శ్రీనాథుడేగాని అర్థం చేసుకొనిఉంటే
తన గ్రంథాల్లో మొదటినుంచి ఆఖరదాకా 'ఊక'నే
దంచి ఉండేవాడేమో!

(సభలో 'ఛీ' అని కొందరు, 'థూ' అని కొందరు
అంటారు.)

"Excellent! Good! Too realistic! భేష్!
ఇదే మా కవితాసమితి యొక్క గొప్పతనము!...ఇదే
మా ఆశయము!... ఇదే మా వాంఛితము!...

" అసలు కవిత్వం అంటే ఎలాగుండాలి? రచన
అంటే ఏవిధంగా ఉండాలి? కళ అంటే ఏరూపంలో
ఉండాలి?...అది అందరూ అర్థంచేసుకోవడం కష్టం.
కవిత అగ్నిలా ప్రజ్వరిల్లిపోవాలి. నదిలాగ ప్రవహించి
పోవాలి. సముద్రంలాగ అగాధమయి ఉండాలి. ఆకా
శంలాగున అనంతమయి ఉండాలి. అంతేగాదు—నిప్పు
అంటిస్తే అన్నీ అంటుకొని ప్రజ్వరిల్లిపోయేటట్లే,
ప్రవాహంలోపడ్డ వస్తువులు ఆ వేగంలో కొట్టుకొని
పోయేటట్లే, సముద్రంలో పడిన బరువు అగాధంలోకి
దిగిపోయేటట్లే, అంతా అయిపిమ్మట ప్రాణాలు
ఆకాశంలోకి ఎగిరిపోయేటట్లే, మేం మా కవిత్వం విని
పించేటూ అంటే, అందులో అందరూ తన్మయత్వం
పొందిపోయి, కవితోజ్జ్వలకీలలలో ప్రజ్వరిల్లి, ఆనంద
వీచికలలో తేలియాడుతూ, అనిర్వచనీయా గాధ భావ
సంద్రాన్ని మునిగి, ఆపైన మనోభావనాకాశాన్ని పరి
భ్రమిస్తూ ఈ కవిత్వపు భావాత్మోద్రేకంవల్ల తాము
కూడా కవులయిపోయి ఊరుకోవాలి.

"ఆహా! మీ యొక్క రసికత్వం! మీ యొక్క
భావగాంభీర్యం! ఎంత ఘనమైనది! మీకుగూడా
భ్రమరకీటకన్యాయంగా కవిత్వం అబ్బింది. అసలు
భావోద్రేకం లేని దెవరు! జీవితంలో అనేకాను
భవాలు పొందని దెవరు! అందరి హృదయాలూగూడ
భావాలతో నిండి, పొంగి, ఉబ్బి, పొర్లిపోడానికి
సిద్ధంగా ఉన్నాయి. దాన్ని మా సమాజంలోని సభ్యు
లు వారి సునిశిత భావార్ద్రవాక్కులతో తెలిపినప్పుడే
కవితాప్రవంతి బహిర్గతమయి, మనస్సుకు సంతోషం
కలిగిస్తుంది. ఆ ప్రవాహాన్ని అరికట్టినంతసేపూ హృదయ
వేదన దుర్భరంగా ఉంటుంది.

"మా సహవాసదోషంగా మీలో కవితాధారో
ద్భూతమైన యీ రెండుపద్యములవల్ల ఆ విద్యుచ్ఛక్తి
ములయిన భావతరంగాలు పంచభూతములను ఆక్ర
మించి, భువనభాంతరాళంబుల స్తంభింపజేసివేస్తూ
ఉంటే, పెద్దభూతాలను చూచినట్లు తెలియనివారంతా
కళ్లువప్పజెప్పి చూస్తున్నారు. మీ రుచ్చరించిన ఈ
యేకాక్షరీ పద్యాలలోని అర్థం మీరు కవులగుటచేత
మీకు తెలియకపోవచ్చును గాని, అనన్యసామాన్య
కవితావిమర్శనాదక్షుడనైన నాకు బాగా
తెలుస్తోంది. మీలో కొందరు 'ఛీ' అంటే, 'Cheering'
అని ఇంగ్లీషులోను, 'చిదానందం అనుభూయతే' అని
సంస్కృతంలోను 'చిత్రం'గా ఉంది అని తెలుగు
లోనూ పొంగిపోతూ ఉంటే. మరికొందరు, 'థూ,'

# రసప్రకృతి

శ్రీ ఆమంచర్ల గోపాలరావు

సౌందర్య కళ ఉద్దేశ్యం రససృష్టి అని ఇదివరకే అన్నాను. అందుచేత ఈ రస ప్రకృతిని గూర్చీ, చిత్రశిల్పాదులలోను ఈ రసోత్పత్తి విధానాన్నీ, [illegible]గూర్చీ కొంతవరకు చర్చించవలసి ఉంటుంది.

ఉత్తమకళాసృష్టివలన మనలో ఒక భావం ఉదయించి, తన్మూలంగా కళాసృష్టియందు మన లోక పరిపూర్ణ నిమగ్నత కలిగి, ఆ భావం స్థాయీపరమై పెచ్చు పెరిగి, తదనుసారంగా మనం ఒక అనిర్వచనీయ మయిన అపరిమితానందం అనుభవిస్తాము. అప్పుడు మనకు రసానుభూతి కలిగిందంటాము. ఆనందస్వరూప మయిన ఈ అపరిమితానందాన్ని రసం అన్నారు. అందుచేత రసప్రకృతి మనలో కళాసృష్టివలన ఉద యించే ప్రధానభావాన్ని అనుసరించి ఉంటుంది. భావాలు అనేకరకాలుగా ఉండటంచేత, రసాలు కూడ అనేకంగా ఉండకతప్పదు. కాని ప్రతిభావం మనలో స్థిరపడుకొని స్థాయీపరంగా పెరిగి రసం కాగల శక్తి కలది యుండదు. ఈ శక్తి కలిగిన భావాలు కొన్నిమాత్రమే. మానవహృదయనైజం బాగా శోధించిన మన పూర్వప్రవక్తలు, ఈ భావాలు ఎనిమిదే, అందుచేత మనం అనుభవించగల రసములు ఎనిమిదేనని ప్రప్రథమాన నిర్వచించారు. కాని కొంత కాలమయింతర్వాత బహుశా క్రీ. శ. అయిదవ, లేక ఆరవ శతాబ్దాలలో, పై ఎనిమిదిభావాలలాగే మరొక భావం మన హృదయంలో స్థితి పొందుకొని, స్థాయీ పరంగా పెరిగి రసం కాగలదని నిర్ణయించి, పై ఎనిమి దింటికి శాంతరసమను మరొకరసాన్ని చేర్చి, రసాలు మొత్తంమీద తొమ్మిదింటిగా నిర్ణయించారు. అందు చేతనే ఇప్పటికి నవరసాలని అనడం, వినడంకూడ సంభ విస్తోంది.

కళాసృష్టివలన మనలో స్థిరపడుకొని స్థాయీ పరంగా పెరిగి, రసం కాగల తొమ్మిది భావాలు వరుసగా రతి, శోక, క్రోధ, ఉత్సాహ, విస్మయ, హాస, భయ, జుగుప్సా, నిర్వేదాలు. ఈ భావాల ననుసరించిన నవ రసాలు శృంగార, కరుణ, రౌద్ర, వీర, అద్భుత, హాస్య, భయానక, బీభత్స, శాంతాలు.

రసానుభూతి, ఒక కళాసృష్టివలన మనలో మొదట ఒక భావం అంకురించి స్థితి పొందుకోవాలి. తరువాత ఆ భావం స్థాయీపరంగా పెరగాలి. పెరిగి, పెరిగి తుట్టతుదకు ఆ భావం అంతిమస్థాయి నందు కొన్నప్పుడు ఆనందస్వరూపమయిన బ్రహ్మానందాన్ని మనం అనుభవిస్తాం. అప్పుడా భావం రస మయింది. మనకు రసానుభూతి కలిగింది. ఈ తొలిభావం మనలో స్థితి పొందుకొని స్థాయీపరంగా పెరగగలిగి ఉండటం చేత దీన్ని స్థాయీభావ మన్నారు. కళాసృష్టియందలి ఈ స్థాయీభావోదయకారక అంశము విభావ మని నిర్వచనమయింది. అది భావకారణం కనుక విభావం. ఈ విభావ కారణంగానే స్థాయీభావఅంకురం, అది వృద్ధిపొందడంకూడ. తదనుసారంగానే రసోత్పత్తికి అవకాశం. అందుచేత ఈ విభావాన్ని రెండువిధాలుగా మన వక్తలు నిర్వచించారు: ఆలంబన: ఉద్దీపన. స్థాయీభావోదయానికి ముఖ్యకారణమయిన అంశ ము ఆలంబనవిభావ మనబడుతుంది. ఈ స్థాయీ భావాన్ని పెంపొందించడానికి గల కారణాంశము

ఉద్దీపన విభావము. ఎందుకనగా, నిలిచియున్న స్థాయీ భావాన్ని ఇది ఉద్దీపిస్తుంది.

ఈ స్థాయీభావం పెచ్చుపెరుగు విధానంలో అనేక చిన్నచిన్న భావాలు తెరలుతెరలుగా వచ్చి సమసిపోతుంటాయి. వీటిని సంచారీభావా లంటారు. ఈ సంచారీభావాలు స్థాయీభావంవలె మనలో నిలకడ నందవు. చిన్నచిన్న వీచికలవలెగ ఇవి తాకి పోతుంటాయి. అందుచేత స్థాయీభావసాగరమందు ఉదయించి, సమసిపోవు తరంగాలుగా ఈ సంచారీ భావాలను పోల్చారు. )

ఉదయించిన భావం సమసిపోవడం భావశాంతి. సంచారీభావాల ఉదయం, భావశాంతి క్షణికం. కాని స్థాయీభావం కొలదికాలం నిలచినకాని భావశాంతి కాదు. కళాసృష్టియందు విభావం ఆలంబన ఉద్దీపనలతో సంపూర్ణము యినప్పుడు, రసజ్ఞునియందు స్థాయీభావం రసంకానిదీ భావశాంతి కాదు. కాని ఈ విభావమందు ఏలోపం ఉన్నప్పటికీ రసం కావడానికి అవకాశం లేదు.

రసప్రక్రియనుగూర్చి ముఖ్యమైన మరొక అంశము గమనింపవలసియున్నది. రసానుభూతికి కళాసృష్టి ఎంత కారణభూత మవుతుందో, సామాజికుడుకూడ అంత కారణభూతు డవుతాడు. సరియైన యోగ్యత సామాజికునం దుండనప్పుడు, కళాసృష్టి ఎంత ఉత్తమమైన దైనను, రసానుభూతి దుర్లభం. స్థాయీభావం చిగిర్చి, అది వృద్ధి పొందగల అంతర్యం సామాజికుడు కలిగి ఉండవలెను. బీజ మెంత ఉత్తమమైనను, క్షేత్రం తగినది కాకపోయినప్పుడు, తద్బీజము సరిగా ఫలించకపోవడమే గాక, ఒక్కొక్కప్పుడు అంకురవికాసములనుకూడ అందుకొన జాలకపోవచ్చును. అందుచేతనే ఉత్తమకళాసృష్టియందలి సంపూర్ణరసగ్రహణకు పరిపూర్ణ విజ్ఞానసంస్కారము లత్యవసరము లౌతవి. సంస్కారములేని వానికి కళాసృష్టియందు నిమగ్నత యుండుటే దుర్లభం. ఏలనన, ఉత్తమకళాసృష్టి తిలకించినంత సంస్కారము లేమి తెలియనున్న నిర్యోగ్యమైన స్వప్నదర్శనమురీతి కాగలవు. అప్పుడా కళాసృష్టి ఆ మనస్సులందు సరిగా ప్రతిబింబించజాలక, పరిపూర్ణ వికాసము నొందజాలవు. ఇక స్థాయీభావాంకురమే అతనికి దుర్లభం కావచ్చు. ఒకవేళ చిత్రకళను తెలిసిన సంస్కారముండినప్పటికీ, తత్కళాసృష్టి అనుసారిత విజ్ఞానము లేమి, ఇతర సంచారిభావవీచిక లుత్పన్నము కావు. స్థాయీభావం అట్టి రసముకుట దుర్లభం. అందుచేత ద్రష్టకు కళాసృష్టి తిలకించుటకు నిమగ్నతకొరకు సంపూర్ణ సంస్కారమును, అట్టి రసోత్పత్తికి సంపూర్ణ విజ్ఞానమును అవసరమవుతాయి.

అట్టి, ఈ రసప్రక్రియ సామాజికుని మనస్సు యొక్క పరిపక్వతమీద చాలావరకు ఆధారమందిన దగుటంచేత నవరసములను ఆస్వాదన చేయగల్గి, ఆనంద మనుభవించు వారరుదు. సాధారణంగా వారందరూ ఒక రసమో, లేక ఏ కొన్ని రసములనో అందుకొని తన్మయానందమును పొందగలరు. సంపూర్ణసంస్కారమునందిన మనస్సూ, పరిపూర్ణ విజ్ఞానముచే బుద్ధి పరిణతవికాసము నందగలిగి సర్వరసగ్రహణము చేయగల్గు రసికాగ్రగణ్యు లారా నిశ్చయంగా అరుదు.

ఈ కారణంగానే ఉత్తమకళాసృష్టికి చెందగల్గిన అనేకచిత్రములు సర్వజనాకర్షణీయము లయినప్పటికీ, చాలామంది రసజ్ఞులకుకూడ రంజకములు కాకపోవచ్చు. దీనికి కారణం ఆ చిత్రసంప్రదాయములూ, తచ్చిత్రములకు సంబంధించిన పరిపూర్ణ విజ్ఞానమూ లేకపోవడమే. నిశ్చయంగా ఉత్తమకళాసృష్టి తత్సంప్రదాయ విజ్ఞానముం కలిగి, సరియైన సంస్కారమందిన పరమునకు సజీవమై, కల్పనాశక్తి గల సృష్టికర్త అవుతుంది. ఎలాగనగా, నిజకళాసృష్టియైన యీచిత్రము సామాజికుని హృదయమందు అవ్యక్తభావముల నుత్పన్నము చేసి, తద్వార వికాసకారణమై ఆతని యాంతర్యమందు ఒక నిజభావపరివర్తన మీయ శక్తి కలదౌతుంది. ఈ శక్తి ఎల్లప్పుడూ కళాకర్తయొక్క ఉద్దేశ్యప్రాబల్యముల ననుసరించి ఉంటుందనడంలో ఏ సందేహమూ లేదు. ఈ శక్తి ప్రబలమైనప్పుడు చిత్రము సామాజికునియందు వివిధలహరులను ఉత్పన్నము

చేయగలదై, అతని నైజమునే మరొకతికి త్రిప్పగల శక్తివంతమయిన సృష్టికర్తగా పరిణమిస్తుంది. నిశ్చయముగా ఈ సూత్రమే మన ప్రాచీన హైందవకళ కంతటికీ మూలమని చెప్పవచ్చు.

భక్తి, యోగం, తంత్రంవలె కళకూడా ముక్తి మార్గమని మన పూర్వీకులు నిర్ణయించగల్గుటకుకూడ ఈ సూత్రమే ప్రబలాధారం. ఎలాగనగా, యోగ భక్తి తంత్రములంగా, మహోనిమగ్నతతో కూడిన సాధనవలన, మనలోని నిశ్చితలయగుణం మార్పుచెంది, ప్రకృతి యందలి అనేకశక్తులు మనలో ఐక్యత కలిగి, తన్మూలంగా మన అంతర్గం దీక్షితమై ముక్తికి దారి కల్గుతుంది. ఈ తమకళాసృష్టికూడ అదేవిధముగా మన కొక మహోనిమగ్నత నిచ్చి, మనలోని లయగుణులకు కలసిన మార్పునిచ్చి, మన నైజమునకే మరో ప్రకృతి నిచ్చి, ముక్తికి దారి యీయగలుగుతుంది. భక్తి యోగ తంత్ర శాస్త్రములందలివలెనే, ఇందుకూడ మన నైజము మార్పు చెందుటకు సాధన అవసర మవుతుంది. కాని ఇందలి సాధన ఒకటే. పలుమారు ఈ కళాసృష్టిని వీక్షించుట, తద్రసానుభూతిని పొందుట.

కాని ఈ రసప్రకృతి నాటకాలకు, కావ్యాలకు, సంగీతనృత్యములకు మాత్రమే చెందగల దనే భావం ఎక్కువగా అమలులో ఉంది. చిత్ర శిల్ప కళలకు ఈ రసప్రకృతి చెందచేరదు అనే వాదం ఉండడానికికూడ అవకాశముంది. ఎందుకనగా, రస ముత్పన్న మవడానికి స్థాయీభావోదయమే కాక, సంచారిభావ వీచికలకో అవకాశం కల్పించవలసి వుండాలి. గ్రంథాలు, నాటకప్రదర్శన, సంగీతనాట్యములందు, స్థాయీభావోదయం జరిగి, పెక్కు సంచారీ భావవీచికలకు సంపూర్ణావకాశం తప్పక కానిస్తుంది. కాని ఏకముఖమైన చిత్రమందు సంచారీభావవీచికలకు తావెక్కడ అనుసందేహం తప్పక కలుగవచ్చు.

అయినప్పటికీ నిష్ణాతకోవిదులలో చిత్రకులందు నవరసాలు వర్ణిస్తూ, నానావిగ్రహములందు శృంగార, హాస్య, శాంతిరసచిత్రములే ఉంచతగిన వనీ, తక్కిన రసచిత్రములు రాజప్రాసాదములందూ, దేవాలయములందూ ఉంచవచ్చుననీ చెప్పబడియుంది. ఆపైన రాజవాసమందుకూడ పైవాడు రసచిత్రములే ఉంచతగినవనీ, తక్కిన రసచిత్రములు సభాగోష్ఠి మందిరములందే ఉంచతగినవనీకూడ స్పష్టీకరించాడు. అందుచేత చిత్రశిల్పకళల ఉద్దేశ్యం రససృష్టి అనే మన పూర్వీకులు నిర్ణయించినట్లు స్పష్టమవుతుంది. నిజంగా అన్ని కళలవలెనే, సర్వకళలలో ఉత్తమమై అగ్రస్థానం వహించిన చిత్రశిల్పకళలకు రససృష్టే ఉద్దేశ్యం. రసానుభూతికి చిత్రకళయందు సంపూర్ణావకాశం కలదు.

అదెలాగనగా, లయతో తీరం సంపూర్ణంగా అందుకొన్న చిత్రం, ఆకృతి ననుకరించు లయలను మనలో ఉద్దీపింపజేసి మనకూ చిత్రానికి ఒక సంబంధ బాంధవ్యాన్ని ఏర్పరుస్తుందనీ, ఈలయానుభవం మనలోని ధాతువులను పులకరిల్పి, సంపూర్ణభావచలనం కలిగించి, ఆ చిత్రసత్వంతో మన కొక ఐక్యత నిచ్చి, ఆ చిత్రరూపమందు ఒక అద్భుతనిమగ్నత కలిగించి, రసానుభవానికి దారితీస్తుందనీ ఇదివరకే అన్నాము. అందుచేత లయప్రదమైన ఆ చిత్తరువు మనకు సంపూర్ణనిమగ్నత నీయడమే ప్రథమసోపానం. షడంగములు ఒప్పుచూ సౌష్ఠవంగ నుండునట్టి ఆ చిత్రమును వీక్షించినకొలదీ, స్థాయీభావ ముత్పన్నమగుటయేగాక, అనేక ఇతర భావములు చిరువీచికలవలె మనల నావరించి తొలగి పోతవి. తప్పదు! ఏలననగా, చిత్రమునందలి ప్రతి యంశము, ప్రతియంగము ఒక్కొక్క సంచారీభావము నుత్పన్నముచేయగల దౌతుంది. అపైన ఆ చిత్రోద్దేశ పూర్వాపరము లెన్నో అనేకభావవీచికలను మేల్కొల్పి మనలను తప్పక ఆవరిస్తవి. తదనుసారంగా స్థాయీభావం స్థాయీపరంగా మనలో పెంపొంది, రసోత్పత్తి కలుగకమానదు. అందుచేతనే రసవంతమయిన ఉత్తమచిత్రం, ఎల్లప్పుడూ సజీవమయినదే అనుటకేకాక, చూచినప్పుడెల్ల స్థాయీభావం ఉపరి మన కెప్పుడెరుగని అనేకసూక్ష్మపరిణతుల నూతన భావముల నుదయింపజేసి, ఎప్పటికప్పుడు అదోరీతిన రసానుభవం మన కందిస్తుంది. అందుచేతనే ఎన్నిమార్లు చూచినను ఈ చిత్రము ఎప్పటికప్పుడు ఒక క్రొత్త

నిజముగా ఇట్టి ఉత్తమచిత్రంగాని, శిల్పంగాని మనం వీక్షించినపుడు, కళాకర్తను గూర్చిన విచారం మనకు కలుగదు. ఆ చిత్రంద్వారా కళాకర్తతో మన కొక ఐక్యత సంభవించి, ఆ చిత్రకారుని ఆత డెరిగిన ఆ జీవిత రహస్యం మనం ఊహించి, ఆతనితో పాటు మనంకూడ ఆ చిత్రంతో లీనమై, చిత్ర నిరూపణయందు ఆత డనుభవించిన బ్రహ్మానందం మనంకూడ అనుభవించగలుగుతాము. అప్పుడు చిత్రకారుడూ, మనమూ ఆ చిత్రంతో ఐక్యమై, ఏకగతిన నడవడం తటస్థమవుతుంది. చిత్రకళలోని త్రిమూర్తిసాయుజ్యమే ఇది. చిత్రమూ, చిత్రకారుడూ, సామాజికుడూ మూడు మూర్తులైనప్పటికీ, ఉత్తమచిత్రమందు ఈ ముగ్గురూ ఏకమూర్తి కావటం సంభవిస్తుంది. ఈ కారణం గానే శుక్రనీతిసారంలో మహాశిల్పి ఎల్లప్పుడూ దేవతామూర్తులనే చిత్రించవలసినదిగా నిర్ణయించడమయింది. యోగంచేత, భక్తిచేత పరిపూర్ణజ్ఞానమునందు, ముక్తికి చిత్రకళ ఒక సంపూర్ణసాధన మవడమే ఇందుకు కారణం.

సూక్ష్మదృష్టిన ప్రకృతి నన్వేషించి, తత్స్వభావమును గుర్తించి, అంతశ్శక్తులను నిర్ణయించి, రూపభావన మొనరించి, తద్రూపమును సారూప్యంగా మనోగతవికాసముతో కల్పించి, లయప్రదంగా చిత్రించడమే ఉత్తమచిత్రకారుని ఉద్దేశ్యమని ఇతఃపూర్వమే అన్నాము. నిత్యచలనం కలిగిన ప్రకృతి అంతశ్శక్తులు అగణితములు. అలాగే, అపారమైన ఆ శక్తుల రూపములు అనంతములు. నిజకళాదృష్టిన ఈ దివ్య అపారశక్తిమయరూపములు భావనచేసి, ఆ రూపములను దేవతాస్వరూపము లనడంలో ఏవిధమైన తేడాయూ లేదు; సర్వశాస్త్రపారంగతులై, పూర్ణసంస్కారము నంది, అతితేజముగల సూక్ష్మదృష్టిగల అపార అంతశ్శక్తులు కలిగిన ఉత్తమకళాకర్త తద్దివ్యరూపము నొక దానిని మహానిమగ్నతతో భావించి, భావనచేసి, రసవంతమయిన పరిపూర్ణచిత్రము నొకదానిని రచియించి నపుడు సంపూర్ణసంస్కారము నందని సామాన్య జనులకు ఆ చిత్రం అంధపరోగ్యమయిన దేవతా స్వరూపం కాకతప్పదు. వీలనని, చిత్రమును చూచిన కొలది ఆచిత్రవిచార మతనిలో ఉత్పన్నము కాక మానదు. ఆ విచారంవలన కలిగిన సంస్కారం, తదనుసారికవిజ్ఞానం ఆతనికి సమకూడక తప్పదు. సంస్కారవిజ్ఞానముల నందిన వ్యక్తికి రసానుభవం, అనగా ఆచిత్రంతో ఐక్యత, చిత్రకారుని మనోలయ లకు ఈతని మనస్సు శ్రుతిచెందుకొనుట కలిగితీరుతుంది. చివరకి చిత్రకారు డుద్దేశించిన పరివర్తనం ఆతనిలో కలిగి, ఆత డుత్తమపథమున బడకతప్పదు. దీనికంతటికీ వలయు నా చిత్రత్వము వీక్షించి నిమగ్నత నలవరచు సాధన అవసరము. ఆ సాధన దీనికి నిశ్చితమార్గము.

ప్రకృతి యంతశ్శక్తులను తనయందు ఉత్తేజిత మొనర్చుట యోగతంత్రశాస్త్రములందు ఒక ముఖ్య భాగ మయింది. యోగతంత్రశాస్త్రములకు తగిన సంస్కారము లేమి వ్యక్తికి భక్తి అదేరీతిన ఆశక్తులను మానవునియందు ఉత్తేజిత మొనర్పగలదు. భక్తివలన కూడ రాగల ఈ పరిణామం యోగతంత్రములవలనకంటె కొంత ఎక్కువకాలం పట్టవచ్చు. కాని ఈ పరిణామం మాత్రం తప్పదు. ఈ మూడింటిలోను యోగం ఉన్నత సోపానం. ఆ సోపానము నధిష్ఠించలేని జీవికి తంత్రం. తంత్రము నధిష్ఠించలేనివానికి భక్తి ఆటపట్టవుతుంది.

యోగము నభ్యసించగలుగు ఉత్తమజీవి సంపూర్ణ విజ్ఞాన సంస్కారముల నంది, ప్రకృతియంతశ్శక్తుల రూపభావన మే యవసరము లేక, ఆ శక్తులను తనలో ఉత్తేజిత మొనర్పగలిగి, తన యభీష్టసిద్ధి నందగలడు. కాని తంత్రభక్తిమార్గముల నధిష్ఠించు వ్యక్తికి ఆరూప భావన లత్యవసరములు. ఎందుకనగా, తన మనశ్చక్షువునకు ఆదివ్యరూపములు ప్రత్యక్షమైనగాని ఆలయల ప్రకృతులు ఆతనికి అవగాహనములు కావు. అందుచేతనే ఆరూపస్పష్టభావనల వారివారు భావించగల్గినపుడే ఆలయలను తనలో అతి డుత్తేజిత మొనర్పగలడు. మహాశిల్పి చేయు ప్రథమకార్యం, అనగా ప్రకృతి అంతర్యమును ఆతని సూక్ష్మదృష్టితో వీక్షించి, అందలి మహాశక్తుల స్వభావము గుర్తెరిగి, మహానిమగ్నతతో ఆ రూపములను భావనచేయడం ఆతనికి ప్రథమకార్యంగానే పరిణమిస్తుంది. అందుచేత ఒక్కొకప్పుడు, మహాశిల్పి భావనచేసి చిత్రించిన చిత్రములు

తాంత్రికులను, భక్తులను, మహాకవులను లయలగు తమలో ఉద్దీపన మొనర్చుటకు తప్పక సాయపడుతాయి. అందుచేతనే తంత్రవేత్తలు, భక్తులు మహాశిల్పుల సాయ మపేక్షించడం ఏ మాత్రం ఆశ్చర్యకరమైన విషయం కాదు.

ఈ కారణంగానే, ఉత్తమకళాకర్త సర్వశాస్త్రపారంగతుడై, నిజసంస్కారమందిన ఋషివంటి మహాపురుషు డని మన ప్రాచీనులు గట్టిగా నిర్వచించారు. హైందవ సంప్రదాయములను నిర్వచించిన ప్రతి గ్రంథమందును, శిల్పి కీ గుణము తప్పదని స్పష్టీకరించడ మయినది. బౌద్ధసంప్రదాయంలో కూడ ప్రతిమాన లక్షణమందు ఉత్తమశిల్పి కీగుణం తప్పదన్నారు.

ఈ సిద్ధాంతముల ననుసరించే శుక్రుడు ఉత్తమ శిల్పి ఎల్లప్పుడూ దేవతాస్వరూపములనే రచింపవలసి నట్లుగా నిర్వచించాడు. ఇది వట్టి నిర్ణయమే కాదు. ఇది నిజంగా ఉత్తమ కళాకర్తయందలి నిశ్చితమైన పరమరహస్యము.

కళాకర్తలనుగూర్చిన మన భారతీయ భావన మును, నిజకళారహస్యము నెరుగని పాశ్చాత్యవిమర్శ కుల భావనలను ఈ విశేషము ననుసరించే చాల భేదము కానవస్తుంది. మన కళాకర్త సర్వశాస్త్రపారంగతుడై నిజసంస్కారము నంది, ఇంద్రియప్రపంచమున కతీతుడై, మనోవాహనారూఢుడైన పరమఋషి. కాని ప్రకృతి ననుకరించే ప్రధానాంశముగా కాని, ప్రకృతి బాహ్యానుభావముల చిత్రవచనే పరమావధిగా కాన్న పాశ్చాత్యకళాకర్త ఇంద్రియప్రపంచమునకే కట్టుబడి, ఏదో ఒక ప్రగతి ననుష్ఠింపక తప్పదు. స్త్రీ గాని, మద్యమో, మనశ్చాంచల్యమో, లేక మరేదయినా మనో వికారమో యాతని నావహించి ప్రగతిని అతని నడి పింపక తప్పదు.

ప్రకృతియం దంతర్గతమైనది లయ. ప్రకృతి యంతర్గతమం దుద్భవించి, యందే లీన మవునది విన్యాస భావం. లయవలన ఉద్భవించి, లయ ననుసరించి ప్రకృతియందలి ఒక ముఖ్య అనుభావమై, ఈ విన్యాస భావం, సర్వప్రకృతిశక్తులందును ఒక ప్రధానగుణ మైంది. లయ గతిని సూచిస్తుంది. ఇకే ప్రకృతి యంతర్గత మైన పురుషునినీ, విన్యాసభావ నీ స్త్రీ స్వరూపమునీ మన కళాభావంలో ఒక ముఖ్యాంశము. నిజంగా కూడ, ప్రకృతిని పరిశీలనాదృష్టితో గమనించు ప్రతిమానవు నకూ ఈ విషయం ఎంతో కొంత గోచరించకతప్పదు. పురుషు డెల్లప్పుడూ గతిని సూచిస్తాడు. స్త్రీ విన్యాస మును సూచిస్తూ, సృష్టికారణమై, విన్యాస స్వరూప మవుతుంది.

అందుచేత ప్రకృతియందలి శక్తులు భావ భావన లందు గతిని సూచించు శక్తులూ, పురుష రూపముల నందుకొన్నాయి. విన్యాసము నుద్దేశించి నిర్దేశించునవి స్త్రీ స్వరూపాల నందుకొన్నవి.

నిజంగా, స్త్రీ పురుష స్వరూపముల ఐక్యత తనలో కాంచి, సర్వశక్తుల కేకముఖమైన అపారమహా శక్తిని ధరించి, యోగతృప్తి ప్రకృతిని తనలో లీన మొనర్చు కొనడమే యోగతంత్రసాధనలందలి ప్రధానోద్దేశ్యము. భక్తివలన ముక్తి నపేక్షించు వారికూడ ఈ పరమా ర్థము ననుసరించే తనలో స్త్రీభావము నుదయింపజేసి కొని, ప్రకృతియందలి పురుషునిలో తాను లీన మవు టకు ప్రయత్నిస్తారు. మన చరిత్రలో కృష్ణగోపిక లుగా భావించి ఉత్తీర్ణులైన భక్తాగ్రేసరు లెందరో కలరు. గీతగోవిందంలాంటి సద్గ్రంథములకు ఈ భావమే ముఖ్యకారణ మయింది. అనేక పురాతనదేవాలయము లందు మనకు స్థూలదృష్టికి కానవచ్చు బూతుచిత్ర ములకూ కూడ మూలం ఇదే భావం. కాని, అవి ఉత్తమకళాకర్తల చిత్రములుగాక, చేతిపనికిమాత్రమే సంబంధించిన వట్టి బాహ్యానుకరణలే అయినప్పుడు అతిగ్రామ్యంగానూ, ఒక్కొక్కప్పుడు అతి అసహ్యం గాకూడ తోపవచ్చు. కాని, ఉత్తమకళాకర్తలు రచిం చిన ఇటువంటి శిల్పము లెన్నో అతిరమణీయము లైనవి ఇప్పటికీ మన దేశమందు ఎన్నో నిల్చియున్నవి. ముఖ్యముగా బౌద్ధసంప్రదాయంలో ఇలాంటి శిల్పాలు నేపాలు టిబెటుదేశములందు యూరోపియనులరీతిని అత్యు త్తమశ్రేణికి చెందిన అతిరమణీయములై, మనోహరము లైనవి చాల ఉన్నవి. ఏది ఎట్లున్నప్పటికీ అట్టి చిత్ర

మూల ఆదిభావం యోగమునకో, తంత్రమునకో, భక్తికో చెందిన ఐక్యత అవుతుంటుంది; తప్పదు.

హైందవ సంప్రదాయంలో అత్యుత్తమకళా సృష్టియైన, అపారరససృష్టికి కారణమైన అర్ధనారీశ్వర రూపభావన పైన చెప్పిన యోగ, తంత్ర, భక్తి ననుసరించి ఐక్యభావాన్ని సూచించే దన్నదానిలో ఏ సందేహమూ లేదు. ప్రకృతి పురుషుల లయవిన్యాస భావముల తత్సంకలనము ఈ రూపం సర్వతో ముఖంగా సాంకేతిక ప్రపదమై కలిగియున్నది. సర్వ యోగ, తాంత్రిక, భక్తిమార్గముల కిది మూలమై, చివరికి కళాపరమావధియైన సత్యప్రకృతిస్వరూపం ఈ రూపం. అపార అంతఃశక్తుల నిక్షేపం ఈ రూపంలో సంపూర్ణంగా విదితమవుతుంది. సర్వాంతర్వ్యాప్తమైన శక్తులు, అపార తేజములలో సంపూర్ణంగా విరాజిల్లు, నిశ్చలమైన అచలం ఈ రూపం. శిల్పకళాపరమావసానం ఈ రూపంలో నిశ్చయంగా, సంపూర్ణంగా పరిపూర్ణసంస్కార మందిన జ్ఞానికి విదితం కాక తప్పదు.

ఉత్తమ సంప్రదాయములతో విరాజిల్లుతూ, అతిసున్నితపథాన నడిచిన మన మహాకళను అన్వేషించిన పాశ్చాత్యశ్రేష్ఠు లెందరో మహాపురుషులు కలరు. కాని యోగ, తంత్రశాస్త్రరహస్యములను వారెరుగని కారణమున, మన కళారహస్యమును పూర్ణముగా వాళ్లు గుర్తించలేకపోయినారు. సామాన్యజన అనుకరణీయమయిన భక్తితత్వమును వారు చాలవరకు గుర్తించారు. అయినప్పటికీ, రసప్రకృతి నెరుగజాలమిచే, ఆ మహాపురుషులు సయితము మన కళకు ఆదికారణమే భక్తి అనీ, దాని పర్యవసానంకూడ భక్తి అనీ నిర్ణయించారు. మన కళ చాలవరకు భక్తియుక్త అనుభావమే అనీ వారి నిర్వచన. ఈ భావానుసారంగానే చాలవరకు మన కళయందలి ఉత్తమభావన లన్నిటినీ కూడ సమన్వయంచేసి, సమర్థించ ప్రయత్నం చేశారు. కాని భక్తి యోగ తంత్రములవలె కళకూడ ఉన్నతపథాన ఒక యానమని వాళ్లు గుర్తించలేకపోయారు. దీనికి కారణం ప్రకృతి నిజరహస్యమూ, మన సంప్రదాయములూ, లయప్రకృతీ వాళ్లు సరిగా అవగాహన చేయలేమియే అని చెప్పవచ్చును.

ఈ కారణంచేతనే శృంగారాది కొన్ని రసజనిత చిత్రములు, అతిసున్నితభావోదయ కారణమైనవి, వారి దృష్టికందు ఉత్తమశ్రేణికి చెందినప్పటికీ, తద్విగ్రహములందలి భావవిన్యాసమునే వారు గమనించి, సంపూర్ణాస్వాదన మందలేక అంతటితో వదలిపెట్టినారు.

దీనికి ముఖ్యకారణం, వాళ్ళు చక్కగా ఎరిగిన సంప్రదాయములన్నీ యూరపుకళకు, గాథిక్ కళకూ సంబంధించినవి. ముఖ్యముగా గాథిక్ కళకు భక్తి కారణమైన మాట వాస్తవము. ఆ కళవలని సంప్రదాయ మెరిగిన రసికులకు భక్తి ఉత్పన్నమగుటకూడ సహజము. అయినప్పటికీ ఆ గాథిక్ కళకూడ ముక్తికి సాధనం కాలేదు. అందుచేత పాశ్చాత్య సంప్రదాయములలో పూర్తిగా మునిగి, మన సంప్రదాయ స్వస్వరూపము నెరుగని ఆ మహాభక్తులు మన కళాంతర్రహస్యములోనికి అంతగా దూరమునకు చొరలేకపోవడం ఆశ్చర్యకరమైన విశేషం కాదు.

ఏది ఎట్లున్నప్పటికీ, చూచినంతనే మన సంప్రదాయములను, తత్సంబంధిత విజ్ఞానమును ఎరుగని, సంపర్కమును మాత్రమే కలిగిన పాశ్చాత్యులకుకూడ మహోన్నతి నిచ్చి, తత్కళాసృష్టిని గూర్చిన విచారము సల్పినట్లుచేయగలిగిన మన కళ సర్వోత్కృష్టమైన దనుటలో ఏ సందేహమూ లేదు.

అనుక్షణం మనం ప్రకృతిని గమనించుటవలన, ఆ వస్తుసంతతుల ననుసరించి రూపాలు మనలో ఉదయించి, వాటికి సంబంధించిన భావనలు ఏర్పడతాయనీ, ఈ భావనలకూ తత్సంబంధమైన వస్తువులకూ గల సంబంధముల ననుసరించి ఒక సంజ్ఞాభిధానమయిన ఒక నిశ్చితపరిభాష మనలో ఏర్పడిపోతుందనీ, ఈ పరిభాషే ఒక పద్ధతిగ కళలో వివిధరూపములను, తత్సంకలనాలను అర్థంచేసుకోవడానికి ఒక నిశ్చిత నిఘంటువవుతుందనీ, ఈ పరిభాషమూలంగానే రూపకల్పనల కందని అనేక ఉత్తమభావనలను కళలో అతిస్పష్టంగా సరసంగా ప్రదర్శింపవీలవుతుందనీ మొదటి వ్యాసంలో అనా. సు. మాతృసృష్టిసే ప్రకృతివ్యాసం తర్కమునూ శోధించిన మన కళాతత్వమున ఈ పరి

భావ అతిరిక్తాలమై, సర్వభావములతో సారూప్య ప్రదర్శన చేయగలదై ఆదినుంచి వెలసియున్నది.

ఈ పరిభాష ననుసరించే, రసాలకే సారూప్య మొసర్పగల గుణముల, రసమున కొక దేవతాస్వరూపం, రసమున కొక వర్ణము సంప్రదాయమై వెలయుచున్నవి. అనగా ఆయా దేవతాస్వరూపమునకు సంబంధించిన లయలవల్ల ఆయారసము ప్రోద్బలింపగలదనీ, ఆ యా వర్ణము ఆ యా రసానుభూతికి అతిపరిశంగా తోడ్పడగలుగుతుందనీ భావము. అంతేకాని, తద్దేవతాస్వరూపమో, తద్వర్ణమో లేకయుండిన ఆ రసోత్పత్తి కలుగదని కాదు.

॥ శృంగారరసమునకు విష్ణువనీ, వీరరసమునకు ఇంద్రుడూ, కరుణరసమునకు యముడనీ, రౌద్రరసమునకు రుద్రుడూ, హాస్యరసమునకు ప్రమథులనీ, భయానకరసమునకు కాలుడనీ, బీభత్సరసమునకు మహాకాలుడనీ, అద్భుతరసమునకు గంధర్వులనీ, శాంతరసమునకు నారాయణుడనీ నిర్వచించబడియున్నది. అదేరీతిగా శృంగారాదిరసములకు మరుగోధుమ, సువర్ణ, గౌండపాండుర, రక్త, శ్వేత, నలుపు, నీల, పీత, మల్లెపూవురంగు తెలుపువర్ణములను పేర్కొన్నారు. అపైన రక్తవర్ణ మన్నిరసములకు ఆలవాలం కాగలదని కూడ నిర్వచించారు.)

॥ ఈ సూత్రము ననుసరించే ఉత్తమచిత్రకారుడు, అనేకవర్ణములు వాడినప్పటికీ, వర్ణసంకలనానికి ఏక వర్ణతారూపము నిచ్చి, వర్ణితాభంగిమయందు ఏకత్వాన్ని స్థాపిస్తాడు. ప్రకృతియందలి వర్ణవిభేదమును కూడ అతి దంతగా పాటింపను. ప్రకృతియందు కానవచ్చు వర్ణవర్ణముల వారి ఉద్దేశించి నిర్దేశింపను కూడ. తగిన వర్ణము నొకదానిని ప్రతిబింబించి, చిత్రమునంతటికీ వర్ణితాభంగిమను నిర్మిస్తాడు. ఈ పద్ధతి ననుసరించిన ఉత్తమచిత్రాలెన్నో రసవంతమైనవి పాశ్చాత్యకళకు కూడ చెందిన వనీకము లున్నాయని ఇదివరకే అన్నాను.

కళాసృష్టికలని భావకోటి ననుసరించిన మహానందము రసమన్నారు. రసములు నవవిధములు. అందుచేత రసరసమునకూ సంబంధించిన మహదానందమైనను కూడ తేర్పగు రీతుల నుండక తప్పదు. కాబట్టి రసానందము కలుగు మనః పరిణామము, వివిధరీతుల ఆయారసము ననుకరించి ఉంటుందనడంలో ఏ సందేహమూ లేదు.

ఈ మనః పరిణామములు నాలుగువిధాలుగా వర్ణించారు. వికాసము, ఉప్పొంగుట, సంచలనం, అంతర్ముఖమగుట. కాని ఇవి ఎనిమిది రసములను గూర్చియే చెప్పబడినవి. శృంగారహాస్యరసములకు వికాసమనీ, వీరఅద్భుతరసములకు ఉప్పొంగడమనీ, బీభత్సభయానకరసములకు సంచలనమనీ, కరుణరౌద్రరసములకు మనస్సంతర్ముఖమగుననీ అన్నారు. ఈ అష్టరసానుభూతి వలన వచ్చు మనఃపరిణామములను గూర్చిన చర్చ అనవసరము. ఏలనన, ఆ యా రసస్థాయీభావముల నొకింత గమనించిన, పై వచనములు సత్యములని స్పష్టంగా గోచరించును.

కాని తొమ్మిదోరసమయిన శాంతరసమును, తద్రసానుభూతివలని మనఃపరిణతినిగూర్చి కొంత విచారించవలసి యుంటుంది. శాంతరసమునకు స్థాయీభావం నిర్వేదం. అనగా భౌతికప్రపంచఅనిత్యతను గుర్తించి, బాహ్యప్రకృతికి తావకీతమని, ఆత్మనిత్యతనూ తెలిసికొని, తదనుసారంగా సర్వక్లేశములకూ బాహ్యమై పరమశాంతిని హృదయమందు నెలకొల్పి మహదానందము నందుట. ఈ నిర్వేదకారణముకలన వచ్చు శాంతము తన్మహదానందమును అనేకరీతుల మహావక్తలు నిర్వచించారు. ఏలనన, జ్ఞానము చివరకొక్కటే యైనను, మన దేశమందు అనేక మతకర్తలు జ్ఞానస్వరూపమును అనేకరకాలుగా నిర్వచించారు. అందుచేత మతసంప్రదాయము ననుసరించి, ఈ శాంతరసమైనను కానవస్తుంది. ఎన్ని మతములు ఎన్నిరీతుల చెప్పినప్పటికీ, ఐహికప్రపంచమునకు అతీతమై చేరినది శాంతరసము. చాలవరకు ఈ భౌతికప్రపంచరీతుల ననుసరించిన మహదానందస్వరూపములే తక్కుంగల ఎనిమిది రసములు. అందుచేతనే ఉత్తమకళాసృష్టి శాంతరసప్రధానమని పెద్దలన్నారు. నిజంగాకూడ

ఆర్యావర్తమందలి ఉత్తమకళాసృష్టు లన్నీ ఏ కళకు చెందినప్పటికీ శాంతరసప్రధానములే. కాని కళ ఒక సోపానము దిగినప్పుడెల్ల తక్కినరసములు ప్రాధాన్యం వహించాయి.

పై సూత్రముల ననుసరించే శుక్రుడు దేవతా మూర్తుల ను త్రివిధాలుగా వర్ణించాడు. ప్రథమ శ్రేణికి చెందినవి శాంతమూర్తులు. ఇవి శాంతరసము నుత్పన్నము చేయునవి. దేవతాస్వరూపాలు ఇందుపవిష్టులై, వీర ముద్ర ధరిస్తూ యోగసమాధియం దుంటారు. దక్షిణా మూర్తివిగ్రహం ఇందుకు మంచి తార్కాణం.

రెండవ రకం రాజసికం. వాహనారూఢులైన దేవతాస్వరూపా లీ శ్రేణికి చెందుతాయి. ఈ మూర్తులు శృంగార, హాస్య, వీర, అద్భుత, కరుణరసములకు ఆల వాల మవుతాయి.

మూడవ రకం తామసికం. సంహారమూర్తులు ఆయుధపాణులై ఇందు కన్పిస్తారు. బీభత్స, భయానక, రౌద్రరసముల కాటపట్టయినవి ఈ రూపాలు.

సాధారణంగా తంత్రములందు ఐహిక సహాయ శక్తుల నపేక్షించు రాజసిక, తామసికమూర్తులకే ప్రాశస్త్య ముండటం కలుగుతుంది. సంపూర్ణంగా ముక్తినే అపేక్షించు మహాపురుషులందరూ శాంతమూర్తుల నాహ్వానిస్తారు.

అన్ని రసములు శృంగారరసజనితము లని ఒక సిద్ధాంతం ఉంది. ప్రప్రథమాన హాస్యవీరరసములు శృంగారమునుంచి ఉద్భవించిన వనియూ, తర్వాత రౌద్ర, భయానక, బీభత్స, అద్భుత, కరుణారసములు వీరరసమునుంచి ఉత్పన్నమైన వనియూ, అన్నిరసముల నుంచి శాంతరస ముత్పన్నము కాగలదనియూ ఈ సిద్ధాంతమునందు ఒక భావం. దీనికి కారణం లేకపోలేదు. కావ్యనాటకములందు రతిభావము ననుసరించునపుడు, హాస్య, ఉత్సాహములు, ఆ రతిభావమును తమంతట తామే విచ్ఛేదిస్తుంటవి. ఉత్సాహము ననుసరిస్తూ కొన్ని ఘట్టములందు, క్రోధ, భయ, జుగుప్సా, విస్మయ, శోక భావము లుత్పన్నమవు అవకాశం కలిగించడానికి కవికి వీలుంది. పై అష్టభావములన్నింటి నుంచి, నిర్వేదభావము ఉత్పన్నమగు అవకాశం తప్పక ఉంది. ముఖ్యంగా హైందవ మతసంప్రదాయగాథ లన్నీ ఈ సూత్రం అనుసరించి ఉంటవి.

ఆదిన శృంగారరసాన్ని రసరాజ మన్నారు. దీనికి రెండు కారణాలు. తొలికారణం అన్ని రసాలు ఇందునుంచి ఉద్భవించినవని, రెండో కారణం రతిభావం ప్రతిమానవునికి సహజంగా ఉంటుందనీ, అందుచేత కొలది సంస్కారంతోనే శృంగారరసం అనుభవించగలుగు యోగ్యత ప్రతి వానికీ కలదనీ ఒక భావం. అందుచేత మన దేశమందు మహాకావ్యము లెన్నో శృంగారరసప్రధాన ములై వెలసినవి. కొంతకాల మయింతర్వాత కరుణ రసం ఉత్తమమైనదని ఒక భావం ప్రబలింది. భవభూతి కూడ ఈ సిద్ధాంతము ననుసరించి అనేక ఉత్తమనాట కాలను రచించాడు. ఈ సిద్ధాంతం శిల్పకళల్లో కూడ జొరబడి, కళాయుగానికే మన దేశమందు ఒక మాతృరూపం ఇచ్చింది. క్రీ. శ. రెండవ శతాబ్ది అయింతర్వాత బౌద్ధకళలో ఎక్కువభాగం ఈ కరుణ రసపూరితం. కాని శాంతరసపై జయము కుదిరిన తర్వాత, ఉత్తమకళాసృష్టి శాంతరసప్రధానమని కనుక్కోగలిగాము. నిజంగా ఆదినుంచి ఇప్పటిదాకా ప్రతి ఉత్తమకళాసృష్టి శాంతరసప్రధానంగానే ఉన్నది. ప్రథమస్థాయీభావం ఏది ఉదయించినప్పటికీ, చివరకి సంస్కారముండిన రసజ్ఞునకు నిర్వేదభావజనితమై ఆ కళాసృష్టి శాంతరసకారక మవుతుంది.

ఏది ఎట్లున్నప్పటికీ రససృష్టి ఆశయం కాగలిగి నందువల్లనే, మన ప్రాచీన హైందవకళ అత్యున్నత పథాన నడవగలిగింది. ఇందుకు తార్కాణం ఇప్పటికీ అచలంగా మన దేశమంతటా నిలిచియున్న కళా ముఖాలే. అనేక కారణాల వల్ల మన దేశం గొప్పగొప్ప కళామూర్తులను కోలుపోయింది. కాని వాటి భావన లిప్పటికీ సజీవములై దేశమంతటా సంచరిస్తున్నాయి. ఈనాటికీ అనేక కళాకర్తలు ఆ దివ్యభావాలను సారూప్యంగా చిత్రిస్తున్నారు. వారివారి విజ్ఞాన సంస్కారముల ననుసరించి ఆ దివ్యమూర్తుల చిత్రాలు రసవంత మవడం, కాకపోవడంకూడ జరుగుతున్నది. కాని,

ఆ భావసామూర్తుల విశ్వస్వరూపాలు సంప్రదాయమెరిగిన ప్రతిభారతీయ మనఃప్రపంచంలో సజీవంగా రసవంతంగా తాండవిస్తున్నా యనడంలో ఏ సందేహమూ లేదు.

రసప్రకృతినిగూర్చి అనేకవిధాలుగా మహావక్తలు ఉద్గ్రంథాల్లో చర్చించారు. కాని ఇంతకంటె ఈ వ్యాసంలో చర్చించడం సమంజసం కాదు. కాని తుదిమాటగా ఒక్క విషయం చెప్పకతప్పదు. వైష్ణవ వాఙ్మయంలో దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర రసాలని మరో నాల్గింటిని చేర్చారు. ఇటీవల హిందీ వాఙ్మయంలో భక్తిరసమంటూ మరో రసాన్ని కలిపారు. ఇందుకు కారణం కళాసృష్టిజనితభావం రసం కాగలదనే నమ్మకమే. కాని ఇవి రసము లవునో కావో అనే చర్చ ఇక్కడ అనవసరం. నా నమ్మకం వీటిలో కొన్ని రసంకాలేని భావములేనని, కొన్ని అనుభావములు అనీ మాత్రమే. అయినప్పటికీ ఈ నూతన రసముల చర్చ మహాపండితులకు వదిలి నేను ఇంతటితో విరమిస్తున్నాను.



# పరిణామం

[కథానిక]



— శ్రీ ఘట్టి ఆంజనేయశర్మ —

నారాయణరావుదృష్టికి లోకాలన్నీ ప్రచండ వేగంతో తనచుట్టూ గిర్రున తిరుగుతున్నట్లు అగుపించింది. నిలువునా తన దేహాన్ని నరికినా నొప్పిగలిగేది కాదు. లేకపోతే పరీక్షలన్నీ దిగ్విజయంగా కొట్టేస్తూ ఉత్తముడనీ, తెలివిగలవాడనీ పేరుపొంది, కలలో కూడా అనుకోకుండా తన నెంబరు కనిపించకపోయేటప్పటికి కుప్పలాగా నంచున్న చోటనే కూలి పోకూడదూ!...మొదటినుంచీ అశ్రద్ధగా తిరిగినా, ఒకవేళ దురదృష్టవశాత్తు పేపర్లన్నీ పాడుచేసినా అంత ఆందోళనా, బాధా వుండేవి కావు. తన శక్తిని, కాలాన్ని, ధనాన్ని కేంద్రీకరించి, ఏకాగ్రతతో సంవత్సరం మొదటినుంచి పరీక్షదాటి బయటపడదామనే ప్రయత్నించాడు. తనకు ఆర్థికంగా, సాంఘికంగా విలువ ఎంత వుందో బాగా తెలుసు.

పొద్దస్తమానం దగ్గుకుంటూ, నడవలేక నడవలేక కోమటిగుమాస్తాఉద్యోగాన్ని, నలభయిరూపాయల కోసం...తనకోసం...తను పెద్దవాడై ఏదో కొండంత పేరుప్రతిష్ఠలు తెచ్చుకొని దేశాన్నుద్ధరిస్తాడని...చేస్తున్నాడు తండ్రి......

ప్రతి జాబులోనూ "జాగ్రత్తగాచదువుకో, క్లుప్తంగా వాడుకో, ఎంత ప్రయత్నించినా ఇంతకంటే ఎక్కువ పంపలేకుండావున్నా" అంటూ వ్రాసేవాడు. అప్పుడు అతని దీనమైన కండ్లు......అసహాయతను కనపరుస్తూ తన మనఃఫలకంలో మెరిసేవి!......

తల్లి...తన చదువుకోసం......రెండు చీరెలతోనే సంవత్సరమంతా వెళ్లబుచ్చడం ఎలా మరిచి పోతాడు!......

పిల్లలంతా మూగి తల్లిని ఏదన్నా కొనిపెట్టమని వేధిస్తే "అన్నయ్య పెద్దవాడై, ఇన్ని రూపాయలు సంపాదించి, మీ రడిగినవన్నీ కాక...ఇంకా గంపెడు వస్తువుల్ని కొని పెడతాడు." అనేది. ప్రతిరాత్రీ నిద్ర పోయేటప్పుడు "స్వామీ, మమ్మల్ని రక్షించు...... మా అబ్బాయి వృద్ధిలోకి రావాలి, తండ్రీ!..." అని ప్రార్థిస్తూ అంటుండడం ఎన్నోసార్లు విన్నాడు. ఇది తెలిసి ఎంత పరితపిస్తుందో కదా!......ఏం లాభం......తన శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరులా భవిష్యత్తునంతా అంధకారమయాన్ని చేసింది.

ప్రతివారం వారఫలాలు చూసేవాడు. ఈవారం "శుభవార్తాశ్రవణం" అని వుంది. ఇదేవి చేయని, తన గదికి ఎదురుగావున్న సాయెబు కుర్రాడు ఏమీ చదివేవాడు కాదు. పరీక్షలయింతర్వాత కూడా "నువ్వు ముక్కారుపోవడం ఎంతో నేను పాసవటం అంతే" నన్నాడు.

ఎదురుగా, కాగితంమీద అచ్చయిన అతని నెంబరు తనను వెక్కిరిస్తోంది! ఒక్క అతనిమాటే ఏమిటి!......చదవని, కుంకల్లాగా తిరిగే తన మిత్రుల నెంబర్లు ఎన్నో వున్నాయి!—కాని...సర్వస్వాన్నీ, విశుద్ధహృదయంతో, నెగ్గి బయటపడడానికోసం అర్పించిన తన నెంబరు లేదు!...లేదు ముమ్మాటికీ!...... ఈ స్థితిలో తను కాలుకదల్చగలడా!· ఒక్క అడుగు ఇంటివైపు ఎట్లా వెళ్తాడు? ఆత్రుతతో తనవంక చూసే ఆ అభాగ్యుల నేత్రాలు తనను వేటాడవా! ఏం చేస్తాడు!......

తన చేతిలో ఏమూందిగనుక!......ఒక్కసారి చుట్టూ చూశాడు! బజారు. మనుష్యులు ఎవ్వరూ అగుపడలేదు.

"నువ్వు తప్పావా!......"

"ఎంత దురదృష్టమోయ్!"

"నేనెప్పుడూ అనుకోలేదు!......"

"ఆ మాకోసం దానే ప్రాణంయివ్వడానికంటే నువ్వు తప్పావంటే పిచ్చెక్కుతుందోయ్!..."

ఇంక అతడు వినదలుచుకోలేదు. పరిగెత్తాడు. మనుష్యులు, శబ్దం, గుఱ్ఱపుబండ్లు, సోడాకోలు—ఇవన్నీ వినబడుతుండా.........అలసి వచ్చి ఆగాడు.

"ఎక్కడికి!......" అంది అంతరాత్మ.

"చావడానికి......"

"చస్తావా!......"

"బ్రతికి భరించలేను......"

"నీకోసం బ్రతికే అమ్మని, నాన్నని, చెల్లెళ్ళని, తమ్ముళ్ళని...వదిలిపెట్టి!..."

నారాయణరావు ఆలోచనతో పరితప్తమై, భారంగా తిరిగాడు. మనశ్శాంతి కలుగుతుందేమోనని దేవాలయంలోకి వెళ్ళాడు. "తండ్రీ...నన్ను మరిచావా......దయామయుడంటారుకదూ నిన్ను!"... వెక్కి వెక్కి ఏడ్చాడు. దేవుడుగూడ భాగ్యవంతుల మాట వింటాడు!...తనకు ఈలోకంలో, స్వార్థంతో సాముచేసే ఈ లోకంలో స్థానం లేదు.

పొద్దున్నే బజారు బయలుదేరినవాడు చాలా ప్రొద్దెక్కినా ఇంటికి వెళ్ళలేదు.

ఏదో జ్ఞాపకం వచ్చినవాడల్లే లేచి ఇంటికి బయలుదేరాడు.

ఇల్లుసమీపిస్తుంటే కాళ్లు తడబడడం మొదలెట్టాయ్...గొంతులో ఏదో అడ్డం పడ్డట్టయింది...ఎదురుగా వుండే వస్తువులు కదిలినట్లు అగుపించాయ్.

ఇంట్లో బలవంతాన అడుగుపెడుతూనే, పక్కింటి పాతగడియారం నీరసంగా నాలుగు కొట్టడం విన్నాడు. [illegible]!......

తండ్రిచేతిలో పేపరుంది. తనను చూశాడు.

"ఏరా......ఇంతసేపటినుంచీ ఎక్కడ చచ్చావ్!"—ఉరుముతూ అన్నాడు.

మాట్లాడలేదు.........అసలు మాట్లాడలేక పోయాడు.

"నీ నెంబరు అగుపించలేదని రంగయ్యగారబ్బాయ్ చెప్పాడు"

తలొంచుకొన్నాడు. కన్నీటిబొట్లు రెండు నేల రాలాయ్.

"అయితే తప్పినట్లేనా!......" కోపంతో వణుకుతూ చెంపమీద చెళ్ళు మనేటట్లు కొట్టాడు.

నారాయణరావు తూలిపడ్డాడు. తనను కొట్టాడని ఏం చింతలేదు! ఆ కృశించే తండ్రిహృదయానికి ఎంత కష్టం తెచ్చిపెట్టానా అన్న బాధే పీడిస్తోంది.

తండ్రి ఉపన్యాసధోరణిలో అంటున్నాడు:

"అవును......చదువు అందరికీ ఎలా అబ్బుతుంది! వాలాయిగా తిరుగుతూ, సినిమాలో, దమ్మిడీ విలువచెయ్యని బూతుకథలు వ్రాస్తూ చెడ తిరుగుతూ.........."

చాలామాటలు వినిపించలేదు. వినిపించినవన్నీ శూలాల్లాగా దూసుకుపోతున్నాయ్.

ఎంతసేపు అలా సొమ్మసిల్లి పడున్నాడో గాని, కళ్ళుతెరిచి చూసేటప్పటికి ఎవ్వరూ లేరు.

మృదుహస్తం తనను తట్టి లేపుతోంది.

"అమ్మా......"

"నాయనా......లే, భోంచేద్దుగాని......"

"నేను భోంచేయగల మనిషిన్నావా అమ్మా! నా శక్తిని, తెలివి గేలల్చి ఉపయోగించి చదివినా..."

పెద్దగా ఏడ్చాడు.

"మాతండ్రివికదూ!......ఎప్పటికైనా మంచి రోజులు రాకపోవు...లే, నాన్నా!..."

తండ్రి గదిలోంచి బయటికి వచ్చి గద్దించాడు.

"ఇంకా ఏమొహంపెట్టుకు అన్నం తింటావ్!...చాటికి లేదు, మీసాలకు సంపెంగనూనె!......[illegible]!......"

తల్లి తణికిపోయింది. శోకమూర్తిలా నుంచొంది జాలిగా చూస్తూ!......

"నాన్నా......మీకెందుకు బాధ!........ పోతున్నా..." అన్నాడు నారాయణరావు.

"పో...గంగలో కలు...ఏమి టా బెదిరిం పులు!" అన్నాడు తండ్రి.

నారాయణరావు పోబోతుంటే తల్లి అడ్డం వచ్చింది. "పోనీ...ఎక్కడికి పోతాడో చూదాం..."

తల్లిని కదలకుండా పట్టుకున్నాడు. నారాయణ రావు కృతజ్ఞతాపూర్వకంగా, జాలిగా జాలిగా చూసి వెళ్ళిపోయాడు.

"మళ్ళీ రాకపోతాడా...ఎక్కడికి పోతాడు నన్నొదిలి!..." అనుకుంది తల్లి విధిలేక...పోయిన దిక్కు కృశించిపోతూ చూసింది. "తప్పటం ఘోరం" మనుకుంది.

తండ్రి పెద్దగా నిట్టూర్చాడు నడిచి పోతూ...

* * * *

క్రమంగా, తండ్రి తేరుకున్నాడు. ఎక్కడికి పోతాడో పిల్లాడని ఆలోచించడం మొదలెట్టాడు. ఫోంచేయ లేదని జ్ఞాపకంవచ్చింది.

"ఎక్కడికి వెళ్ళాడో......పిచ్చివాయన..." అంది తల్లి.

"తీసుకొస్తా, వుండు......ఎక్కడికి పోగలడు కనక......"అంటూ చొక్కా తొడుక్కోబోతుం డగా పోస్టుబంట్రోతు లోపలికి వచ్చి టెలిగ్రాం ఇచ్చిపోయాడు.

గాభరాగా విప్పి చదివాడు...మొఖం విప్పా రింది.

"ఏమేవ్......అబ్బాయి ప్యాసయినాడనీ... పొరపాటున నెంబరు పడలేదనీ వార్త వచ్చింది..."

సంతోషంతో ఇల్లంతా తిరుగుతూ అందరికీ చెప్పాడు. తల్లి కన్నీరు కార్చింది......కాదు, ఆనం దబాష్పాలు!......

"నారాయణ...నాయన" అంది ప్రేమరసాన్ని చిలుకుతూ.

"అవును, నారాయణ ......... ప్రజ్ఞాశాలి" అన్నాడు ఆవేశంతో.

"తీసుకొస్తా"...తండ్రి ఆగలేక చొక్కాయైనా లేకుండానే వీథిని బడ్డాడు. వూరంతా తిరిగాడు. అగ పడినవారందరితోనూ చెప్పాడు. సళ్ళల్లో, సత్రాల్లో, రైల్వేస్టేషను దగ్గర, అరుగులమీద అన్నీ వెతికాడు.

మనుష్యుల్ని అన్నీ వైపులకూ పంపించాడు. తనూ కాలవవైపు బయలుదేరాడు పెద్దగా పేరుపెట్టి పిలుచుకుంటూ.

"అబ్బాయ్......ప్యాసయినావు... ఎక్కడు న్నావ్!" ఇలా నిమిషనిమిషానికీ అరుస్తూనేవున్నాడు. దూరంగా చెట్టుకింద ఎవరో పిల్లాడు కూచున్నట్టు అగుపడ్డాడు.

తను అలా గట్టిగా పిలుస్తూనే పరిగెత్తుతున్నాడు. వాడు మెల్లిగా లేచి కాలవవైపు నడవడం ప్రారంభిం చాడు. ఇద్దరిమధ్య ఫర్లాంగుదూరముంటుంది. శక్తినంతా కూడగట్టుకొని పరుగెత్తడం ప్రారంభించాడు.

క్రమంగా పిల్లాడు నీటిలో కాలుపెట్టాడు.

ఎంత అరిచినా వినిపించడం లేదుగావును.

అలా పోతూనేవున్నాడు వాడు.

తీరా, తను దగ్గిరికి చేరేటప్పటికి గొంతుకలోతు మునిగాడు. తల చూసి గుర్తుపట్టాడు!...నారాయణ రావు!

"నువ్వు ప్యాసయావురా, నాయనా, ఇదిగో చూడు. టెలిగ్రాం......"చేయెత్తి చూపించాడు.

సంతోషంతో నవ్వి "కాళ్ళు లేకపోతున్నా య్, నాన్నా......" మాట్లాడలేకపోయాడు.

తండ్రి ఝాగున నీటిలోకి దూకాడు. నారా యణరావు ప్రవాహానికి కొట్టుకుపోతున్నాడు-తనమీద ఆశపెట్టుకున్న అందర్నీ విడిచి......

# మృత్యుమీమాంస

— శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి —

స్వర్గసీమలలోన సౌఖ్యమే లేదనుచు
నరకపాలనలనే నాణ్యమనె కవివరుడు!
ఆ దివ్యలోకాల నాదరమ్ముగ నిలువ
కోరజాలను నేను కోటిజన్మలకైన!
ఏల ఈవిపరీత మేల యని కేలనో ?

మృత్యుదేవీ ప్రవచ మీమాంసలోనదే
తొలి కావ్యగా యముడు తూగెనని గీతాల
వేదకాలపు ఋషులు విలసనంబుల పాడ,
సుపలాశఛాయలో సోమపానము సేయు
యముని సాంగత్యమ్ము నాదరింపగబోడు.

యముని గోరుచు నాడు అరిగె నచికేతసుడు
నేర్చె శ్రేయోవిద్య నేర్పుమీరగ నచట!
నా మిత్రమండలిని నట్టడవిలో దించి
ఏకాకిగా బోవ నిచ్చగింపదు మనసు!
కాన నేనరకమును కాంక్షింతు నెల్లపుడు.

నావీథిలో నడచి నాజాడలను జూడ
నరుగుదెంచెడివారి కర్పింతు స్వాగతము!



# గుణగ విజయాదిత్యుడు

[చారిత్రక నాటకము]

— శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు —

[ గతసంచిక తరువాయి ]

### ౩. వ రంగము

[కృష్ణానదీ గర్భమున- బెజవాడచెంత- ఒకానొక చంద్రగ్రహణనిమిత్తమున గుణగవిజయాదిత్యమహారాజు అనేకభూదానములు చేసి తన ప్రజను సంతుష్టపఱచెను. ఆ పర్వసమయమున. ప్రవేశము : గుణగ విజయాదిత్యుడు, మహామంత్రులు, విప్రబృందము, వందిమాగధులు, కవిగాయక పౌరాణిక పరివారము.]

పరివేష్టించియున్న పంచ ప్రధానులు—విజయోస్తు! విజయోస్తు! పరమభట్టారకునకు; పరమేశ్వరునకు.

విప్రోత్తములు; వృద్ధామాత్య గురుజనులు— విజయోస్తు, విజయోస్తు! పరమమాహేశ్వరునకు, పరమ బ్రహ్మణ్యునకు అభ్యుదయ పరంపరాభివృద్ధిరస్తు!

గుణగవిజయాదిత్యుడు—పురోహిత, సచివ, అంతఃపురామాత్యాదికులప్రధానులకు, బ్రాహ్మణబృందములకు నమస్కారములు.

ప్రధాని — దేవర అభిమతము నానతీయుదురు గాక!

గుణగవిజయాదిత్యుడు—ఈ చంద్రోపరాగ పర్వసమయమున సంతుష్టులమై, యభీష్టమొకటి దీర్పఁ గొనదలచినారము. కులప్రధానుల యనుజ్ఞ!

ప్రధాని— దేవరవారు అప్రతిహతసంకల్పులు! సకలవసుమతీవసుపతియగు దేవర యభిమతమునకు అంతరాయము కలుగదు. సమస్తభువనాశ్రయులు, ప్రజాపాలనదక్షులైన లోకపాలకులు! దేవరవారు! భగవద్భక్తి సద్భావసంభావిత సర్వకల్యాణులు! దేవరవారు అనేక గోహిరణ్యభూమ్యాది దానములచే పరివృద్ధి నొందుచున్న ధర్మసంచయము గల మహారాజాధిరాజులు!

గుణగ విజయాదిత్యుడు—అమాత్య శేఖరుడు, అరిరాజభీకరుడు, తైత్తిరీయ సబ్రహ్మచారి, బ్రహ్మలక్ష్మీనివాసుడు, మాకు పరమాప్తుడు వినయాదిశర్మ. అతడు దేవగురు సదృశుడైన మహామతి; విప్రకులావతంసుడు- (అర్థోక్తిలో)

వినయాదిశర్మ—దేవా! సమస్తభువనాశ్రయులు పరితుష్టులై, నాటిమొదలు నేటివఱకు ఈ రాజసేవకుని యందు చూపిన ఆదరణ, మన్నించి యొసగిన జాంబూనదాభరణములు, రత్నాంబరములు, ప్రసాదించిన ఛత్రచామరాందోళిక మయూరపింఛాది సమ్మాన సామంతరాజ చిహ్నంబులు ఇంతకుమున్నె పరమ సంతోషమును సమకూర్చినవి. ఈరాజసేవకు డెంతయు కృతజ్ఞుడు!

పండరంగడు—అట్లు గాదయ్యా! అమాత్య శేఖరుడ! సమస్తభువనాశ్రయుని అభిమతము!

గుణగవిజయాదిత్యుడు — నర్మాలాపములందు నైతము అనృతమాడని సత్యసంధు డీసచివుడు; మహానుభావుడు; పుణ్యశ్లోకుడు. ఇట్టి అమాత్యునికి ధార వోసిన దానము లెన్నయినను అల్పములే! మేము—

కవి వామనుడు—(అర్థోక్తిలో-ఆసువుగా)

శ్లో. హత్వా మంక్షు విశీర్ణసకలారాతిమహాహవాగ్రం
రాగోద్రేకా ద్ధనికనృపతి ర్గాఙ్గకౌర్యప్రతాపమ్,
నానాహేత్యాగినా శుభంగోవిన్దత్తనా స్త్రీప్రశ్నే
యుద్ధే యత్ త్యజ్యరగణ సాక్ష్యే భూతా దేశేఽస్తు.

గుణగవిజయాదిత్యుడు—భట్టవామన కవీంద్రా! చెప్పగా వచ్చితిని. మా శ్రీమత్తులు రమ్యముగ గ్రహించినాను. విప్రోత్తమా! వినయశీలశర్మ నామధేయ! పరిగ్రహింపుము! భూసురోత్తములార! ఆలకింపుడు. ఈ చంద్రగ్రహణనిమిత్తమున ఊర్పుటూరు వాస్తవ్యులను, కాశ్యపగోత్రులును, ఆపస్తంబసూత్రులును, షట్కర్మనిరతులును, తైత్తిరీయశాఖాధ్యాయులును, వేదవేదాంగేతిహాసపురాణజ్ఞులును అగు దామోదర శర్మపుత్రులు వినయశీలశర్మాభిధానులకు సర్వకరపరి హారముగా, సంతుష్టులమై గుద్రవారవిషయమునకు చెందిన ట్రాంగ్డపట్టి గ్రామమును ఉదకపూర్వకముగా హిరణ్యసహితముగా ధారవోయుచున్నాము.

వినయశీలశర్మ—మహాప్రసాదము. దేవా! స్వీకరించినాడను.

గుణగవిజయాదిత్యుడు—ప్రభుపండరంగ సేనాని, మా విజయవాడ కటకాధీశుడు ఈ దానమును తామ్రపట్టికపై వ్రాయించి, మా యాజ్ఞను గుద్రవార విషయనివాసులైన రాష్ట్రకూటప్రముఖులకును కుటుంబి నులకును పాలింపవలసినదని విన్నవింతురుగాక.

పండరంగడు—ఏలినవారి చిత్తము.

కవివామనభట్టు—

శివ మస్తు సర్వజగతాం
పరహితనిరతా భవంతు భూతగణాః
దోషాః ప్రయాంతు నాశం
తిష్ఠతు సుచిరం జగతి ధర్మః.

## ౭ వ రంగము

[విజయవాడ మహానగరము. నగరికెదురుగా వాహ్యాళి యుండును.]

రాజస్థానీయుడు (ప్రవేశించి)—ఓహో పౌర జనులార! ఆలకింపుడు, ఈ శుభవార్తను. యుద్ధము ప్రారంభమైనది. సంధికార్యమునకై అరిగిన యువరాజు చాళుక్యభీమకుమారుని చెఱ యుంచినాడు రాష్ట్రకూటాధీశుడు; సంధికార్యమును భగ్నమొనరించినాడు. ఆ దారుణకృత్యమును విని మన యేలిక, ఆంధ్రోర్వీపతి గుణగవిజయాదిత్య మహారాజాధిరాజు కోపించినాడు. కులవైరమును దీర్చుకొందునని పగబూనినాడు. రాష్ట్రకూట సామ్రాజ్యమును విధ్వస్తము గావింతునని భీషణ ప్రతిజ్ఞ బూనినాడు. శౌర్యసంపాదితరుద్రుడై సేనా సమూహములను గూర్చుకొని దర్పముతో రట్టరాజధాని మీదికి జైత్రయాత్ర బోయినాడు.

సమస్తసేనాపతిగ సేనపట్టంబు గట్టినాడు దీక్షతో సత్పరాక్రముండగు ప్రభుపండరంగ పెద్దడు. రాష్ట్రకూటరాజధాని కిరణపురము ప్రభుపండ రంగని రణకౌశలము కారణముగ దగ్ధమయ్యెను. హతు డయ్యెను కృష్ణరాజు అమోఘవర్షుడు ఓడిపోయి రణ రంగమునందు. పలాయనులైరి అతని వాహినీపతులు ధైర్యసాహసములు విడనాడి. రాష్ట్రకూటసైన్యములు హతశేషములు వెన్నిచ్చి పారిపోయెను. ఇంకను ఆల కింపుడు! కలవు శుభవార్తలు! కృష్ణవల్లభుడును, అతని మేనమఱది శంకిలుండును ఆంధ్రసేనల ధాటికి నిలువజాలక వెన్నిచ్చి పారిపోయిరి. చెదరిపోయిన మూకలను గజవాజిసమూహములను కూడదీసికొని, తల దాచుకొనుటకై కొలోలు అచలపురమును ప్రవేశించి దుర్గరక్షణప్రయత్నములో నున్నారు. మన యేలిక విజయాదిత్యమహారాజాధిరాజు శత్రునిర్మూలన దీక్షాబద్ధుడై, రోషించి, కృష్ణవల్లభశంకిలాదులను బరి మార్ప వెన్నంటి తఱుముచుబోయి, దుర్భేద్యమైన అచల పురమును ముట్టడించి, దానినికూడ అగ్నిదేవునికి తృప్తి యొనగునట్లుగా నర్పించినాడు.

## ౮ వ రంగము

[చక్రకూట యుద్ధరంగము. ప్రవేశము : చమూ పతులు, గజవాజిసాహిణులు. సింహనాదములు, శంఖ నాదములు, కంఖారావములు పెల్లుగా వినబడు చుండును.]

చమూపతియొకడు — (వరాహలాంఛనముగల ధ్వజము పైకెత్తి పట్టుకొని) అహో! ఆంధ్రవాహినీ పతులార! సాహసాంకులైన సేనాపతులార! వీర భటులార! ఆలకింపుడు!.........................ఏమి ఈ మహాసంరంభము!!! ఈ మహోత్సాహ ప్రకటన మునకు గారణ మేమైయుండును! ఇది విజయసూచక ముగా నున్నది. మహాభాగ్యము—అయినను ఆలకింపుడు ఆదరముతో. యోధవరులార! ఆలకింపుడు. మన యిల యేలిక గుణగాంకుని యాజ్ఞ! ఏమనుచున్నారు?

గజవాహినియొకడు— (అట్టహాసముగ ప్రవేశించి) వినుడు! వినుడు! పరమసంతోషకరమైన శుభవార్త! సంకిలుడు - ధూర్తుడైన సంకిలుడు—దుష్ట బుద్ధి కూలినాడు నృపతిమార్తాండుని నిశితకరవాలము నకు గురియై ఒక్క వేటునకు! పందడిపంగరమున!- (అట్టహాసముతో మరల) శత్రుసైన్యములకు వెన్నెముక విరిగిపోయినది. హతుడైనాడు వక్రబుద్ధి చక్రకూటాధీశ్వ రుడుగూడ. చాళుక్య భీమునిమామని తోడి మల్లయుద్ధ మున దారుణముష్టిఘాతములకు!

అశ్వవాహినియొకడు—(రాగోద్రేకమున ప్రవేశించి) భళిభళి! మా విజయాదిత్యప్రభువాలుని మహా భాగ్యము. కృష్ణరాజు రణాంగమును వీడి ప్రాణరక్ష ణార్థము పాఱిపోవుచున్నాడు. సకలసంపదలను, రాజ్య ము సీమయును-అంతఃపుర స్త్రీజనమును, పరివారము ను అన్నిటింగూడ వీడి, భీతచిత్తుడై-ఎంతని వర్ణించి ఆనం దింపగలము పంచాంగని యుద్ధకౌశలము! రాజరా దిత్యుని సాహసవిక్రమములు. శత్రువులు ప్రచండ తేజో మూర్తులు. హతాశకాఠిన్యములకు రూపుగొనినట్లు వారు నలిపినారు.

మొదటిచమూపతి—అవునయ్య! అవును! చక్రకూట, డహాలరాజ్యములను రట్టనాటితోపాటు కలిపి యేకమండలముగా పరిపాలించుటకు సమర్థులైన దండ నాయకులను, ప్రెగ్గడలను నియమించినాడు ఏలిక— చేదీశునకు సహాయ్యము చేయుటకు–అవిచారముగ తిరిగిం చిన దుండగులైన కోసల కళింగాధీశులను గూడ శిక్షింప దలచి, ఉగ్రుడై ఆజ్ఞాపించుచున్నాడు మహారాజు, సమస్తసేనాపతి పండరంగనికి సేనల నడిపింపవలసినదని.

గజవాహిని—ప్రతాపమూర్తి యైన ఆంధ్రేశ్వరి పతి క్రోధానలమున కోసలకళింగములు భస్మీపటలము కాగలవు.

వాహినీపతియొకడు—(ఆటోపముతో ప్రవేశించి) ఇంకను నిలువబడి శిలాప్రతిమలవలె చూచు చున్నారదేల! పదండు పదండు. ఆంధ్రసైన్యములు ఈ విజయధాటీసమయమున మహోత్సాహముతో ప్రచండ మారుతము వీచుచున్నట్లు విజృంభించి నడచిపోవు చున్నవి. కదలుడు! కదలుడు! భేరీ, పటహ, తమ్మట ధ్వనులు, శంఖారావములు, కాహళధ్వనులు భీకరముగ వినవచ్చుచున్నవి. ఎంతటి హృదయానందకరమైన దృశ్య మిది!

చమూపతియొకడు—ఈ విజయధాటిక్రియ ఝంఝా మారుతమువలె సాగుచున్న విజయధాటికి కళింగకోసల ములు కొకటిప్రేళ్లతో కూలిపోగలవు.

(అట్టహాసము చేయుచు) సేనాపతులార, పదండు పదండు; కదలుడు, కదలుడు.

(నిష్క్రమింతురు.)

౯ వ రంగము

[బెజవాడరాజధాని. నగరిలో. ఒకానొక శుభదిన మున.

గుణగవిజయాదిత్యుని కొలువుకూటము ఎదు రుగా సువర్ణశిలాభారవేదిక అలంకరింపబడియుండును. కొలువుకూటమున పంచమహాశబ్దములు (శంఖ, భేరీ ఢక్కా, కాహళ, తిమ్మటధ్వనులు) మ్రోగుచుండును. అంతటంతట జయఘంటానాదములు, హెచ్చరికలు, జయజయ శబ్దములు, వీణాగానము, వేణునాదము మొదలుగాగల మంగళధ్వనులు శ్రవణ పేయముగ వినవచ్చుచుండును. అక్కడక్కడ వేదవిప్రుల బ్రాహ్మ ణాశీర్వాదములు, వందిమాగధ స్తోత్రములు, మాగధగీతములు శ్రుతిపర్వముగ వినవచ్చుచుండును.

ఆ త్రిభువనలక్ష్మీవిలాసమందిరమున అంతర్వేది మీద నున్న రత్నసింహాసనము. ఉభయపార్శ్వము లందును యథోచితస్థానములందు మంత్రి పురోహితా

మాత్య అంతఃపురాధ్యక్ష యువరాజ సువర్ణభాండా గారముఖ్య శ్రేష్ఠి సేనాపతి దౌవారిక కటకరాజాది గురువృద్ధజనములు బలిసి కొలుచుచుందురు. ఒకవంక సామంతరాజలోకము అరిగాపులయి వర్తించుచు వశులైన రిపురాజలోకము ఉపాయనము లొసగుచు, మోడ్పుచేతులు ఘటియించుచుందురు. ఒకవంక వేదవిప్రులు, నానాశాస్త్రార్థవిదులైన పండిత ప్రకాండులు ఇతిహాసకులు, పురాణజ్ఞులు, కవులు, బ్రహ్మలక్ష్మి నివాసులైన భూసురులు, వేశ్యలు, నట విట గాయక సమాజములు యథోచితస్థానములందు బలిసియుందురు.

పరరాజ్య పరవైభవ శ్రీలను గొనితెచ్చిన అమూల్యరత్నాభరణములు, సువర్ణము, మౌక్తిక చయము అర్ఘ్యము గొలవునట్లు కొలువుకూటము నడుమకుప్పతిప్పలుగ బడియుండి ప్రకాశించుచుండును.

ఎచ్చట జూచిన చందనము అగరు ధూపదశాంగ గుగ్గులాది కమ్మనివాసనలు వ్యాపించియుండును.

వృద్ధదాసజనములు అడుగడుగు మడుగులొత్తుచుండ, ఇందీవరాక్షులు నలువురు నాల్గువంకలను తమ మంజుల కంకణధ్వనులు మెఱయ వింజామరలు వీచుచుండ, గుణగవిజయాదిత్య సార్వభౌముడు కొలువు ప్రవేశించును...... ఒకక్షణములో అంతయు నిశ్శబ్దము. సార్వభౌముడు ఆసీనుడగుచుండ వేదవిప్రుల ఆశీర్వాదములు, మంగళవాద్యములు శ్రుతిపర్వముగ వినబడుచుండును.]

వంది—(ముందుకు వచ్చి, ఏలికకు కైవారము చేసి) ఓం స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం కౌశికీవర ప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణప్రసాద పరిరక్షిత భుజార్గళానాం స్వామిమహాసేనపాదానుధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద సమాసాదిత వరవరాహ లాంఛనేక్షణక్షణవశీకృతారాతిమండలానాం భగవత్స్వామి శక్తిధర ప్రసాదోపనత సమస్తవసుమతీ రాజ్యానాం అశ్వమేధావభృథస్నాన పవిత్రీకృతవపుషాం చాళుక్యానాం కులజలధి సముత్పన్నరాజరత్నస్య సకలభువనమండలమండితకీర్తేః సకలలోకాశ్రయ శ్రీకలివిష్ణువర్ధనమహారాజస్య శీలమహాదేవ్యాశ్చ సముత్పన్నః భద్రఘటా కల్పపాదప చింతామణిః శక్తిత్రయ సంపన్నః శక్తినరప్రభావః అప్రతిహతశక్తిః మహాతేజాః నిరస్తరిపునృపతి శౌర్యమదరాగః భువనకందర్పః అరిసంకకేసరినృపాలః నృపతిమార్తాండః గుణకేనల్లానితి విఖ్యాతయశః సమస్తభువనాశ్రయః శ్రీ విజయాదిత్య మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక పరమమాహేశ్వర పరమబ్రహ్మణ్యః—జయీభవ, దిగ్విజయీ భవ!

మాగధి—స్వామి! పరాకు-త్రిభువనాంకుశాంక-సత్యాశ్రయకులతిలక! పరాకు-సమస్తభువనాశ్రయ! విజయాదిత్య మహారాజాధిరాజ-పరాకు!

వంది—పరచక్రరామ! విక్రాంతచక్రాయుధ! జయీభవ దిగ్విజయీభవ!

మాగధి — స్వాక్రమాక్రాంతసకలభువనమండ-బిరుదాంకభీమ! పరాకు.

వంది — అనేకతులాభారదానధారాప్రక్షాళిత కల్మషుండ! విజయీభవ! దిగ్విజయీభవ!

మాగధి—బలి శిబి దధీచికర్ణ సత్పురుషుల ధిక్కరించిన యాచకజనచింతామణీ! బహుపరాకు.

వంది—త్రిపురమర్త్య మహేశ్వరుడ! ప్రతాప మూర్తీ, జయీభవ! దిగ్విజయీ భవ!

అమాత్యుడు—త్రిభువనాంకుశుండు సమస్తభువనాశ్రయుండు పాండ్యపల్లవ, గాంగనొళంబ, రాష్ట్రకూట డహాల చక్రకూట కోసల కళింగాది సకలదక్షిణాపథ రాజ్యములవైభవమును కొల్లగొట్టి తెచ్చిన అమూల్య రత్నాభరణములు సువర్ణరాశులను అర్థిజనులకు తులాభారములు తూగి లెక్కసేయకుండ నిశ్శంకతో ధారపోయుచున్నాడు. ఆంధ్రభూమిభాగ్య మేమని వర్ణింతును!

వంది—భళిరే సమస్తభువనాశ్రయుడు క్షీరసాగరమువోలె లక్ష్మీప్రభవుడు; మహానుభావుడు; మా రాజచంద్రుని భాగ్యంబు సామాన్యమే!

మాగధి—భళిరే! దానరాధేయ, పరాకు.

వంది—సకలరిపునృపతిమకుటతటఘటిత మణిగణమధుకర నికరపరిచుంబిత చరణసరసీరుహ, పరమభట్టారక, కవిజనాశ్రయ జయీభవ! దిగ్విజయీభవ!

పండరంగడు—రాజపరమేశ్వరుడు అర్థిచింతామణిమాత్రమ కాదు; కవీంద్రుల పాలిట కామధేనువు కూడ! విజయవాటికానగర కవీంద్ర సమాజ పురస్కారము మన యిలవేలిక.

కవీంద్రులు—మహామంత్రులకు మా విన్నపమొకటి కలదు. సకలభువనవందిత శౌర్యయశుడు, సకల గుణగణాలంకృతుడుగ విరాజిల్లు మా మహారాజును విఖ్యాతుడైన గుణగని, మా ఆంధ్రాధీశుని, వర్ణింపజెల్లదే మాకు!

కవివామనభట్టు—అనుజ్ఞ నొసగుదురు గాక!

"కాంతే రిందుః, కుమారాః
క్షితి, రమరతరు స్త్యాగశక్తేః, ప్రతాప
స్యార్కః, శౌర్యస్య సింహో
జలధిరపి మహాసత్త్వతాయా యథాయం
స్థానం స్యాదేవ మన్యే
న్నహి భవతి మహీతీవ భీతా న్నితాంతం
నిత్యం సర్వాత్మనాయం
ప్రభజతి విముఖే యత్ర నాన్యప్రతిష్ఠమ్.

"గంగా సంగజపై రిశక్తి రథమా న్
రక్తైకసంచోదతో
జిత్వా మంగిశిరోఒగ్రహరత్ యుధి మహా
బాహోస్ప్రవీరాస్యసౌ
కృష్ణం సంకిల మంకితాఖిలబల
ప్రాప్తోరుసద్విక్రమో
భీతా ర్తంచ విధాయ తత్పురవరం
మో నిర్దదాహ ప్రభుః"

మహాకాలభట్టు—

"సమరనిరతా రాత్రితా నశేకభశేక్యాన్
ప్రకృతిబలసంపన్నః తేజస్తవిక్రమకోన్నతిః
విలసదసితా జిత్వాపి సూర్యం ప్రతాపయశోమరై
ర్జయతి విజయాదిత్యో నిత్యం గుణైకృబిగాయ సః"

"అంగా త్సంగ్రామరంగే నిఖిలరథనిసా
మంగిరాజో త్తమాంగం
తుంగా ద్రేః శృంగ ముద్యాస్య మశని రివ ముదా
పాతయ త్యన్నరాంకం
నిశ్శంకం పంకిలేన ప్రథితజనపదా
దుర్గమా నిర్గమయ్య
ద్రాఘ్రాణం యః ప్రవేశ్యః ప్రభు
రభయమనాః ప్రత్యపా ద్బద్దిగాంకమ్"

శ్రీవిక్రమభట్టు—

"శాళింగగంగరూపాస్యతి కోసలేశోన్యపాదిచ
పాండ్యపల్లవహేమాదిహో రాత్యా ఇతి మాహరత్.
గంగా నారోపయుద్ధంగకూట మ్యంగిశిరోఒగ్రహరత్
కృష్ణం రణే జయ ద్వక్తుం కస్సమర్థో సుపాహసమ్"

గుణగవిజయాదిత్యుడు—అహో, ఏమి ఈ గీర్వాణకవుల కవనమాధుర్యము! వీరెల్లరును మా కాప్తులుగద! వీరిని బరితుష్టులను జేయవలయు. కాని యీ గీర్వాణకవులందరు ఒకవిధముగా పక్షపాతము జూపుచున్నారు. మద్రాజ్యరక్షణమునకు గావలసిన బలిసిన దీర్ఘబాహువులు గల ప్రతాపమూర్తి, మహాత్ముడు, వీరుడు ప్రెగ్గడ పండరంగని శౌర్యకృత్యములన్నియు రాజభక్తి విశ్వాసములచేగాబోలు నిశ్శంకగా మాకే ఆరోపించినారు ఈ కవులు!.........కృతజ్ఞుడు ప్రభుపండరంగసేనాని, వివిధరణకోవిదు డాతడు- శూరుడు, అధికబలసంపన్నుడు. కీర్తనీయు డాతడు. ఈ కవిజనస్తుతివ్రాతము లన్నియు విజయలక్ష్మితో పాటు సామ్రాజ్యలక్ష్మిని అఖండవిభవములో వేంగీశ్వరులమైన మాకు సమర్పించిన ఈ సమస్తసేనాపతికి, ఈ యుత్తమభూసురునకు, ఈ విఖ్యాత వీరపుంగవునకు నిస్సందేహముగ జెందవలయును. కవిముఖ్యులార! ఆలకింపుడు మా విన్నపమొక్కటి. ఆంధ్రదేశ మిది! ఆంధ్రాధీశులమైన మాకు, జనని ఆంధ్రభాషపై అభిమానము మెండు!

కవిమాధవభట్టు—మహాప్రసాదము - మాస్వామి విజయుని ఆదేశము! ప్రభుపండరంగని సంగరక్రీడలను వర్ణించి యొక మహాకావ్యమును గూర్పగలము. అయినను అవధరింపు డీ తిరువోజను.

"పట్టంబుగట్టిన ప్రథమాంబు కేణ్డు,
బలగర్వంబొప్పంగం బై లేచిసీన
పట్టంబు గట్టిప్పి ప్రభుం బండెరంగుం
బన్నిన, సామంతపదువతో బోయ
కొట్టంబు ల్పన్నెణ్డ్రు గొని వేంగినాణ్టిం
గొల్చి యాత్రిభువనాంకుశంబనానిల్చి
కట్టెపు దుర్గంబు కడు బయిల్సెసి,
కణ్డుకూర్బెజవాడ గావించి మెచ్చి."

గుణగవిజయాదిత్యుడు—ఎంత రమణీయముగ నున్నవి వినుటకే! వీరుని శౌర్యకార్యములు, ప్రభుపండరంగా! మీ భాగ్య మతులితము.

పండరంగడు—నా కులస్వామి, వేంగీపురు నాపై గల అభిమానగౌరవములు కారణములు కవిజన స్తుతివాక్యములకు.

గుణగవిజయాదిత్యుడు—ప్రభుపండరంగా! భువిపై ఆంధ్రభాష వర్ధిల్లునందాక ఈ పద్దెము శిలాక్షరమై నిలచియుండుగాక.

వంది—(ముందుకువచ్చి)
జయ! జయ! త్రిపురమర్త్యమహేశా!
జయ! జయ! సమస్తభువనాశ్రయ!
జయ! జయ! జయ! చాళువిజయాదిత్యదేవ!
జయ! జయ! జయ! ఆంధ్రభూమాఖండలా
జయ! జయ! జయ! జయ!

(కట్టకడపట మాగధుని కాహళధ్వని వినబడును)

౧౦ వ రంగము

[ఒకనాటి అర్ధరాత్రమున-వెన్నెలలో. బందియై యున్న నిరుపమ ఉపవనాంతరమున దుఃఖించుచు, ఒంటరిగా ప్రవేశించును.]

నిరుపమ—పదియేండ్లు గడచిపోయినను మా రాష్ట్రకూటకులమునకు వాటిల్లిన కడగండ్లు గడచేర లేదు! నాతండ్రి కృష్ణవల్లభు డెక్కడ నున్నాడో గదా! జీవించియుండెనో లేదో! నాజనని ఎచ్చట నున్నదో! ఏమి ఈ గుణగవిజయాదిత్య మహారాజ ప్రతాపము! ఏకచ్ఛత్రాధిపత్యముగ పాలించుచున్నాడు సార్వభౌమపదముతో సకలదక్షిణాపథమును. రాష్ట్రకూటుల వైభవ, శ్రీ, పారమేష్ఠ్యములు నశించిపోయినవి. రాష్ట్రకూటరాజ్యచిహ్నములు లాంఛనములు పాలికేతనధ్వజము- అన్నియు విజయాదిత్యమహారాజు తన నగరుకెదుట పాదుకొల్పియున్నాడు. గంగాయమునలు ఈ చాళుక్యకులతిలకుని నగరరక్ష దేవతలై, సింహద్వారమున కిరుకెలంకుల ద్వారపాలకులై వెలసియున్నవి. అహో! వేంగీశ్వరుని వశమైన ఈ వైభవమును జూచి యానందింతును. కాని రాష్ట్రకూటరాజ్యవినాశమునకు దుఃఖింతును. హా! హతవిధీ!

ఎన్నటికైన విముక్తి కలదే!
ఎంతటి నిర్భాగ్యురాలు ఈ నిరుపమ!
(దుఃఖించుచు విరహోత్కంఠయై పాడును.)
ముందగమున మనసు దోచిన మారాజు రాడేల!
అందరాని ఫలము ఆశపడి రేల విలపింతు
ఎంత దుడుకు చేసెనే యీ వనిత ఈ
వంత ఎవరితో దెలుపుకొందునే
అటుగంటివాని కిల్లాలు గాని యీ తనువు
ఎటుల ధరియింతునో ఏఱుగలేనె.

(తెరలోపల శబ్దము)

కావలివాండ్రు హెచ్చరిక చేయుచున్నారు. తడయరా దింక; పోవలయు.

౧౧ వ రంగము

[బెజవాడ నగరులో. త్రిభువనలక్ష్మీ ప్రాసాదమున. పూర్వోక్తసరణి గుణగవిజయాదిత్యమహారాజు కొలువు దీరియుండును. వందిమాగధుల బిరుదుగద్యములు, హెచ్చరికలు, పుణ్యాహవచనంబులు, వేదవిప్రుల పరమాశీర్వాదంబులు నడచినవెనుక—]

వినయాదిశర్మ—స్వామి! పరమభట్టారక! పరమేశ్వర! అవధారు!

ప్రతీహారి—దేవర శ్రీ చిత్తము సుప్రసన్నమగు గాక. ఇదిగో పదచ్యుతులైన రాష్ట్రకూటకులస్వామి! మోడ్పుచేతులు ఘటియించి నిలిచియున్నారు. రాయబారము నడుపవచ్చిన రాజకుమారుని బందీచేసిన ధార్మి

పుడు! యుద్ధరంగమున నిలిచి పోరాడజాలక వెన్నిచ్చి పాఱిన పిఱికి. పరాభవమునొంది, అలంబిష్ణలమత్యకించి, పదియేండ్లు అజ్ఞాతవాసము సలిపి, తలదాచుకున్న నీతి పరుడు. ఆనాటి నలమహారాజువోలె, రూపుమాసి తొలగి, దుఃఖమున, దైన్యమున పొరలాడుచుండ, ఏలిన వారి గూఢచారులచే కనిపెట్టబడి, దేవరయాస్థానము నకు గొనిరాబడిన కృష్ణభూపాలుడు!

పండరంగడు—ఈనాటికైన పోరు నష్టముని కృష్ణరాజు గ్రహించియుండును! చిరబంధుత్వమునైన సరకుసేయక మాత్సర్యముతో దుర్మతియై వేంగీశ్వరునకు కీడు తలపెట్టినదానికి ప్రతీకారము జరిగినది.

గుణగవిజయాదిత్యుడు—భీతిచే ఆర్తినొందిన వీనిని, మేము బంధుత్వమును పాటించి కాచువారము. రాష్ట్రకూటకులపాంసను కృష్ణభూపతి చంపదగినట్టి శత్రువైనను మేము క్షమించి విడుచువారము. కన్నరా! మాత్సర్యముతోపాటు రాజ్యతృష్ణను పెంచుకొని వైరానలము ప్రజ్వరిల్ల జేసిన తాతయు, తండ్రియు, కడకు నీవును జేసిన దుష్టకార్యములను మా రాజ చాళుక్యవంశము మఱువజాలదు. అయినను అధమస్థితికి వచ్చిన నిన్ను శిక్షించుటకంటె రక్షించి పొమ్మనుట మేలు!

పండరంగడు—స్వామీ! ఏలినవారి శ్రీచిత్తము అలరియుండుట ఈ కన్నరుని భాగ్యము! ఇతడు గుణగ విజయాదిత్య మహారాజాధిరాజుల ప్రేమల బందియై నిలచియుండు పరాభవ మది చాలదె! మరల...

గుణగ విజయాదిత్యుడు—(అర్ధోక్తిగా) ప్రభు పండరంగ సేనాపతీ! సామంతపదవితో కన్నరుని కిరణపురమునకు గొనిపోయి, రాష్ట్రకూట కులప్రధానులను, వృద్ధామాత్యగురుజనములను, మహాసామంత మహామాండలికలోకమును సగౌరవముగ ఆహ్వానించి వారికట్టెదుట, వారి యేలికను మరల సింహపీఠముపై కూర్చుండబెట్టి, రాజ్యాభిషిక్తుని జేసి, అతని రాజ్యమాతని కొసగి రమ్ము.

కృష్ణవల్లభుడు—దేవా! ఆంధ్రపతీ! విజయాదిత్యమహారాజాధిరాజ, చిరబాంధవ్యమునుమాట తెలిసి నందులకు ఎంతయు కృతజ్ఞుడను. నేను వేంగీశ్వరుని హృదయపీఠమున మొలకెత్తిన స్నేహాంకురము మరల సుస్థిరమై నాటుకొనియుండుగాక! ఈ సేవకునది విన్నప మొకటి గలదు!

సన్నిధానవర్తి—అమోఘవర్ష మహారాజాధిరాజుల పౌత్రి, కృష్ణభూవరుని తనయ, శంకిలుని మేనకోడలు కన్య నిరుపమ కుమారరథిని వలచియున్నది కదా!

పండరంగడు—వింటి వింతవలపు ఆ కథను కొంత.

వినయదిశర్మ—ప్రభుచిత్తము దాని కనుమోదింపవలయునని మా ఆశ!

గుణగ విజయాదిత్యుడు—ప్రెగ్గడలు వచించినది మా శ్రీచిత్తమునకు హత్తినది. కాని, కుమారరథుని మనసు తెలియవలయును కదా!

వినయదిశర్మ—ఆయుష్మంతుడు కన్య నిరుపమపై వాలి గొనియున్నాడు.

గుణగవిజయాదిత్యుడు — అటులే మాకును సర్వథా అంగీకారము! రాష్ట్రకూట కులసంజాత మరల నింకొకసారి వేంగీశుని పట్టమహిషి యగునట! భళిర!

వంది—

జయ! జయ! సమస్తభువనాశ్రయ
జయ! జయ! త్రిభువనాంకుశ
విజయాదిత్యమహారాజాధిరాజ.

మాగధి—

జయ జయ! విజయవాటికాధీశ,
జయ! జయ! చాళుక్యకులతిలక.
జయ! జయ! మదనవిలాస
జయ! జయ! భువనకందర్ప!

వంది—

జయ! జయ! బిరుదాంకభీమ!
జయ! జయ! పరచక్రరామ!

జయ! జయ! విజయాదిత్యభూప!
జయజయ విక్రమధవళ!

మాగధి—

జయ! జయ! వేంగీవిషయాధీశ్వర!
జయ! జయ! ఆంధ్రధాత్రీపతీ!

వందిమాగధులు—(కలిసి)

జయ! జయ! త్రిపురమర్త్య మహేశా!
జయ జయ! సమస్తభువనపతీ!

ఓం శాంతిః

(పంచమహాశబ్దములు - జయఘంటలు
మంగళ తూర్యారావములు)



# భారతములో నామనిర్వచనాలు

*

— శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ —

భారతములోని ప్రతినామమునకు వివరణము నాయా తావులలో వ్యాసులు చేసియేయున్నారు. కథావస్తువు నిమిడించిపెట్టినవి, అర్థవత్తులే గాని నిరర్థకమైన నామ మొక్కటియు భారతములోఁ గానరాదు. కవిత్రయము వాని నన్నిటిని వివరింపలేదు. వేదములను, భారతమును తూచినప్పుడు వానికంటె భారముగా నుండుటచేత దీనిపేరు భారత మన్నారు. భారము కలది భారతము. మహదర్థములో తప్ప్రత్యయమును పర్వ, మహచ్ఛబ్దములకే పాణిని సూత్రించెను. కాని మహర్షి వాక్యములు పాణినిసూత్రాలకు ప్రమాణ విషయములో తీసిపోవు. భరతవంశమువారి చరిత్ర భారత మనికూడ నిర్వచనము గలదు. ఇంకను చాలవివరణా లున్నను, ఇవి రెండు పాండిత్యప్రకాశాలకు సూచించునవి కావు. విస్తరభయముచేఁ గొన్నిటినిమాత్ర మిచ్చట నుదాహరింతును.

## జరత్కారువు

ఈ పేరు చాల విచిత్రమైనది. ఇటువంటి పేరు పురాణవాఙ్మయములో మఱొకటి మఱి కనిపించదు. ఇతఁడు భృగువంశములోనివాఁడు. అజన్మము బ్రహ్మచర్యదీక్ష వహించి, పితృదేవతల కోపానికి జడిసి, పెండ్లికి సంకల్పించెను. కాని అందులో ఒక నియమ మున్నది. అతఁడు సనామధేయురాలైన కన్యనుగాని పెండ్లిచేసికోఁడఁట. ఈకోర్కె ఎంత వింతగా నున్నదో చూడుఁడు. అది జనమేజయుని సర్పయాగములో పాములు నశించునను తల్లి శాపానికి వాసుకి భయపడు రోజులు. అతఁడు బ్రహ్మను ప్రార్థించి జరత్కారువు వలన తన చెల్లెలికి కలుగు కొడుకు సర్పయాగము నివారించునని తెలిసికొని, యాబ్రహ్మచారికి వివాహసంకల్పమేర్పడుట కలుగునాయని యెదురుచూచుచుండెను. చిరకాలము గడచినది. ఈవిధముగా, ఆ కన్యార్థుల హృదయాలతో దేహాలుకూడ శుష్కించినవి. అసలు వీరి పేరు లేవోగాని, యిట్లు కృశించిపోవుటవలన వీరికీ పేరులు వచ్చె నని మాత్ర మున్నది.

జరత్కారు వనఁగా కృశించిన శరీరము కలవాఁడని కవి నిర్వచించెను. ఇఁక వీరికిఁ బెండ్లి జరిగినది. నా మనస్సుకు వ్యతిరేకముగా నడచిన రోజున నేనామెను వదలివేసెద నని ముని నియమము చేసెను. పాపము, కన్యకాంత అందుకు అంగీకరించెను. కాఁపురము సుఖముగా నున్నది. కొన్ని సంవత్సరములు వెనుకపడినవి. ఒక రోజున ఆయన యిల్లాలితొడ తలాడగా శయనించెను. సాయంకాల మైనది; ఆయన లేవఁడు. తోటి మునులు నిత్యకృత్యములు నెఱవేర్చుచున్నారు. పాపమా మగువ ధర్మక్షయమునకు వెఱచి తన పెనిమిటిని లేపినది. ఆయన యాగ్రహుఁడై, నీకును నాకును ఈ రోజుతో సరి అన్నాఁడు. ఆమె గడగడలాడినది. బతిమాలినది. కాని లాభము లేకపోయినది. చివరకు తన అన్నగారి చిరవాంఛితమును వివరించినది. ఆ ముని మనస్సు కరఁగలేదు. చిట్టచివర కామె తన తొలిచూలు చిన్నెలను శంకించి అడుగకతప్పినది కాదు. ఆయన "అస్తి" అని జవాబు చెప్పి వెళ్ళిపోయెను. ఈ విషయమంతయు విని వాసుకికి కొంత తృప్తి కలిగినది. ఆమెకు కొడుకు కలిగెను. ఆవిడకు నెలతప్పినపుడే ఆయన "అస్తి" అని చెప్పుటచే వానికి ఆస్తీకుఁడని పేరు వచ్చెను. అతఁడు సర్పయాగము నివారించుట ప్రసిద్ధము. ఇక్కడ ఒక విషయము గుర్తింపవలసియున్నది. ఒకే పేరుగల దంపతులు మంత్రము పెట్టిన శక్తిసహము తగ్గిపోవునఁట. ఇది

మన తెలుఁగునాట పెక్కుచోట్ల వినఁబడును. ఒకే పేరుగల దంపతు లందఱు నాగలోకానికి ప్రాణభిక్ష పెట్టిన ఆస్తీకుని తల్లిదండ్రులవంటివారని కాఁబోలు వారి యూహ. ఈ కథ మఱుఁగుపడినది. కాని మాత్రము నిలిచినది. తెలుఁగులు నాగజాతివా రనే ప్రవాదమునకు, దీనికిఁ గల సంబంధ మెట్టిదో!

## అరుణుఁడు

ఈ పేరు సూర్యునకు, అతని సారథికి కూడ ఉన్నది. సూర్యుని పక్షములో ఉన్నవాఁడని యర్థము. ఇది యందఱకుఁ దెలిసినదే. కాని యీ పేరు అతని సారథికి కూడ వర్తించుటలో విచిత్రగాథ యొకటి యున్నది. విష్ణువు మోహినియై అమృతము పంచునప్పుడు దేవతలలో దూరిన రాహువును గుర్తించి సూర్యచంద్రు లా విషయమును శ్రీహరికిఁ దెలిపిరి. అతఁ డా రక్కసుని రెండు ముక్కలు చేసినను వాఁడు చావలేదు. అమృతపానమువల్ల ఒకరికిద్దఱు రాహువులైనారు. అప్పటినుండి పర్వకాలములలో సూర్యచంద్రులను వారి కాహారముగా నియమించినాఁడు. ముక్కోటి వేల్పుల మేలు కోరి చెప్పినందుకు, తనకు వచ్చిన యీ యవమానమును చండప్రకృతియైన సూర్యభగవానుఁడు సహింపలేకపోయెను. ఒకనాఁడు వేల్పుల నందఱిని దహించుటకు ప్రళయభీకరరూపముతో రవి యుదయించినాఁడు. లోకాలన్నియు గగ్గోలుపడినవి. అదే సమయానికి వినత, తన సవతికొడుకుల రూపు చూడలేక ఒక యండమును భేదించినది. అందులోనుండి యనూరుఁడు పుట్టి యామె దుష్కృత్యమును గర్హించుచు సూర్యమండలమును సమీపించెను. ఈ కాళ్లులేని పక్షిని చూడఁగానే ఆ లోకబంధుని హృదయము కరఁగిపోయి శాంతస్వరూపముతో నతనిని దన సారథిగా మన్నించినాఁడు. లోకసంహారమునకు సంకల్పించిన యా కర్మసాక్షి కడ్డుపడి మమ్ము రక్షించితి వని లోకాలన్నియు అనూరుని స్తుతించినవి (అరుణః=అడ్డగించితివి) ఇట్లు లోకము లన్నియు "అరుణః, అరుణః" అని పలుకుచుండుటచే నతని పేరు అరుణుఁడని వ్యవహారములోనికి వచ్చినది. తిఙంతము సుబంతముగా నిట్లు వ్యవహరింపఁబడుట సంస్కృతములో వింతలలో వింత.

## ఘటోత్కచుఁడు

ఇతఁడు బట్టతలవాఁడు. పుట్టఁగానే తల్లి వీనిని జూచి, "ఘటో హాసీ త్యుత్కచ" అన్నదఁట. అందుకని వీని కీపేరు వచ్చినది.

## అభిమన్యుఁడు

'అభీః, మన్యుమాంశ్చ' అనఁగా భయములేనివాఁడు, కోపముకలవాఁడు నని యర్థము.

## అర్జునుఁడు

తెల్లనివాఁడు అని యర్థము కన్పించుచున్నది. కాని మూలములోను, అనువాదములలోను నల్లనివాఁడుగనే యితఁడు వర్ణింపఁబడెను. కవిత్రయముమాట మనకు శిరోధార్యముగదా. కవిబ్రహ్మ యర్జుననామమును నిర్వచించునపుడు దుర్లభమగు నవదాతవర్ణము కలుగుటవలన నీపేరు వచ్చినట్లు చెప్పినాఁడు. ఈ శబ్దార్థములకుఁ గల విరోధమును పరికించియే యతఁ డీ యవదాతశబ్దమును ప్రయోగించెనని చెప్పక చెప్పుచున్నది. అవదాతశబ్దము విశుద్ధవాచిగాని వర్ణవాచి గాదని దీక్షితుఁడు చెప్పినాఁడు. అనఁగా నిర్మలుఁడని తేలుచున్నది. కవిత్రయము వరుసగా ద్రౌపదీస్వయంవరము, సంజయరాయబారము, సైంధవపరాభవమునందు నాతనిని నల్లనివాఁడనియే వర్ణించిరి.

## ఉత్తర గోగ్రహణము

ఉత్తరదిక్కునందలి గోవులను పట్టుకొనుట యని యిందలి యర్థము. కౌరవుల పక్షమునకే కాక కిరీటిపక్షమునను నిది యన్వయింపవచ్చును. అప్పుడు ఉత్తరుని, గోవులను గ్రహించుట యని యర్థము చెప్పవలయును. కథనుబట్టి చూచినచో, వెండటివానికంటె నిది గొప్పదగుటచే దీని కీపేరు వచ్చిన దనవచ్చును. ఏలన, దక్షిణగోగ్రహణమున సుశర్మాదులకు సపరివారముగా విరటుఁ డెదుర్కొనెను. ఇందు భీష్మాది సర్వకౌరవ మహావీరులను, బృహన్నల యొక్కఁడే గదా నిర్జించినది. మఱియు విశేషార్థ మిందుఁగలదు. ఉత్తర మనఁగా సమాధానము. సమాధానరూపమైన,

లేక పమాధానము వచ్చిన గోగ్రహణమని చెప్ప వచ్చును. కౌరవులకు వారు చేసిన దుర్నయమునకు తగిన జవాబు వారి కీఘట్టమునవే సరిగా ముట్టినది. పేరోలగమున నొక యిల్లాలి జుట్టుపట్టి యీడ్చుటకు మహారణమున నొక్కరథికుఁడు తన సారథిచే మహా రథులగువారి తలచీర లూడిపించుట తక్కువగాదు. వ్యాసుని యీ విశేషాభిప్రాయమును గుర్తించియే కావలయు తిక్కన అర్జునుఁడు చేసిన దుర్యోధనో పాలంభమును రమ్యముగాఁ జిత్రించినాఁడు.

## పరాశరుఁడు

ఇతఁడు శక్తికొడుకు; వసిష్ఠుని మనుమఁడు. ఆయనకొడుకులు నూరుగురు విశ్వామిత్రునిమూలముగా నొక రాక్షసునిచే కాలధర్మమునందినారు. ఆ పుత్ర శోకము పట్టలేక వసిష్ఠుఁడు మరణింపఁదలఁచినాఁడు కాని పెద్ద కోడలు అదృశ్యంతిగర్భమునుండి శక్తికంఠము వినిపించి ఆ ప్రయత్నము మానినాఁడు. ఆమెకు పుట్టిన కొడుకే పరాశరుఁడు. "పరాసుః స్థాపితో యేన పరా శర ఇతి స్మృతః" అని నిర్వచనము. అనఁగా చావ నిశ్చయించినవాని నితఁడు నిలుపుటచే నితఁడు పరా శరుఁడు. అప్పుడు పరాసురుఁడనియో, పరాసరుఁ డనియో యుండవలెను. ఆర్షప్రయోగము శిరోధార్యము. అస లప్పుడా పేరే యున్నా తరువాత మారవచ్చును. దానికి గాథ కలదు. ఇతఁడు తండ్రిని చంపిన పగ పెట్టు కొని రాక్షసయాగము చేసినాఁడు. ఆశరులనఁగా రాక్ష సులు. ఇతనివలన రాక్షసులు పరాభూతులైనారు కనుక ఇతఁడు పరాశరుఁ డైనాఁడు.



# తెల్లాడు! - నల్లాడు!

•

— శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు —

౧

ఏ మంచు తెరలలో ఎందు దాగున్నాడో?
ఏడుగొండల నెక్కి ఎచట కూర్చున్నాడో?
నిప్పుకుంపటికన్ను గప్పి యెట్లుంటాడో?
బూగ్గులో నగ్గియై పొంచి యేమంటాడో?
హాలాహలము దిన్న యాతడా తెల్లాడు?-
అమృతపాత్రముగొన్న యాతడా నల్లాడు?-

౨

తలవంక నెలవంక దాల్చిన ట్లుంటాడు,
తనవారి పెరవారి దయజూడు మంటాడు,
చూపువారినచోట చుట్టుమనిపిస్తాడు,
తేరిచూచినచోట దారిచూపిస్తాడు,
నిలువెల్ల మాయనింపినవాడు తెల్లాడ?—
తనువెల్ల పట్టుగట్టినవాడు నల్లాడ?—

౩

అంకితే విభవంబు హరియించికొంటాడు,
జంకితే అభయంబు నవరించికొంటాడు,
కాలాహిసంకిళ్లు కాళ్ల చొప్పిస్తాడు,
క్షేమధర్మములెల్ల చెప్పియొప్పిస్తాడు,
ఈ చేదుమేపరి యేటి తెల్లాడురా?
ఈ యాలగాపరి యేటి నల్లాడురా?

౪

దయ్యాల దరి జేర్చి తంపు లెట్టిస్తాడు,
కయ్యాలు కడతేర్చి కలుము లిప్పిస్తాడు,
కలసివచ్చిన వల్లకాడు చూపిస్తాడు,
కొలిచివచ్చిన మెచ్చి కొండ యెక్కిస్తాడు,
సింగినాదము పట్టు జెట్టి తెల్లాడురా?—
పంగనామము పెట్టు బట్టి నల్లాడురా?—

౫

గణపతుల పురికొల్పి కట్టు కట్టిస్తాడు,
కులపతుల నరికొల్పి గుణము పట్టిస్తాడు,
కలసివచ్చారంటె కైలాన మంటాడు,
వద్దచేరారంటె వైకుంఠ మంటాడు,
యీ వ్యోమకేశాఖ్యుడేటి తెల్లాడురా?
యీ సురాపగతండ్రి యేటినల్లాడురా?

౬

ఆదివారపుగంట అతడు నాదించినా
వేదవేదాంతముల్ వీడు బోధించినా
జడధి నాతడు తన శరధామ మంటాడు,
పుడమి నీతడు తన భుజకీర్తి యంటాడు,
ఏలేటి వీడోటమాలి తెల్లాడటే!
పాలేటి పూసెజ్జవాడు నల్లాడటే!—



# మన స్టర్లింగు నిల్వల భవిష్యత్తు



— శ్రీ సీతంరాజు వెంకటసుబ్రహ్మణ్యశర్మ —

ఆనాడు బ్రిటిషుప్రభుత్వమునకు రాయభారమువలెను, ఢిల్లీలో భారతప్రభుత్వముతో స్టర్లింగునిల్వల విషయము సంప్రదించుటకు వచ్చిన సంగతి బహుశః అందరికి తెలిసియేయుండును. కొంతవరకు సంభాషణలు ఉభయపక్షములకు సంతృప్తికరముగా సాగినవి. ప్రభుత్వములు తమలో తాము ఆలోచించుకొనుటకు రాయభారములను కొంతకాలము వాయిదా వేసి మరల సాగించిన బాగుండునని నిశ్చయించుకొనిరి. బ్రిటిషు రాయబారవర్గము భారతదేశమునుండి తరలిపోయినది. తరువాత సంభాషణలు లండనులో తిరిగి త్వరలో జరుగవచ్చును.

స్టర్లింగునిల్వలు ఏవిధముగా పెరిగిపోయినది మన మందరము ఎరుగుదుము. అవి అట్లు పెరిగిపోవుటకు కారణములుకూడ ఎరుగుదుము. కాని మన దేశములో వర్తమాన ఆర్థికదుస్థితులకు కారణము చాలవరకు స్టర్లింగు నిల్వలు అట్లు పెరిగిపోవుటయేనని చాలమంది గుర్తించియుండరు. అంతేకాదు. భవిష్యత్కాలములో మన దేశపు ఆర్థికస్వరస్థానిర్మాణము కొంతవరకు ఈ స్టర్లింగు నిల్వలపైనే ఆధారపడియున్నది. ముఖ్యముగా భారత, బ్రిటిషు దేశముల భవిష్యత్సంబంధము ఈ స్టర్లింగునిల్వల సమస్యాపరిష్కారముపైన చాలవరకు ఆధారపడియుండును.

యుద్ధమునకు ముందు ౧౯౩౯ వ సంవత్సరములో మన రిజర్వుబ్యాంకులో స్టర్లింగునిల్వల మొత్తము ౬౪ కోట్ల రూపాయలకు మించిలేదు. కాని యీనాడు స్టర్లింగునిల్వలు ౧౬౧౦ కోట్ల రూపాయలకు మించియున్నవి. గత కొన్ని నెలలనుండి ఈ నిల్వల మొత్తము తగ్గిపోవుచున్నది. భారతదేశమున కేంద్ర మన ప్రజాప్రభుత్వము అధికారములోనికి వచ్చినప్పటినుండి యీ నిల్వలనుండి ఎక్కువమొత్తము ఉపయోగించుచున్నట్లు బ్రిటిషుప్రభుత్వము కనిపెట్టినది. ఈ విధముగా నిల్వలను భారతదేశము వాడుకొనుటవలన వారి ఆర్థికవ్యవస్థకు నష్టముకల్గుచున్నదట; వారి పునర్నిర్మాణకార్యములకు ఆటంకము కల్గించునట. అందువలననే యింత త్వరలోనే యీ సమస్యను పరిష్కరించుటకు రాయబారమును పంపిరని కొందరి అభిప్రాయము. యుద్ధకాలములో మొత్తము ౧౫౪౬ కోట్లకుపైగా స్టర్లింగు మనము నిలువచేసితిమి. కాని జపాను యుద్ధములో ప్రవేశించినదిమొదలు యీ నిలువల వృద్ధి చాల హెచ్చినది. ౧౯౪౩-౪౪ నుండి ౧౯౪౫-౪౬ సంవత్సరములలోనే చాల పెద్దమొత్తములు పెరిగినవి. మన దేశములో కొన్ని-యుద్ధమునకు కావలసిన సామగ్రికి బ్రిటిషుప్రభుత్వము ఈ స్టర్లింగు రూపమున చెల్లించిన విషయము సువిదితమే. కొన్ని సామగ్రి ముఖ్యముగా కొనుగోలుదారుల వస్తువులే. ఇంత పెద్దమొత్తము వస్తువులు బ్రిటను కొనివేసి, విదేశములనుండి దిగుమతులు రానపుడు, మన దేశములో కొనుగోలుదారుల వస్తువులకు కరువు ఏర్పడి మనము బాధపడుటలో ఆశ్చర్య మేమున్నది!

భవిష్యత్కాలములో మన స్టర్లింగునిల్వల ఉపయోగము రెండు విషయములపై ఆధారపడియున్నది: ఒకటి, బ్రిటనుదేశములోని ధరలు; రెండు, ఈ నిలువలను ఏరూపములో ఎప్పుడు మార్చుకొనవచ్చును. ముఖ్యముగా ఈ రెండవ విషయములో మనము శ్రద్ధ తీసికొనవలెను. మొదటి విషయములో మనము జోక్యము కలుగజేసికొనుటకు వీలు లేకపోలేదు. కాబట్టి వీరై

వంత త్వరలోనే స్టర్లింగుసమస్యను పరిష్కారము చేసి కొనవలెను.

మన స్టర్లింగునిలువలు ఒక్కనాడు పెరిగినవి కావు. కాని బ్రిటనులో ధరల మట్టముకూడ పెరుగు చునేయున్నది. ౧౯౩౯ లో బ్రిటనులో ధరల ఖాత సూచీసంఖ్య ౪౦ వుండేది. ౧౯౪౪-౪౫ సంవత్సరము వరకు అది ౧౭౦ వరకు పెరిగినది; ఇంకను పెరుగుచునే యున్నది. ౧౯౩౯ వ సంవత్సరమునుండి ధరలు బ్రిటనులో ౫౦ పాయింట్లు పెరిగినవి; అంటే నూటికి ౪౦ వంతులు పెరిగినవన్నమాట. ఈ దామాషా ప్రకారము మనకు ౧౯౩౯ సం.లో ఉన్న స్టర్లింగునిలువల విలువ పడిపోయినదికదా! ఇట్లే మనకు స్టర్లింగునిలువలు ఏయేసంవత్సరములలో పెరిగినవో ఆయాసంవత్సరములనుండి బ్రిటనులో పెరిగిన ధరల దామాషా ప్రకారము మన స్టర్లింగునిలువల కొనుగోలుశక్తి (Purchasing Power) పడిపోయినది. మనకు స్టర్లింగునిలువలు పెరిగినప్పుడే వస్తువులు మనము కొనియుండినచో, ఇప్పటికన్న మనకు చాల లాభకరముగా ఉండెడిది ఇకముందైనను బ్రిటనులో ధరలు పెరగవని మన మెట్లు చెప్పగలము ? కాని బ్రిటనులో ధరలు మన తప్పులేకయే పడిపోయినచో నష్టపడెడిది మనమేకదా! దానికి బాధ్యులు బ్రిటిషు ప్రభుత్వమేకదా? కాబట్టి ధరలు పెరిగిపోవుటవలన మన స్టర్లింగునిలువల విలువ తగ్గిపోయినచో వాటికి బ్రిటిషు ప్రభుత్వమే బాధ్యత వహించవలెను. అర్జెంటైనా విషయములో బ్రిటిషు ప్రభుత్వము ఇట్లు పూచీపడినది. దానిమూలముగా బ్రిటిషు స్టర్లింగువిలువ (బంగారముతో పోల్చిచూచినచో)పడిపోయి, అర్జెంటైనా నష్టపడినచో, ఆ నష్టమును పూడ్చుటకు కావలసినంత అదనపుస్టర్లింగును బ్రిటిషు ప్రభుత్వము ఇచ్చును. కాబట్టి ఒకవేళ స్టర్లింగునిలువల విలువ ఏకారణమువల్లనైనా పడిపోయినను అర్జెంటైనాకు నష్టమేమియు లేదు. అట్టి ఒడంబడిక భారతదేశపు ప్రస్తుత పరిస్థితులలో జరుగునని మనము ఆశించలేము.

మనము చేయగలిగినది వీలైనంత త్వరలో స్టర్లింగునిలువలను ఏదోవిధముగా పరిష్కారము చేసు కొని ఉపయోగించుకొనుటయే. మన స్టర్లింగునిలువలను మూడుభాగములుగా విభజింపవచ్చును: శాశ్వతముగా ఉంచివేయవలసిన నిధి; కొంతకాలము గడచినతర్వాత ఉపయోగించుకొనదగిన నిధి; వెంటనే ఉపయోగించు టకు తగిన నిధి.

చలామణిలోనున్న నోట్లకు నూటికి నలుబది వంతులు రిజర్వుబ్యాంకు బంగారముగాని, స్టర్లింగును గాని నిలువయుంచవలెను. చలామణిలో ప్రస్తుతమున్న నోట్ల విలువ సుమారు ౧౪౬౦ కోట్ల రూపాయలు; బంగారపు నిధి విలువ ౪౪౩ కోట్ల రూపాయలు. చలామణిలో నున్న నోట్ల పెరుగుదల తగ్గుదలకు వీలుగా నుండవలెను. బంగారపునిధి పెరుగునవకాశము లేదు. కాబట్టి అవసరార్థము కొంత స్టర్లింగునిలువ యుండవలసి యుండును; సుమారు ఒక ౧౦౦ కోట్ల రూపాయల స్టర్లింగునిలువ ఈ విధముగా నుంచవలెను. ఈ స్టర్లింగు నిలువ శాశ్వతముగా ఉండిపోవలెను. కాని చలామణిలో నున్న ధనము ఇప్పుడు చాల హెచ్చుగా నున్నది. ధనోల్బణమువలన మనము బాధపడుచున్నాము. క్రమేణా చలామణిలో నున్న ధనము తగ్గిపోవును. కాబట్టి ఇంత ఎక్కువ స్టర్లింగునిలువ అవసరము లేదు. అదియుగాక మన బంగారపునిధి తులము రూ. ౨౧-౩-౦ లు చొప్పున లెక్క వేయబడినది. ఇప్పుడు బంగారముధర చాల పెరిగినది. అదియుగాక చలామణిలో నున్న ధనమునకు ఇంతయని నిర్ధారితమైన భాగము నిలువగానుంచుట అనవసరమని అర్థశాస్త్రజ్ఞుల అభిప్రాయము. అట్లు నిర్ధారించుటవలన చలామణిలో నున్న ధనము అవసరములనుబట్టి కావలసినంత హెచ్చించుటకు వీలుండకపోవచ్చును. అందుచే స్టర్లింగు నిలువయే ఉంచవలెనా ! చలామణిలో నున్న ధనము తగ్గిపోయిన కొలదియు ఇంత స్టర్లింగు శాశ్వతపునిలువ అనవసరమగును. ఇవన్నియు లెక్క గానించినచో పైన చెప్పినరీతిగా బహుశః ౫౬౦-౬౦౦ కోట్ల రూపాయాల స్టర్లింగునిలువ అవసరము లేకపోవచ్చును.

కొంతభాగము మొత్తము స్టర్లింగునిలువలను తీసి. వేయవలెనని బ్రిటనులో కొందరి అభిప్రాయము. ఈ భాగమును బ్రిటనుకు భారతదేశము కానుకగా యివ్వ

# మన స్టర్లింగు నిల్వల భవిష్యత్తు

❀

— శ్రీ సీతంరాజు వెంకటసుబ్రహ్మణ్యశర్మ —

ఆగస్టు బ్రిటిషుప్రభుత్వముతరఫున నొక రాయబారము క్రొత్త ఢిల్లీలో భారతప్రభుత్వముతో స్టర్లింగునిలువల విషయము సంప్రదించుటకు వచ్చిన సంగతి బహుశః అందరికి తెలిసియేయుండును. కొంత వరకు సంభాషణలు ఉభయపక్షములకు సంతృప్తికరముగా సాగినవి. ప్రభుత్వములు తమలో తాము ఆలోచించుకొనుటకు రాయబారములను కొంతకాలము వాయిదావేసి మరల సాగించిన బాగుండునని నిశ్చయించుకొనిరి. బ్రిటిషురాయబారవర్గము భారతదేశమునుండి తరలిపోయినది. తరువాత సంభాషణలు లండనులో తిరిగి త్వరలో జరుగవచ్చును.

స్టర్లింగునిలువలు ఏవిధముగా పెరిగిపోయినది మన మందరము ఎరుగుదుము. అవి అట్లు పెరిగిపోవుటకు కారణములుకూడ ఎరుగుదుము. కాని మన దేశములో వర్తమాన ఆర్థికదుస్థితులకు కారణము చాల వరకు స్టర్లింగు నిలువలు అట్లు పెరిగిపోవుటయేనని చాలమంది గుర్తించియుండరు. అంతేకాదు. భవిష్యత్కాలములో మన దేశపు ఆర్థికవ్యవస్థానిర్మాణము కొంతవరకు ఈ స్టర్లింగు నిలువలపైనే ఆధారపడియున్నది. ముఖ్యముగా భారత, బ్రిటిషుదేశముల భవిష్యత్సంబంధము ఈ స్టర్లింగునిలువల సమస్యాపరిష్కారముపైన చాలవరకు ఆధారపడియుండును.

యుద్ధమునకు ముందు ౧౯౩౯ వ సంవత్సరములో మన రిజర్వుబ్యాంకులో స్టర్లింగునిలువల మొత్తము ౬౮ కోట్ల రూపాయలకు మించిలేదు. కాని యీనాడు స్టర్లింగునిలువలు ౧౬౧౦ కోట్ల రూపాయలకు మించియున్నవి. గత కొన్ని నెలలనుండి ఈ నిలువల మొత్తము తగ్గిపోవుచున్నది. భారతదేశమున కేంద్రమున ప్రజాప్రభుత్వము అధికారములోనికి వచ్చినప్పటినుండి యీ నిలువలనుండి ఎక్కువమొత్తమును ఉపయోగించుచున్నట్లు బ్రిటిషుప్రభుత్వము కనిపెట్టినది. ఈ విధముగా నిలువలను భారతదేశము వాడుకొనుటవలన వారి ఆర్థికవ్యవస్థకు నష్టముకల్గుచున్నదట; వారి పునర్నిర్మాణకార్యములకు ఆటంకము కల్గించునట. అందువలననే యింత త్వరలోనే యీసమస్యను పరిష్కరించుటకు రాయబారమును పంపిరని కొందరి అభిప్రాయము. యుద్ధకాలములో మొత్తము ౧౫౮౬ కోట్లకు పైగా స్టర్లింగు మనము నిలువచేసితిమి. కాని జపాను యుద్ధములో ప్రవేశించినది మొదలు యీ నిలువల వృద్ధి చాల హెచ్చినది. ౧౯౪౩-౪౪ నుండి ౧౯౪౫-౪౬ సంవత్సరములలోనే చాల పెద్దమొత్తములు పెరిగినవి. మన దేశములో కొన్న-యుద్ధమునకు కావలసిన సామగ్రికి బ్రిటిషుప్రభుత్వము ఈ స్టర్లింగు రూపమున చెల్లించిన విషయము సువిదితమే. కొన్న సామగ్రి ముఖ్యముగా కొనుగోలుదారుల వస్తువులే. ఇంత పెద్దమొత్తము వస్తువులు బ్రిటను కొనివేసి, విదేశములనుండి దిగుమతులు రానపుడు, మన దేశములో కొనుగోలుదారుల వస్తువులకు కరువు ఏర్పడి మనము బాధపడుటలో ఆశ్చర్య మేమున్నది?

భవిష్యత్కాలములో మన స్టర్లింగునిలువల ఉపయోగము రెండు విషయములపై ఆధారపడియున్నది: ఒకటి, బ్రిటను దేశములోని ధరలు; రెండు, ఈ నిలువలను ఏరూపములో ఎప్పుడు మార్చుకొనవచ్చును. ముఖ్యముగా ఈ రెండవ విషయములో మనము శ్రద్ధ తీసికొనవలెను. మొదటి విషయములో మనము జోక్యము కలుగజేసికొనుటకు వీలు లేనేలేదు. కాబట్టి ఏవై

వంత త్వరలోనే స్టర్లింగుసమస్యను పరిష్కారము చేసి కొనవలెను.

మన స్టర్లింగునిలువలు ఒక్కసారు పెరిగినవి కావు. కాని బ్రిటనులో ధరల మట్టముకూడ పెరుగుచునేయున్నది. ౧౯౩౯ లో బ్రిటనులో ధరల సూచీసంఖ్య ౭౦ వుండేది. ౧౯౪౪-౪౫ సంవత్సరమునకు అది ౧౨౦ వరకు పెరిగినది; ఇంకను పెరుగుచునేయున్నది. ౧౯౩౯ వ సంవత్సరమునుండి ధరలు బ్రిటనులో ౫౦ పాయింట్లు పెరిగినవి; అంటే నూటికి ౭౦ వంతులు పెరిగినవన్నమాట. ఈ దామాషా ప్రకారము మనకు ౧౯౩౯ సం.లో ఉన్న స్టర్లింగునిలువల విలువ పడిపోయినదికదా! ఇట్లే మనకు స్టర్లింగునిలువలు ఏయేసంవత్సరములలో పెరిగినవో ఆయాసంవత్సరములనుండి బ్రిటనులో పెరిగిన ధరల దామాషా ప్రకారము మన స్టర్లింగునిలువల కొనుగోలుశక్తి (Purchasing Power) పడిపోయినది. మనకు స్టర్లింగునిలువలు పెరిగినప్పుడే వస్తువులు మనము కొనియుండినచో, ఇప్పటికన్న మనకు చాల లాభకరముగా ఉండెడిది ఇకముందైనను బ్రిటనులో ధరలు పెరగవని మన మెట్లు చెప్పగలము! కాని బ్రిటనులో ధరలు మన తప్పులేకయే పడిపోయినచో నష్టపడెడిది మనమేకదా! దానికి బాధ్యతలు బ్రిటిషు ప్రభుత్వమేకదా? కాబట్టి ధరలు పెరిగిపోవుటవలన మన స్టర్లింగునిలువల విలువ తగ్గిపోయినచో వాటికి బ్రిటిషు ప్రభుత్వమే బాధ్యత వహించవలెను. అర్జెంటైనా విషయములో బ్రిటిషు ప్రభుత్వము ఇట్లు పూచీపడినది. దానిమూలముగా బ్రిటిషు స్టర్లింగువిలువ (బంగారముతో పోల్చి చూచినచో)పడిపోయి, అర్జెంటైనా నష్టపడినచో, ఆ నష్టమును పూడ్చుటకు కావలసినంత అదనపుస్టర్లింగును బ్రిటిషు ప్రభుత్వము ఇచ్చును. కాబట్టి ఒకవేళ స్టర్లింగునిలువల విలువ ఏకారణమువల్లనైనా పడిపోయినను అర్జెంటైనాకు నష్టమేమియు లేదు. అట్టి ఒడంబడిక భారతదేశపు ప్రస్తుత పరిస్థితులలో జరుగునని మనము ఆశించలేము.

మనము చేయగలిగినది వీలైనంత త్వరలో స్టర్లింగునిలువలను ఏదోవిధముగా పరిష్కారము చేసుకొని ఉపయోగించుకొనుటయే. మన స్టర్లింగునిలువలను మూడుభాగములుగా విభజింపవచ్చును: శాశ్వతముగా ఉంచివేయవలసిన నిధి; కొంతకాలము గడచినతర్వాత ఉపయోగించుకొనదగిన నిధి; వెంటనే ఉపయోగించుటకు తగిన నిధి.

చలామణిలోనున్న నోట్లలో నూటికి నలుబది వంతులు రిజర్వుబ్యాంకు బంగారమునుగాని, స్టర్లింగును గాని నిలువయుంచవలెను. చలామణిలో ప్రస్తుతమున్న నోట్ల విలువ సుమారు ౧౨౬౦ కోట్ల రూపాయలు; బంగారపు నిధి విలువ ౪౪౨ కోట్ల రూపాయలు. చలామణిలో నున్న నోట్ల పెరుగుదల తగ్గుదలకు వీలుగా నుండవలెను. బంగారపునిధి పెరుగుటకవకాశము లేదు. కాబట్టి అవసరార్థము కొంత స్టర్లింగునిలువ యుంచవలసియుండును; సుమారు ఒక ౧౦౦ కోట్ల రూపాయల స్టర్లింగునిలువ ఈ విధముగా నుంచవలెను. ఈ స్టర్లింగు నిలువ శాశ్వతముగా ఉండిపోవలెను. కాని చలామణిలో నున్న ధనము ఇప్పుడు చాల హెచ్చుగానున్నది. ధనోల్బణమువలన మనము బాధపడుచున్నాము. క్రమేణా చలామణిలో నున్న ధనము తగ్గిపోవును. కాబట్టి ఇంత ఎక్కువ స్టర్లింగునిలువ అవసరము లేదు. అదియుగాక మన బంగారపునిధి తులము రూ. ౨౧-౩-౦ లు చొప్పున లెక్కవేయబడినది. ఇప్పుడు బంగారముధర చాల పెరిగినది. అదియుగాక చలామణిలో నున్న ధనమునకు ఇంతయని నిర్ధారితమైన భాగము నిలువగానుంచుట అనవసరమని అర్థశాస్త్రజ్ఞుల అభిప్రాయము. అట్లు నిర్ధారించుటవలన చలామణిలో నున్న ధనము అవసరములనుబట్టి కావలసినంత హెచ్చించుటకు వీలుండక పోవచ్చును. అందుచే స్టర్లింగు నిలువయే ఉంచవలెనా! చలామణిలో నున్న ధనము తగ్గిపోయిన కొలదియు ఇంత స్టర్లింగు శాశ్వతపునిలువ అనవసరమగును. ఇవన్నియు లెక్కగొనినచో పైన చెప్పినరీతిగా బహుశః ౫౬౦-౬౦౦ కోట్ల రూపాయల స్టర్లింగునిలువ అవసరము లేకపోవచ్చును.

కొంతభాగము మొత్తము స్టర్లింగునిలువలను తీసివేయవలెనని బ్రిటనులో కొందరి అభిప్రాయము. ఈ భాగమును బ్రిటనుకు భారతదేశము కానుకగా ఇవ్వ

కలిగినట్లు కెనడా ౧౦౦౦ మిలియన్ల డాలర్ల ఇచ్చే కానుక యిచ్చినది. ఇట్లు తీసివేయవలెనను వారి వాదములు ఈ క్రిందివిధముగా నుండును :

౧. స్టర్లింగు నిలువలు ఎక్కువైనకొలది అవి త్వరగా తీర్చుటకవకాశము సన్నగిల్లిపోవుచున్నది. బ్రిటనులో ధరలు పెరిగినకొలదియు వాని విలువ పడిపోవుచుండును. ఈ స్టర్లింగునిలువలవలన బ్రిటనులో ధనోత్పాదము తగ్గించుటకు వీలగును. భారతదేశపు ద్రవ్యసంస్థ యన్నియు స్టర్లింగుపైననే ఆధారపడియున్నవి. కావున కొంత స్టర్లింగు నిలువలను వదులుకొని బ్రిటనుకు త్వరలో తీర్చుటకు అవకాశమిచ్చుట భారతదేశమునకే లాభకరము.

౨. భారతదేశములో ధరలు చాల పెరిగిపోయినవి. రూపాయివిలువ పడిపోయినది. కాని రూపాయి-స్టర్లింగు ముడివేయబడియుండుటచే రూపాయిమారకపు విలువ పడిపోలేదు. కావున బ్రిటనుకు చాలనష్టము కలిగినది. ఆ దామాషాప్రకారము స్టర్లింగునిలువలను తగ్గించవలెను.

౩. యుద్ధకాలములో వైట్‌హాల్ దైవమంత్రులు అతియాశంపు బీదదేశములలో అవి కలగనని ధనపురాశులను పేర్చి (బాగ్దాదులో ౫౦ మిలియన్ల స్టర్లింగు; జెరూసలెంలో ౧౦౦ మిలియన్ల స్టర్లింగు; కైరోలో ౨౦౦ మిలియన్ల స్టర్లింగు; క్రొత్తఢిల్లీలో ౧౦౦౦ మిలియన్ల స్టర్లింగు) వానిని అకస్మాత్తుగా ధనవంతములు చేసినారు.

స్టర్లింగునిలువలు పెద్దవై స్టర్లింగువిలువ పడిపోవునప్పుడు మనకు బ్రిటను తిరిగి ఋణముచేయుచున్నదనియే అర్థము. అంతేకాని వస్తువుల నమ్మినవారు కోట కట్టిపెట్టుకొనవలెనని కాదు. బ్రిటనులో జీవన ప్రమాణము భారతదేశములోకన్న చాల హెచ్చుగా నున్నది. వారు కొంత తగ్గించుకొని భారతదేశపు ఋణము తీర్చరాదా, లేక అసలే బీదదైన భారతదేశమును, బ్రిటను ఇంకను భాగ్యవంతము చేయుటకు కానుకలివ్వవలెనా !

భారతదేశములో ధరలు పెరిగి నష్టపడినది ప్రజలు గాని ప్రభుత్వములు గావు. వారికన్ని వస్తువులు కంట్రోలుధరలకే దొరికెను; వారికి కావలసిన వస్తువులకు కంట్రోలుధరలు తక్కువగానే నిర్ణయించుకొనిరి.

భారతదేశములో బ్రిటను కొన్న వస్తువుల ధరలు బ్రిటనులో ఆ వస్తువుల ధరలకన్న చాల తక్కువ అని బ్రిటిషుప్రభుత్వపు పార్లమెంటరీకమిటీయే చెప్పినది. అదియుగాక భారతప్రజలకు లేకుండా వస్తువులన్ని బలవంతముగా బ్రిటనుకు అమ్మించినారు. బ్రిటనుకు అమ్మిన సరుకులలో కొంతభాగమునుమాత్రమే దేశములలో అమ్మవలెనని నిర్ణయించినారు. ఉదాహరణకు : జోళ్ళు ; బ్రిటిషుప్రభుత్వమునకు అమ్మినవానిలో ౮ వ వంతుమాత్రమే దేశములో అమ్మవలెనని నిర్ణయించిరి. దానికి బ్రిటిషుప్రభుత్వమే ధరనిర్ణయించినది. మరి వర్తకులు అమ్మినధరలెనువా. ధరల విషయములో బ్రిటనుకు లాభమే గాని నష్టము కలుగలేదు.

వైట్‌హాల్ దైవమంత్రులు భారతదేశమున విడిచినది ధనదేవతగాదు - దరిద్రదేవతను. మన దేశములో క్షామములు; బట్టల కరవు; వస్తువుల కరువు; నానా బాధలు ఈ దైవమంత్రుల వరప్రసాదమే. అందుకై వారికి కానుకలీయవలెనేమో తెలియదు.

స్టర్లింగునిలువలనుండి ఏమాత్రమును తగ్గించుటకు వీలులేదని భారతదేశ రాయబారము ఘంటాపథముగా చెప్పివేయవలెను. అటుపైన కొన్ని ముఖ్యమైన విషయములను తేల్చవలసియుండును–స్టర్లింగునిలువలలో ఎంత భాగము వెంటనే ఉపయోగించుకొనవచ్చును; అవి ఏఏ విదేశనాణెములలోనికి మార్చుకొనవచ్చును; ఎంత భాగమును భవిష్యత్కాలములో ఉపయోగించుటకు ప్రస్తుతము నిధిగా మార్చవలెను; ఆ నిధి ఎప్పటినుండి, ఎన్నిఏండ్లలో, సంవత్సరమునకెంతచొప్పున, ఏ రూపమున ఉపయోగించుకొనవచ్చును; మిగిలిన నిలువలపై వడ్డీ ఏరేటుపై ఇవ్వవలయును మొదలైనవి.

భారతదేశములో ప్రజాప్రభుత్వము అధికారములో నున్నదిగాబట్టి, స్టర్లింగునిలువలు మన దేశ సౌభాగ్యమునకే ఉపయోగింపబడునని భావించవచ్చును. బ్రిటిషుదేశము ప్రపంచ అర్థికరంగమున తిరిగి తన ఆధిక్యమును నెలకొల్పుకొనుటకు వీలుగానుండునట్లు స్టర్లింగునిలువలు ఉపయోగింపబడరాదు. మన యుద్ధానంతర పునర్నిర్మాణమునకు ఏదేశమునుండి సామగ్రి కావలసిన ఆ దేశపు నాణెములలోనికి స్టర్లింగును మార్చుటకు అవకాశముండవలెను; ఇట్లు మార్చుటకు తగిన సౌకర్యములను బ్రిటను కలుగజేయవలెను; ముఖ్యముగా అమెరికా, స్వీడన, కెనడా, స్విట్జర్లాం

దులనుండి దిగుమతులకు పూర్తిగా వీలుండవలెను. బ్రిటనులో దొరకు వస్తువులు బ్రిటనులోనే కొనవచ్చును. కాని అవి మన దేశములో తయారుచేసుకొనగల్గినగాని, లేక యిప్పుడే మన దేశములో తయారగుచున్నగాని కొనఁగూడదు. వీలైనంతవరకు యంత్రసామగ్రినే కొనవలెను. కొనుగోలుదారుల వస్తువులు చాల తక్కువగా కొనవలెను. వర్తమానకాలములో ఉపయోగింపని నిలువలను రెండుమూడేండ్లలో ఉపయోగించుటకు వీలుండవలెను. అవి ఎంత మొత్తము ఉండవలెనో, భారతప్రభుత్వ నిర్మాణకార్యక్రమమును బట్టి నిర్ణయించి, బ్రిటిషు ప్రభుత్వము ఆ మొత్తమునకు ఒప్పుకొనునట్లు చూడవలెను.

బ్రిటిషు ప్రభుత్వము యుద్ధకాలములో హిందూదేశములో కొన్ని ఫ్యాక్టరీలు మొదలైనవి కట్టుకొన్నది. అవి మనకు అవసరమైనచో కొనివేసుకొనవచ్చును. హిందూదేశములో బ్రిటిషువారికి చాల ఆస్తి కలదు. కంపెనీలలో వాటాలు, గవర్నమెంటు ఋణపత్రములు, ఎస్టేట్లు మున్నగునవి చాల కలవు. వానినన్నిటిని ఈ స్టర్లింగునిలువలతో కొనివేయరాదా అని చాలమంది ప్రశ్నింతురు. ఇది సహజముగా వివాదాంశము. బ్రిటిషువారికి ఈ దేశములో చాల వ్యాపారములలో పలుకుబడి కలదు. వీనివలన ఆ దేశస్థులకు పెద్దపెద్ద ఉద్యోగములు; వీటి ఆఫీసులకొరకు ఇంగ్లండులో చాల సిబ్బంది; బ్రిటీషు నౌకా, బ్యాంకింగు, భీమా కంపెనీలకు పని దొరకుచున్నది. భాగస్వాములకు పెద్దపెద్ద లాభములు దొరకుచున్నవి. ఇవన్నియు పోగొట్టుకొనుట వారికి ఇష్టములేదు. ద్రవ్యోల్బణమువలన ఈ వాటాల ధరలు చాల పెరిగినవి. కాబట్టి ఇప్పుడు కొనివేయుటవలన భారతదేశమునకు చాలనష్టము కలుగును. కాబట్టి ప్రస్తుతము వీని అజమాయిషీలో పెట్టుటకు చట్టమును చేసి, తరువాత కొనివేసినచో నష్టముండదు. కేంద్రమున ప్రజాప్రభుత్వము పనిచేయుచున్నది గాబట్టి విదేశ పెట్టుబడిదారులకు మునుపటికంటె పలుకుబడి యుండదు. అదియుగాక, మన దేశమున ఇంకను ఆర్థికాభివృద్ధి చాల జరుగవలసియున్నది. కాబట్టి యిప్పుడున్నవానిని కొనివేయుటకన్న ఇంకను ఎక్కువ పరిశ్రమలు స్థాపింపజూచుట మంచిది. ఇక ఏగత్యంతరము లేక, స్టర్లింగు నిలువలను వదలివేసుకొనవచ్చు పరిస్థితులలో తప్ప ఈ విధముగా స్టర్లింగునిలువలను ఉపయోగింపరాదు.

చలామణిలో నున్న నోట్లకు శాశ్వతనిధిగా నుంచినది, వర్తమానకాలములో ఉపయోగించుకొనుటకు వీలిచ్చినది గాక మిగిలినది ఒక నిధిలో చేర్చివేయవలసివచ్చును. ఆ నిధినుండి సంవత్సరమునకు ఇంత చొప్పున వాడుకొనవచ్చును. ఉదాహరణకు : ౧౯౪౭ సంవత్సరములో జరిగిన పరిష్కారముప్రకారము ౬౦౦ కోట్ల రూపాయల స్టర్లింగు నిలువలు నిధిలో చేర్చబడిన వనుకొనుడు. దీనిని ఏ ౧౯౪౮ లోనో మొదలిడి, సంవత్సరమునకు ౧౨ కోట్ల రూపాయలచొప్పున (౨%) ౫౦ ఏండ్లలో తీర్చివేయవచ్చును. ఏటేటా మిగిలియున్న సొమ్ముపైన కొంత వడ్డీ యిచ్చుచుండుడు. ఈవడ్డీ తక్కువరేటులో నుండరాదు. బ్రిటనులో ఇటువంటి పత్రములపై ఎంత వడ్డీ యిచ్చుచున్నారో, యీ నిలువలపైన అంత వడ్డీని ఇవ్వవలెను. ప్రస్తుతము మన స్టర్లింగునిలువలన్నియు బ్రిటిషు ట్రెజరీబిల్లుల రూపములో నుండుటవలన ఏమాత్రము వడ్డీ గిట్టుటలేదు. ఇకముందు అట్లు ట్రెజరీబిల్లులు కొనరాదు. అసలు సొమ్ము ఎన్ని తక్కువవాయిదాలలో ఇచ్చిన అంత మంచిది. ౨౫ నుండి ౫౦ సంవత్సరవాయిదాలలో తీర్చివేసిన ధనమంతయు అట్లు ప్రతిసంవత్సరము మనకు చెల్లింపబడు అసలు, వడ్డీ మొత్తములు ఏ విదేశనాణెములలోనికైనా మార్చుకొనుటకు వీలుండవలెను. అంతేగాని ఆ మొత్తమును బ్రిటనులోనే ఖర్చుపెట్టవలెనను నిబంధన యుండరాదు.

ఇప్పటికి నిలువయున్న స్టర్లింగునుండి ఇకముందు దైనందిన వర్తకవ్యాపారములలో వచ్చు స్టర్లింగును వేరుచేసి యుంచవలెను. ఆ మొత్తమును యుద్ధకాలపు నిలువలతో కలిపివేయరాదు. ఆ మొత్తమును ఏ విదేశనాణెములలోనికైనా వెంటనే మార్చుకొనుటకు వీలుండవలెను. లేకపోయినచో ఇంకను బ్రిటనుకు వస్తువుల నమ్ముట మనకు చాల నష్టదాయకము.

బ్రిటను, భారతదేశముల రాజకీయసంబంధములలో గొప్పమార్పులు రానున్న ఈ కాలములో ఆర్థిక సమస్యలవలన కొన్ని చిక్కులు కల్పించి భావిసంబంధములలో వైమనస్యములకు తావు కలుగచేయకుండ, స్టర్లింగునిలువల సమస్యను సహృద్భావముతో పరిష్కారము చేసుకొనుట రెండుదేశములకును శ్రేయస్కరము.

# జ్యోతిర్వేదము - సృష్టిక్రమము

## బ్రహ్మసరస్వతుల వృత్తాంతము

•

— శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావు —

"ఓ నేతివాసీకం కొండు జనించు నుండు నడుసక్! నీక్కడంబు భాషింపుడూ" అని సృష్టివిధానము తెలిసికోగోరి నారదుడు 'సృష్టికర్త'యగు బ్రహ్మను ప్రశ్నించినాడు. "కుత ఆజాతా! కుత ఆబభూవ? కుత ఇయం విసృష్టిః" అని మహాఋషులు వేదములోకూడ ఈ ప్రశ్నవే వేసికొని యున్నారు. భాగవతపురాణములో విదురుడు మైత్రేయుని, పరీక్షిన్మహారాజు శ్రీ శుకునికూడ ఈ ప్రశ్న నడిగియున్నారు. వీరే కాదు—కేవల కుక్షింభరత్వమే ప్రధానము చేసికొని, జంతుమాత్రజీవనము గడుపక, పరమార్థచింతజేయు స్వభావికమైనను, వివేకశీలము గల ఏ వ్యక్తికైనను ఇదంతయు నెట్లు పుట్టుకొనివచ్చెనో తెలిసికొందమను జ్ఞానతృష్ణ, విజ్ఞానతృష్ణ కలుగుట సహజము. "మన మెవ్వరము! ఈ లోక మేమి! చుట్టు ప్రక్కల కనబడు ఏమ స్తవస్తుజాలముతో మనము ఇక్కడికెట్లు రాగలిగినాము! మన ముందుగతి యేమి! అని యోచించుటకు తగిన తెలివితేటలు గల ఏ వ్యక్తికైనను ఈ సృష్టిప్రకారప్రశ్న ఎదుర్కొనుచున్నది. దీనికి శాస్త్రీయమైన ప్రత్యుత్తరము బయటజూచుట మిక్కిలి అవసరము.

ఇప్పుడీ లోకములో అన్నివిధములచేత బలవంతులై అధికారము నెరపగలిగినవార మనుకొను వారు కైస్తవులు. వారికి పరమప్రమాణము బైబిల్ గ్రంథము. ఆ గ్రంథముయొక్క తొలి ప్రకరణాంథమునందే 'Genesis'లో సృష్టిక్రమము ఒకవిధముగా తెలుపబడినది.

### సృష్టి విధానమునుగూర్చి బైబిల్ సిద్ధాంతము

ఇప్పటికి ఆరువేల సంవత్సరములక్రిందట ఒకానొక సోమవారము మధ్యాహ్నము దేవునికి సృష్టిచేయు సంకల్పము కలిగెను. ప్రారంభమునందు భూమ్యాకాశములను దేవుడు సృజించెను. ఆ భూమి నిరాకారమై శూన్యమై అంధకారబంధురమై యుండెను. దేవుని చైతన్యము ఆ భూమిమీద నుండిన జలోపరిభాగముపై సంచారము చేయుచుండెను. చీకట్లు విరియించుటకు దేవుడు వెలుగును రమ్మనెను. వెంటనే వెలుగు వచ్చెను. వెలుగే పగలు, చీకటే రాత్రి. ఈ దివారాత్రివిభాగముతో తొలిరోజు గడిచినది. రెండవరోజు మంగళవారము. ఆనాడు జలభాగమున కెగువను దిగువను అంతరిక్షము చేర్పరచి, భగవంతుడు జలములపై అంతరిక్షమును ఆకాశమనెను. మూడవరోజు బుధవారము. ఆవేళ దేవుడు దిగువజలమంతను ఒకచోట చేర్చి జలమయమును సముద్ర మనెను; పొడినేలను భూమి యనెను. భూమిమీద పచ్చని గడ్డిగాదము, ఓషధులు, ఫలప్రదములైన చెట్లు చేమలు మొదలగు వానిని సృజించుటతో మూడవరోజు ముగిసినది. నాల్గవరోజు లక్ష్మీవారము. ఆ రోజున సూర్యచంద్రనక్షత్రాదులతో ఖగోళము నిర్మింపబడెను. పగలు సూర్యుడు, రాత్రి నక్షత్రములతో చంద్రుడు ప్రకాశించునట్లేర్పాటుచేసెను. ఐదవరోజు శుక్రవారము. ఆదినమున భగవంతుడు జలాశయములలో చేపలు, తిమితిమింగిలాదులను, భూమిమీద పక్షులను సృజించెను. ఆరవది స్థిరవారము. పశువులు, సరీసృపములు, జంతుజాలము, అన్నిటికంటె ముఖ్యము, సృష్టికి తిలకట్టు మా

వుకు ఆ వేళ సృష్టింపలేరి. మానవుడు దేవుని ప్రతిబింబము. స్త్రీ పురుష మిథునము. పశు పక్ష్యాదులతో కూడిన యీ భూలోక సామ్రాజ్యమును భగవంతుడు మానవునికిచ్చెను. ఆరురోజులు పూర్తియైనవి. ఏడవ నాడు ఆదివారము. "అప్ప! అమ్మయ్య! ఎంత కష్టపడి ఈ సృష్టి పూర్తిచేసినాను. ఒక దినమైన విశ్రాంతి గైకొందును గాక" అని భగవంతుడు ఆ వేళ పని మానెను. అప్పటినుండి ఆదివారము క్రైస్తవులకును, వారి అధికారమునకు ఇతరుల లోబడిన మనకును సెలవు దినమైనది. ఇది బైబిల్ సృష్టికథనము.

## నవీన విజ్ఞాన సిద్ధాంతము

పైన తెలుపబడిన బైబిల్ సృష్టిక్రమమును ఈనాటి వైజ్ఞానికులెవరును ఎంతమాత్రము వామోదించలేదు. మనము నివసించుచున్న యీ "భూగోళమేర్పడి సుమారు రెండువందల కోట్ల సంవత్సరములైనది కాని తక్కువకాదు" అని అనేక ప్రమాణములవల్ల వారు ఋజువుచేసినారు. ఈ నాటి వైజ్ఞానికులలో పేరెన్నికగన్న ఉద్దండులైన సర్ జేమ్సు జీన్సు దొరగారు సృష్టిక్రమమును ఈ దిగువపంక్తిలో స్పష్టముగా వివరము చేసినారు:—

Chaos, Nebula, Stars, Binary stars, Sub-systems.

ఇందు మొదటిది Chaos - చిందరవందర, చీకాకుస్థితి. దీనిని మన పూర్వులు ప్రళయమన్నారు. ప్రళయము ఒక కల్పపు కాలక్రమమునకు అంత్యదశ; క్రొత్త కల్పపు క్రొత్తసృష్టికి ఆరంభదశ.

## చుక్కమబ్బులు (NEBULAE)

కాబట్టి క్రొత్త సృష్టికి ప్రళయమునుండియే ప్రారంభదశ కలుగుచున్నది. ప్రళయముతరువాతి స్థితిని పడమటివారు నెబ్యులా (Nebula) అనుచున్నారు. ఈ మాటకు 'తెల్లమబ్బువంటి దృశ్యము' అని అర్థము. హేమంతఋతువునందలి మార్గశిరపుష్యమాసములలో ఒక్కొక్కప్పుడు భూమ్యాకాశములను పొగమంచు దట్టముగా ఆవరించుట మన ప్రాంతములలో కూడ చూచుచుందుము. మంచు మిక్కిలి సాంద్రముగా నున్నప్పుడు తెల్లమంచు ఎల్లచోట వ్యాపించి, తెరలువేసినట్లు దగ్గరనున్న వారికికూడ ఒకరి ముఖము లొకరికి కానరాకుండపోవును. ఈ పొగమంచును పోలిన ధవళ దృశ్యములాకాశమున నెన్నోచోట్ల కానవచ్చుచున్నవి. పాలపుంతవంటిదని మనవారు వర్ణించిన [illegible] మబ్బు చాలమంది చూచియుందురు. కొన్నిమబ్బులు చక్రాకృతి కలవి. వీటిని ఇంగ్లీషులో Spiral Nebulae అందురు. మరికొన్ని మబ్బులు జంతువులను, పక్షులను, ఇతర వస్తువులను పోలిన యాకారములతో ఖగోళమున కానవచ్చుచున్నవి. ఎండ్రకాయ (Crab-Nebula), సాలీడు (Spider-Nebula), గుడ్లగూబ (Owl-Nebula), ముద్గరము (Dumb-bell) -ఇటువంటి నానావిధములైన రూపములు, ఆకారములు గల తెల్లమబ్బులు ఖగోళమునందు ఇరువదిలక్షలు గుర్తింపబడినవి.

## బ్రహ్మదేవుని ఆసనమైన పద్మ మొక చుక్కమబ్బు

ఈమబ్బులన్నిటిలో మన విప్పుడు ముఖ్యముగా తెలిసికొని చర్చింపవలసినది ఉత్తరాకాశమున వీణామండల (Lyra-group) మనబడు చుక్కల గుంపుయొక్క అడుగుభాగమున కానవచ్చు గుండ్రని చుక్కమబ్బు. ఉంగరమువంటి యాకారముకలదగుటచే దీని Ring-Nebula in Lyra అని పడమటి పండితులు తెలుపుచుందురు. కాని మన శ్రీనాథకవిసార్వభౌముడు ఆంధ్రనైషధమున వర్ణించినట్లు ఈరూపము కేవల చక్రాకృతి గలది కాదు. అది "సాంద్రపుమిగిలిన సౌందర్యపు పువ్వు". తూర్పు పడమరలకు సాగిపోయిన పద్మమువలె ఆ దృశ్యమెంతో మనోహరమై యొప్పుచున్నది. ఇట్టి పద్మముపై నాసీనుడయి సర్గప్రకటనచేయునే మన సృష్టికర్త - బ్రహ్మ పద్మాసనుడని మన పూర్వ గ్రంథములు చక్కగా వర్ణించుచున్నవి. 'నిండారవిరిసిన పుండరీక' మనదగు నీ చుక్కమబ్బును మన పూర్వు లెరుగుదురా? అసలిట్టి తెల్లమబ్బు లున్నవని వేదములు ఎరుగుదురా? అని పాఠకులు ప్రశ్నచేయవచ్చును. ఎరుగుదురు. బాగుగా ఎరుగుదురు. ఖగోళమున మసకమసకగా తోచు నీ తెలిమబ్బులను వారు

బాగుగా గుర్తించి, చక్కని మాటలతో స్ఫుటముగా వర్ణించినారు. (చూడుడు : ఋగ్వేదము X ౮౨-౭) “నీహారేణ ప్రావృతా” నీహారము. ఎంత చక్కనిమాట! కురియుచున్న మంచు. పొగమంచును పోలిన ఖగోళ దృశ్యము - తెలిమబ్బురూపము (Nebula) - ను నీహారప్రావృతమని వర్ణించుట ఎంత సమంజసము! ఆ సందర్భములో సంతకంటె మంచి శబ్దమును ఎవరు వాడగలరు? ఈ నీహార దృశ్యము అనేకరూపములతో కానవచ్చును. ఇట్టి దృశ్యమున కొకదానికి ఖగోళమున క్షేత్రరూపు ఏర్పరుచున్న వివరము ఋగ్వేదము III. ౩౮-౭ లో వర్ణింపబడినది. “అన్యదన్య దసుర్యం వసానాని మాయినోమమిరే రూపమస్మిన్.” వేదఋషులకు ఈ తెలిమబ్బులు ఖగోళమున గోచరించుట, అవి యనేకరూపములు గలిగియుండుటే కాక సృష్టిపరిణామక్రమములో ఈ మబ్బుల ప్రాముఖ్యము కూడ దివ్యముగా గుర్తింపబడి వైజ్ఞానిక దృష్టితో వర్ణింపబడినది. (చూ. ఋ. X ౮౨-౬) “అజస్య నాభా వధ్యేక మర్పితం, యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః”. విశ్వసృష్టిహేతువైన గర్భము అజుని నాభికమలమున నిలిచినది. విశ్వమునందుగల సమస్తభువనముల బీజములు నందున్నవి. ఈ వేదమంత్రములోని భావము ఆంధ్రభాగవతము II-౨౩౧ పద్యములో స్పష్టముగా వివరము చేయబడినది :—

“సీ. ఎవ్వని నాభీయం దెల్లలోకంబుల సం
స్థానకారణపంకజంబు వొడమె
అం దుదయించి సర్వాకృతయస్ఫూర్తి
దనరారుచుట్టె పితామహుండు
గడగి యెవ్వని యనుగ్రహమున నిఖిలభూ
తముల సృజించె నుత్కంఠతోడ”

పై వేదమంత్రములకును, భాగవతపద్యపాదములకును అర్థము తెలిసినట్లు కనబడినను అంతమాత్రముచేత సృష్టిపరిణామక్రమము సంగ్రహముగా నైనను పాఠకులకు స్పష్టము కాదు. ఆ విధానము మనము చక్కగా అవగాహనచేసికొనుటకు ఉపనిషత్పరికింప కొంత అవసరము. దానికై తోడుగా ‘భూగోళపు పుట్టు పూర్వోత్తరముల’నుగురించి చక్కని గ్రంథము వ్రాసిన మాక్సువెల్ దొరగారు వర్ణించిన పరిణామక్రమవర్ణనము కూడ మన మిచట గమనించుట యావశ్యకము. ఏమనగా, ప్రాచీనకాలపు వేదఋషులుగాని, నవీనవైజ్ఞానికులుగాని ఈ విశ్వమును భగవంతుడు ఆరువేల సంవత్సరములక్రిందట ఆరురోజులలో సృష్టించి వేసినాడని తలచుటలేదు. యుగములు, మహాయుగములు, కల్పములు, కోటానుకోటుల సంవత్సరముల కాలములో “ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః. అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో అన్నం, అన్నా ద్రేతః, రేతసః పురుషః” ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి నీరు, నీటినుండి భూమి, భూమినుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నము, అన్నమునుండి రేతస్సు, రేతస్సునుండి పురుషుడు. ఇది తైత్తిరీయోపనిషత్తులో నీయబడిన సృష్టిక్రమము. (చూ I. 3)

ఖగోళమునకు కేంద్రమనదగినదని ముఖ్యముగా చెప్పతగిన ఒకానొక ప్రదేశమునందు, ప్రశాంతము కాగానే ఆకాశమునుండి వాయువు జనించెను; వాయువునుండి అగ్ని పుట్టెను. ఆ తొలినాటి తెల్ల మబ్బులు అగ్నిసంపర్కముచే వేడెక్కి ప్రకృతిశక్తుల ప్రాబల్యముచే తమలో తాము గిరగిర తిరుగుచుండెను. ఈ వేడిపొగలందు గల వాయుపదార్థజాలములు తమకు తామే ప్రదక్షిణము చేసికొనుచు పరిభ్రమింపజొచ్చెను. ఈ మబ్బుల పరిమితి ఇంత అంత యని నిరూపింప సాధ్యము కాదు. ఈ వాయుపదార్థసంచయముయొక్క పైపొరలు కొన్ని చల్లచల్లగా నుండినను లోపల మహోష్ణమయములై అఖండశక్తితో లోలోన చుట్లు తిరుగుచు రౌద్రాకారము దాల్చి గర్జించుచు పరిభ్రమించుచుండును. పరిభ్రమణ మతిశయించుకొలది వేడిమి వృద్ధియగుచు రాగారాగా, లందలి వాయుపదార్థములు సాంద్రతరములగుచుండును. ఇట్లెన్నికోట్ల సంవత్సరములు గడచిపోవుచుండ తుదకు జ్వాలాముఖమై బహు తేజోవంతమైన నక్షత్రరూపము పొందును. తొలుత తెల తెల్లగా తోచిన మబ్బురూపమే కాలగతిచే నక్షత్ర రూపము దాల్చుచున్నది. ఆ హేతువుచేతనే యీ ఖగోళస్థములైన తెల్లమబ్బులను మనము చుక్కమబ్బు

లనుచుందుము. ఇట్లు నక్షత్రరూపమొందిన తొలిదశకు దృష్టాంతమే ఒక సూర్యుడు. మన భూగోళమునకును, మనకును వేడి, వెలుగు మొదలగునవి అందిచ్చి పోషించుచున్న మన సూర్యుడొక నక్షత్రము. ఆకాశమునందన్ని దిశలను నవరత్నములవలెనమున మిణుకుమిణుకుమని మెఱయు నక్షత్రములన్నియు లెక్కింప శక్యముగానన్ని సూర్యగోళములే. ఈ యంశమునే ఋగ్వేదము (X-౧౧౮-౩) "సప్తదిశో నానాసూర్యాః" అని స్పష్టముగా తెలుపుచున్నది. నక్షత్రములు కొన్ని శ్వేతోష్ణమయములు. మరికొన్ని అరుణోష్ణమయములు. ఉష్ణపరిమితినిబట్టి వాని వర్ణము తెలియనగుచుండును. ఈ నక్షత్రములు జ్వాలాజాజ్వల్యమానములయి మహాపరిమాణముతో గొప్ప ప్రచండసూర్యులు కాని సామాన్యపు చుక్కబొట్లు కావు.

## జంటచుక్కలు (Double Stars)

చుక్కమబ్బునుండి ఒక చుక్క వెలవచ్చును; లేదా మరికొన్ని చుక్కలు వెలవచ్చును. ఒకచుక్క విరిగి రెండుచుక్కలు కావచ్చును. ఇట్టి చుక్కల జతలు దేని కదే వేరువేరుగా పోవు. అవి రెండును ఒకదానిచుట్టు నొకటి తిరుగుచుండును. ఈ పరస్పర పరిభ్రమణములో గల విశేషమును గమనించుట అత్యద్భుతకరము.

చంద్రుడు భూమిచుట్టు తిరుగునుగాని భూమి చంద్రునిచుట్టు తిరుగదు. కాబట్టి చంద్రుడు భూమికి ఉపగ్రహము (Satellite) అందుము. అదేవిధముగా బుధుడు, శుక్రుడు, భూమి, అంగారకుడు, గ్రహకణములు (Asteroids), గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అనబడు గ్రహములు సూర్యునిచుట్టు తిరుగుచున్నవి; కాని వీనిచుట్టు సూర్యుడు తిరుగడు. ఇవన్నియు సూర్యునిచుట్టు తిరుగు గ్రహము లనబడుచున్నవి. జంటచుక్కల గమన మిట్టిది కాదు. జంటలో ప్రతిచుక్కయు రెండవచుక్కచుట్టు ప్రదక్షిణము చేయుచునేయుండును. వీణామండలములో విశ్వప్రఖ్యాతములైన చుక్కల సముదాయ మున్నది. అందులో మిక్కిలి తేజోవంతమైనదానిని పడమటివారు వేగా (Vega) నక్షత్ర మందురు; దానినే మనవారు 'అభిజిత్' నక్షత్ర మందురు. దానికి వామభాగమందు మరొక చిన్నినక్షత్ర మున్నది. దానికి ఎప్సిలాన్ లైరా (Epsilon Lyra)—అనగా గ్రీకు అక్షరములలో ఎప్సిలన్ అక్షరసంజ్ఞతో సూచించు చుక్క అని పేరు. అది సాధారణముగా ఒక చుక్కవలె కనబడును. కాని జాగ్రతగా పరీక్షించిన పక్షమున అందు రెండుచుక్క లున్నవని తెలియగలదు. కొంచెము శక్తిగల ఏ టెలిస్కోపులో చూచినను ఆ జంటలో నొక్కొక్కటి మరల చుక్కల జత యని తేలగలదు. కాబట్టి ఎప్సిలాన్ చుక్క (Double-double star) చుక్కల జతల జత. అందులో మొత్తము నాలుగు చుక్క లున్నవి. అందొక జతలోని రెండుచుక్కలు ఒకదానిచుట్టు నొకటి తిరుగుచుండును. రెండవ జతలోని రెండుచుక్కలుగూడ ఒకదానిచుట్టు నొకటి తిరుగుచుండును. అంతేకాదు; మరొక గొప్ప విశేషముకూడ కలదు. ఇందులోని ప్రతిజతయు రెండవ జతచుట్టునుకూడ తిరుగుచుండును. చుక్కచుట్టు చుక్క తిరుగుటేకాదు. జతచుట్టునుకూడ జత తిరుగుట అద్భుతవిశేషము. కావుననే ఈ నాలుగు చుక్కల గమనవిశేషములో గొప్ప విశిష్టత కలదు. ఈ నాలుగు చుక్కల దిగువభాగమందు "పాడవుమిగిలిన పొందమ్మిపువ్వు"వంటి తెలిమబ్బు ఉన్నది. ఇవన్నియు 'వీణామండల' మనబడు చుక్కలగుంపులోనివి. వీటికి తూర్పుగా నున్న చుక్కలగుంపు (Cygous) హంస రాజహంస అను పేర నొప్పుచున్నది. హంసచుక్కల ప్రశంస ఋగ్వేదములో పెక్కుచోట్ల కలదు.

మన దేవతలలో సృష్టికర్తయైన బ్రహ్మ చతుర్ముఖుడు. అతడు పద్మాసనుడు. అతని ముఖమందున్న సరస్వతి వీణాపాణి సరస్వతి. బ్రహ్మసరస్వతీదంపతులకు వాహనము హంస. ఈ విషయములు భారతఖండస్థులైన స్వదేశీయులకందరకు చిన్ననాటినుండి తెలిసిన సుప్రసిద్ధవిషయములు. పైని చర్చించిన ఖగోళవిశేషములనుబట్టియే బ్రహ్మకు నాలుగు ముఖము లున్నవనియు, అతడు కమలాసనుడనియు, అతని ముఖమందు వీణాపాణి సరస్వతి కలదనియు, వారి

వాహనము హంసయని యీ వేదపురాణవాఙ్మయము ఘోషించుచున్నది.

## బ్రహ్మదేవుని నాలుగుముఖములు

ఖగోళశాస్త్రము నెఱుఁగబట్టియే మన పూర్వ ఋషులు నక్షత్రరూపులైన ఆయా దేవతల రూపవిశేషములు, వారివారి వాహనములు, ఆయుధములు, పరివారము, వారి లోకములు, వారొనరించిన ఘనకార్యములు, వారు సంహరించిన రాక్షసులు, వారిని ముఖ్యముగా పూజించి కొనియాడవలసిన సందర్భములు—ఇవన్నియు నిర్ణయించి గ్రంథస్థము చేసిరి. ఈ యంశములను గమనింపని విమర్శకులు కొందరు ఈ పురాణకథలు, దేవతావర్ణనలు మొదలగునవన్నియు నసంబద్ధములని హేళన చేయుట పరిపాటియైనది. ఉదాహరణార్థము కీర్తిశేషులైన రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారి ప్రహసనముల సంపుటము ౮౧౧ పుటలో గల 'నారదసంవాదము' ప్రహసనము గమనింతము.

"ప్రవేశము: నృసింహశాస్త్రులవారు, పరబ్రహ్మ సోమయాజులుగారు, నారదులవారు, విశ్వస్థూలభాచార్యులవారు......

విశ్వ—స్వామీ, తమరు బ్రహ్మమానసికపుత్రులు గదా? బ్రహ్మకు నాలుగుముఖాలు ఏ ప్రకారంగా వుంటవో ఆనతి ఇవ్వరా?

నార—అవి నాలుగూ ఒక దానితరవాత ఒకటి వరసగా వుంటవి. కాదుకాదు, నాలుగూ నాలుగు వైపులా వుంటవి. అలా కాదు, మూడు ముందు వైపునా, ఒకటి వెనకవైపునా ఉంటుంది. మరచి పోయినాను—జ్ఞాపకం చేసుకోనీ—రెండు ఒకవైపునా, రెండు రెండోవైపునా వుంటవి. ఈ చెప్పిన విధాలల్లో యేలాగ వుంటుందో నిశ్చయంగా చెప్ప లేను. ఈ మాటు బ్రహ్మ నడిగి వచ్చి చెబుతాను.

పర—స్వామీ, దివ్యదృష్టిచేత చూచి చెప్ప రాదా?

నార—అంతర్దృష్టిచేత చూచినారము. ఒక తల పైకీ, ఒక తల కిందికీ, ఒక తల ముందుకూ, ఒక తల వెనకకూ, ఒక తల మూలకూ, వెరసి నాలుగు తలలూ నాలుగు నాలుగులు అష్టదిక్కులకూ తిరిగి ఉంటవి."

వీరేశలింగముగారిని గాని, వారికి తోచిన తర్కములను గాని, వారి ప్రహసనములో నారదపాత్ర చేత పలికించిన హేళనవాక్యములనుగాని కని విని ఎఱుఁగని జ్యోతిశ్శాస్త్రవేత్త జి. యఫ్. చేంబర్స్ దొరగారు తాము రచించిన 'చుక్కలకథ' (Story of the Stars) అను గ్రంథములో ౭౧ పుటలో వ్రాసిన విషయములు—ఈ నాల్గు చుక్కల గమనవిశేషము లీ సందర్భమున చదువతగియున్నవి:—

"There seems every reason to suppose not only that the stars of each pair constitute a binary system, each revolving round the other, but that each pair taken together revolves round the other pair thus constituting a double binary or a system of mutual association of great complexity."

కాబట్టి ఏక్షణమునందైనను బ్రహ్మ నాలుగుముఖము లని చెప్పతగిన నాలుగుచుక్కలలో ఏ ఒక్క చుక్క స్థానమైనను తక్కిన మూడు చుక్కలు నిలిచిన స్థానము లనుబట్టి నిర్ణయింపతగియుండును. ఈ విషయము హేళనకు, అపహాస్యమునకు భాజనము కావలసినది కాదు.

## బ్రహ్మలోకపురొద (The Cosmic Hiss)

"నాలుగుమోములన్ నిగమ
నాదము లుప్పతిలన్ ప్రశంసవా
రూలహరిన్ జనించు 'రొద'
తోడి గుహావళి నొప్పు మేరువుం
బోలె పయోజపీఠ ముని
ముఖ్యులు గొల్వగ వాణి గూడి పే
రోలగమున్న ధాత విధ
వోజ్జ్వలం జేయుత కృష్ణరాయనిన్" (మను)

"మేరుపర్వతపు గుహాలలో వాయువు ప్రవేశించి వెడలివస్తూవుంటే ఒకానొక రొద—విచిత్రమైన ఝూం

కారస్వని వినవస్తుంది. బ్రహ్మదేవుకు నాలుగుముఖము లనూ నాలుగు వేదములు పఠిస్తూఉంటే, పైని వ్రాసిన ఝూంకారంవంటిదే ఒక మహానినాదం వినవస్తుంది. బ్రహ్మదేవుడు భార్య అగు సరస్వతీదేవితోకూడా పద్మాసనాసీనుడై మహోల్లాసంతో సేవిస్తూఉంటెగా, ఇటువంటి శబ్దసందేశాలతో కురుపర్వగంలాగే ప్రసన్నుడై కృష్ణదేవగాయకులవారిని ఉభయోజ్జ్వలన్ని చేయునుగాక అని ఆంధ్రకవితాపితామహుకు అల్లసాని పెద్దన్నగారు ఆశీర్వదిస్తున్నారు". అది అలాగున ఉండనిండు.

నభోరంగమంతటికీ కన్నువంటి దని వేదఋషులనః*, ఈనాటి వైజ్ఞానికులనకూడ మిక్కిలి ప్రాముఖ్యమిచ్చిన "విష్ణుపద"మున్నది. ఈ విష్ణుపదసమీపమునందే ప్రక్కగా ఉత్తరదిక్కునందు ఈ బ్రహ్మ, సరస్వతీ నక్షత్రములతో కూడుకొని వీణామండలము (Lyra) చుక్కలగుంపున్నదని మనము బాగుగా జ్ఞప్తి యుంచుకోవలెను. ఏమనగా, ఈమండలమే విశ్వమంతకును శబ్దప్రసారకము చేయు స్థానము (Celestial Broad. cas ing st tion) అని యీ దినపు పరిశోధనలవలన స్థిరపడినది.

౧౯౩౨ సంవత్సరములో ఒక విశేషము జరిగినది. Bell Telephone Laboratories అనే పరిశోధనాలయంలో రేడియో ఇంజనీరుగా కార్ల్ జే. జాన్స్కీ (Karl. J Jaosky) అనే ప్రముఖుడు కొంతకాలమునుండి పనిచేయుచుండెను. రేడియో వార్తలను పరిగ్రహించు యంత్రములో Receiving Set లో అతనికొక నాడొక రొదమిశ్రితమైన ఝూంకార శబ్దము వినవచ్చెను. అది విడువక ప్రతిదినము వినవచ్చెను. ఈ రొద ఏమైయుండును! ఈ ఝూంకారము ఎక్కడనుండి వచ్చుచున్నది! అని యతడు తదేకదీక్షతో బహుకాలము పరిశోధన సాగించెను. ఈ రొదకు, సూర్యగమనమునకు సంబంధమున్నట్లు తోచలేదు. అది సూర్యోదయముతో రాలేదు; సూర్యాస్తమానముతో పోనూలేదు. సూర్యకుటుంబముతో సంబంధించిన రొద కాదిది యని అతనికి పరిశోధనవల్ల స్పష్టమైనది. అయితే మరి యీ ఝూంకార మెక్కడిదని అతడు విడువక బహుకాలము పరిశోధన చేయుచుండెను.

అమెరికా ఖండమునందలి హార్వర్డు యూనివర్సిటీ వారి నక్షత్రశాలలో ఖగోళపరిశోధన చేయుచున్న జగత్ప్రసిద్ధుడు డాక్టరు షాప్లీ (Doctor Shapley) కృషివలనను, పైని వ్రాసిన రేడియో ఇంజనీరు జాన్స్కీ ద్వార పరిశోధనల ఫలితముగాను మహత్తరమగు మొకటి లోకమునకు తెలియవచ్చినది. అది యేమనగా: విద్యుత్తరంగాలమూలముగా విశ్వమంతకును శబ్దప్రసారము చేయుచున్న స్థానమొకటి వీణామండలపు చుక్కల గుంపులో నున్నది. అదే Celestial Broadcasting Station. ఈ స్థానమునే మనవారు వాణీహిరణ్యగర్భులుండు బ్రహ్మలోక మని చక్కగా తెలిపియున్నారు. విష్ణుని నాభికమలసంజాతుడు బ్రహ్మ. నక్షత్రరూపులైన బ్రహ్మవిష్ణువులు—ఇంద్రుడు కొందరులు నక్షత్రవీథిలో ఉత్తరాకాశమున ఒకరిప్రక్కనే ఒకరున్నారు. కావున ఏమి తేలుచున్న దనగా:— వేదములోని పురాణప్రసిద్ధులైన దేవతాగణములకు ఆ పౌరాణిక దేవత్వమే కాక, నవీన వైజ్ఞానిక పరిశోధనల ఫలితముగా విజ్ఞానదృష్టితో చూచినను, వారికి వైజ్ఞానిక ప్రాముఖ్యముకూడ నిరూపితమై స్థిరపడుచున్నది. ఈ దేవతాగాథలు కేవల భావనాకల్పితములు కావు. విజ్ఞానదృష్ట్యా అవి యథార్థములని బుజువగుచున్నది. ఆంధ్రకవితాపితామహుడు అల్లసాని పెద్దన్న, వైజ్ఞానిక పరిశోధకులగు డాక్టర్లు జాన్స్కీ, షాప్లీ గార్లవలె బ్రహ్మలోకము విద్యుత్తరంగాలసాయముతో శబ్దప్రసారము చేయగల Celestial Broadcasting Station అని ఋజువుచేయలేకపోయినను, నిత్యమును సరస్వతి నారాధించి ఆమెకటాక్షమును బడసి "శ్రావణాభ్యాసమహిత విశ్రుతవిహారి"యైన మహాకవియగుట చేత ఈ "రొద"ను చక్కగా భావించుకొని వర్ణింపగలుగుట విశేషము. "రవిగాననిచో కవి గాంచునే కదా!"

## సూర్యకుటుంబపు గమ్యస్థానము

చంద్రుడు భూమిచుట్టు తిరుగుచున్నాడు; భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నది. ఒక భూగోళమే

---

* ఋగ్వేదము I ౨౨-౨౦ : "తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షు రాతతమ్"

కాదు. బుధ, శుక్ర, కుజ, గురు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో అనబడు గ్రహములను, కుజగురు గ్రహములమధ్య నేవాడో విభిన్నమైన గ్రహశకలములు (Asteroids), ఎన్నో తోకచుక్కలు, ఉల్కాగణములు—ఇవన్నియు సూర్యునిచుట్టు తిరిగివచ్చుచున్నవి. సూర్యగోళ మీ గ్రహోపగ్రహముల మధ్య కదలక సుస్థిరముగా నున్నదా? లేక కదలుచున్నదా? కదలిన పక్షమున, ఎటు కదలుచున్నది? ఎక్కడకు పోవుచున్నది? ఏ వేగముతో పోవుచున్నది? అను ప్రశ్నలు వైజ్ఞానిక పరిశోధకులను గట్టిగా ఎదుర్కొన్నవి. వారు బహుకాలము బహువిధముల పరిశోధించి ఈ ప్రశ్నలకు సదుత్తరము లిచ్చినారు. అవి మన వేదవాక్కులను చక్కగా ధ్రువపఱుచుట ముదావహము.

నేల పాతిన రాటవలెను, గోడకు కొట్టిన మేకువలెను కదలక, సూర్యగోళము స్థిరముగా నుండలేదు. సూర్యుడు సకుటుంబముగా ఉత్తరాకాశమున నేటి శ్రవణమువలె మెఱయు అభిజిన్నక్షత్రము పాశ్చాత్యుల Vega అను చుక్క సమీపమునకు ఉత్తరముగా పోవుచున్నాడు. క్షణమునకు పండ్రెండు మైళ్ళ చొప్పున పోవుచున్నాడని కొందరును, పదునైదు మైళ్ళ చొప్పున నని కొందరును తెలుపుచున్నారు. తక్కువలో తక్కువ క్షణమునకు పండ్రెండు మైళ్ళ చొప్పున పోవుచున్నట్లే నిశ్చయింతము. ఒకక్షణము (Second) లో పండ్రెండుమైళ్ళు. ఒక నిమిషములో అంత కరువదిరెట్లు—౧౨ × ౬౦ : ౭౨౦ మైళ్ళు; ఒక గంటలో ఇంత కరువదిరెట్లు—౭౨౦ × ౬౦. అనగా ౪౩౨౦౦ మైళ్లు. ఒకదినములో ఈ యాఖరిసంఖ్యకు ౨౪ రెట్లు : ౨౪ × ౪౩౨౦౦ = ౧౦,౩౬,౮౦౦ (పదిలక్షల ముప్పదియాఱువేల ఎనిమిదివందల) మైళ్లు. కాబట్టి ఒక్కొక్కదినమునకు పదిలక్షల మైళ్లకు తక్కువకాని త్వరతో, మన సూర్యునితోగూడ మనము ఉత్తరాకాశమున నక్షత్రస్వరూపుడైన అనంతపద్మనాభమూర్తియొక్క నాభికమలసంజాతుడు, సమాసీనుడు నైన బ్రహ్మనుగూర్చి పోవుచున్నాము. రైలు ప్రయాణము, పడవ ప్రయాణము, విమాన ప్రయాణములవలెనే ఈ ప్రయాణముకూడ యథార్థమైనది.

"యోఽసౌ పర్యగతో విష్ణుః" అను శ్రుతివాక్యము మతదృష్టిమాత్రములోనేకాక నేటి వైజ్ఞానికదృష్టిలో కూడ గొప్ప సత్యమని పరిశోధనలు ఋజువుచేయుచున్నవి. ౧౭౮౩ సంవత్సరములో సర్ విలియమ్ హెర్షెల్ దొరగారు పాశ్చాత్యులలో మొట్టమొదట మన సూర్యుడు సకుటుంబముగా ఉత్తరదిశాముఖుడై విష్ణుపద మనబడు హరికులేశ (Hercules) స్థానమును గూర్చి క్షణమునకు పండ్రెండుమైళ్లు పోవుచున్నాడని ప్రవచింపగలిగెను. మరి నూరేండ్లకు సైమన్ న్యూకొంబు అను సుప్రసిద్ధ అమెరికాజ్యోతిశ్శాస్త్రవేత్త కొద్దిపాటి సవరణతో హెర్షెల్ సిద్ధాంతమును బలపరిచినాడు. ఇటీవలి వైజ్ఞానికు లీయంశమును ఇంకను ధ్రువపరుచుచున్నారు. ఇందువలన మనకు ఉత్తరదిక్ప్రాముఖ్యము బాగుగా వ్యక్తమగుచున్నది.

## ఉత్తరదిశా ప్రాముఖ్యము

బ్రహ్మలోకసహితముగా విష్ణుని పరమపదము ఉత్తరదిశనున్నది. మన సూర్యుడు దక్షిణమునుండి ఉత్తరమునకు పోవుచున్నాడు. ఈ యుత్తరయానము వలన దక్షిణము గతించిపోయినదానిలో చేరుచున్నది. అనగా గతమునకు దక్షిణదిశతో సంబంధ మేర్పడుచున్నది. గతించినవారు పితృదేవతలు. వారల రాజు యమధర్మరాజు. కనుకనే యముడు దక్షిణదిక్కున కధిపతియైనాడు. యమునికి దక్షిణాధిపత్యము స్థిరపరచిన నాటినుండి మన పూర్వులు సూర్యుని ఉత్తరదిశాగమనమును పూర్తిగా నెఱిగియుండిరి. బ్రహ్మాదిదేవతల కాశ్రయమైన ఉత్తరదిక్కు మిక్కిలి పవిత్రమైనది. బ్రాహ్మణులు సంధ్యావందనము చేయునపుడు తూర్పునకో, ఉత్తరమునకో తిరుగుదురు. కర్మసాక్షియైన సూర్యు డుదయించునది తూర్పుదిక్కు. సూర్యుడు సకుటుంబముగా గమ్యస్థానము చేరునది ఉత్తరము. సూర్యుడు ఉత్తరాయణగతుడైన కాలము పుణ్యకాలము. ఏ యేరైనను, ఏ నదియైనను ఉత్తరదిశగా ప్రవహించు ప్రదేశము ఉత్తరవాహిని యని మిక్కిలి పవిత్రభావముతో పూజింపబడును. సప్తమహాఋషులు కూడ ఉత్తరమందున్నారు. ఆ ఋషుల స్థానమునకు

ఊర్ధ్వోత్తరముగా విష్ణుదేవుని పరమపద మున్నది. తపశ్శాలి, పవిత్రుడు నైన ధ్రువుడు ఉత్తరమందున్నాడు. "మేధియందు పరిభ్రామ్యమాణగోచక్రము" వలె సప్తఋషులతో ఖగోళమంతయు ధ్రువునిచుట్టు తిరుగుచున్నట్లు కనబడును. భస్మాసురుని గూర్చి యొక మాట. తన చేయి ఎవని తలమీద పెట్టిన వానితల తత్క్షణము పేలిపోవలెనని భస్మాసురుడు ఈశ్వరునివలన వరము పొందినవెంటనే, ఆ వరప్రభావము దాఖలా చూడగోరి ఆ రక్కసుడు శివుని తలపైనే తన చెయ్యి పెట్టబోయెను. శివు డాత్మరక్షార్థము ఉత్తరముగా విష్ణుస్థానమునుగూర్చి పరువులెత్తెనని భాగవతమునందు చెప్పబడినది. ప్రళయకాలమునందు మార్కండేయుడు ఉత్తరముగా పోయిపోయి వటపత్రశాయి యగు విష్ణుమూర్తిని సందర్శించెను.

## బ్రహ్మ, సరస్వతీ దంపతులు: శరత్కాల ప్రాముఖ్యము

సంవత్సరాత్మకమైన కాలచక్రములో ఆశ్వయుజ కార్తికమాసములు శరదృతు వనబడుచున్నవి. అప్పటికి వర్షకాలము పూర్తి యగును. భూగోళవాతావరణము విశేషముగా కంటికి కానరాని నీటియావిరితో కూడుకొనియుండును. తక్కిన ఋతువులలోకంటె శరదృతువునందు చంద్రకాంతి అతిశయించును; వెన్నెల వెలుగు ఎక్కువతేజస్సుతో కూడుకొనియుండును. ద్యావాపృథివీదంపతుల సమాగమ మప్పు డెంతో మనోజ్ఞమై మిగుల శోభాయమానముగా నుండును. తూర్పున ధవళధవళముగా పాలవెల్లి (Milky Way) నభోరంగమున బాగుగా గోచరమగును. విష్ణుపాదోద్భవమైన యాకాశగంగను పాలసముద్రమునుండి వేరుచేయుచు, ఖగోళమున నీరక్షీరవిభాగము గావించుచు, పొడవుమిగిలిన తెల్లతామరపువ్వువలెను, వరుణరాజున కిడిన చామరమువలెను రాజహంసచుక్క లెంతో రమ్యముగా ఉత్తరాకాశమున మెఱయుచు పోయిపోయిమని పించుచుండును. హంసచుక్కలకు పడమటిభాగమందు వెన్నముద్దవలె తెల్లనై తెల్లమతాబావలె ఉజ్జ్వలముగా వెలుగు అభిజిన్నక్షత్రము (Vega) ఎంతో దర్శనీయమై యుండును. ఆ ప్రక్కనే చతుర్ముఖుడు, బ్రహ్మ; బ్రహ్మముఖసీమను దీర్ఘవాణి, వీణాపాణి సరస్వతి—ఎంత చూచినను తనివితీరని ధవళదృశ్యము, లావణ్యముల కుప్ప. ఆతరుణమందు నభోరమాశోభను తిలకించుటకు మానవునకు రెండుకన్నులు చాలవు. కనుకనే శరత్కాలము, బ్రహ్మసరస్వతీదంపతుల వర్ణనము అను నీఘట్టములు వచ్చునపుడు వాని సావేశములో వర్ణింపక విడుచు కవులు సంస్కృతాంధ్రకవితాసమితిలో నుండబోరు. దండియను కవి "సర్వశుక్లా సరస్వతీ" అని వర్ణించినాడు. ఆంధ్రభాగవతకర్త—శ్రీరామభూపాలసాస్థానకవీశ్వరుడు—బమ్మెరపోతరాజుగారు భూమి, ఆకాశము, అంతరిక్షము మధ్య తన దృష్టికి తట్టిన తెల్లవస్తువులన్నిటికి జాబితా వ్రాసి సరస్వతి తెలుపు వర్ణించినాడు.

" ఉ. శారదనీరదేందు ఘన
సారపటీర మరాళ మల్లికా
హార తుషార ఫేనరజ
తాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధిసిత
తామరసామరవాహినీశుభా
కారత నొప్పు నిన్ను మది
గానగ నెన్నడుకల్గు భారతీ!"

ఈ పద్యములో ఖగోళదృశ్యములు:

(i) ఇందు. అమరవాహిని: అనగా చంద్రుడు, ఆకాశగంగ.

(ii) అంతరిక్షదృశ్యము — శరత్కాలమందలి తెల్లమబ్బులు.

(iii) పుష్పజాతులు—మల్లె, కుంద, మందార (తెలుపు), తెల్లతామర.

(iv) ఇతరవస్తువులు—శుద్ధిచేసిన కర్పూరము, శుద్ధస్ఫటికము, సుగంధము, తెల్లపట్టును పోలిన తెల్లరెల్లు, వెండికొండ, మంచు, హంస, తెల్లనిసముద్రము, తెల్లనురుగు, తెల్లనిపాము.

ఈ కవుల నందరిని మించినాడు మన ఆంధ్రవాగనుశాసనుడు నన్నయభట్టారకుడు. ఇత డెంత

గొప్ప ప్రకృతిపరిశోధకుడో, ఎంతటి స్వతంత్రభావములు గల మహాకవియో, సంస్కృతమూలమున లేని క్రొత్తభావములు ఎన్నెన్ని సందర్భోచితముగా తన తెనుగుకవనమున చేర్చెనో, బంగారమునకు పరిమళము వీచింపజేసినట్లు సంస్కృతభారతము తెనిగించి తెనుగున కెంత వన్నె దెచ్చెనో, ఎంత చక్కగా నక్షత్రవేధ చేయుచు, సందర్భోచితముగా నాయా విశేషములను తెనుగురచనలో చొప్పించి దేవపారిజాతమునట్లు తెనుగు భారతమును శాశ్వతసౌరభోపేతము కావించెనో కొంతవఱకైనను మనము తెలిసికొనుట ఈ సందర్భమున నత్యవసరము. భారతారణ్యపర్వమున సంస్కృతమూలములో శరత్కాల మెట్లు వర్ణింపబడెనో సంస్కృతమూలము మనము చూడవలెను. ఆంధ్రభారత రచనతో ఆ మూలమును తైహారు చేయవలెను. అప్పుడు గాని వ్యాసరచితభారతమును నన్నయభట్టు ఏవిధముగా తీర్పిదిద్ది మెఱుగులు పెట్టెనో స్పష్టముగా తెలియదు.

సంస్కృత శరదృతువర్ణనములో ద్యావాపృథివీదాంపత్యవర్ణన లేదు. సరస్వతీనది పుణ్యతీర్థము, పరిపూర్ణము అని మాత్ర మున్నది. బ్రహ్మ, అతని భార్య సరస్వతి-వీరి ప్రమేయమే అందు లేదు. వీరి వాహనమైన రాజహంససంగతికూడ ఆ మూలమునం దెత్తుకోబడలేదు. ఇక నన్నయభట్టు వ్రాసిన పద్యరాజము చదువుదము:—

ఉ. "భూపతికిం దివంబునకు
పొల్పెసగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై
విలసిల్లె మహర్షి మండలో
పాసిత రాజహంసగతి
భాతి ప్రసన్న సరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు
నబ్జజ యానముతో సమానమై"

ఆరణ్య. ౪-౧౪౩.

ద్యావాపృథివీ పుణ్యదంపతులకు శరత్సమాగమ మయినది. ఇందుకు ఉపమానము: బ్రహ్మ సరస్వతీ దంపతులకు హంసవాహన మమర్చియున్నట్లే.

ఈ హంస 'మహర్షి మండలము'లో—అనగా నక్షత్రమండలములో నుపాసితము; పూజింపబడుచున్న రాజహంసము. బ్రహ్మ తెలుపు; సరస్వతి తెలుపు; దంపతులు ఉభయులు తెలుపే. పాలసముద్రపులంచున నిల్చి నీరక్షీరవిభాగము చేయుచున్న తెల్లనిట్ట-హంస వారికి వాహనము. ఆ హంసయొక్క ధావళ్యము మూలముగా వారి దాంపత్యము ఇంకను శోభాయమాన మగుచున్నది. అట్లేశరత్కారముగా ద్యావాపృథివీదాంపత్యమునకు శరత్ చంద్రికలవలన విశేషశోభ కలుగుచున్నది.

సరస్వతీదేవిని "తపనివృత్తులు బోటులై యోలగించుచుండును." నన్నయభట్టు తైత్తిరీయోపనిషత్తులోని అధిలోకవిజ్ఞాన సందర్భములో "పృథివీ పూర్వరూపం, ద్యౌ రుత్తరరూపమ్, ఆకాశ స్సంధిః" అను వాక్యమును మనమున నిడుకొని నైపద్యమును వ్రాసియుండును. శరదృతువులో సూర్యు డస్తమించినతరువాత ప్రకృతిశోభ మిక్కిలి దర్శనీయమైయుండును. ద్యావాపృథివీదంపతులను, దిక్చక్రమును, శరత్ చంద్రుని నన్నయభట్టు ఏ భావములతో, ఏ దృష్టితో చూచెనో మనముకూడ అదే భావములతో, అవే కనులతో చూడవలయును. ఆ సమయమున తూర్పు ఉత్తరదిశలను ఖగోళమున వెలుగొందు క్షీరోదమును, రాజహంసను, వీణామండలమును, బ్రహ్మ సరస్వతీ నక్షత్రదంపతులను కవి వర్ణించిన భావములతో దర్శింపవలెను. అప్పుడు గాని శరత్కాలభూగోళ ఖగోళ దృశ్యముల మనోజ్ఞత, ఉపమానౌచిత్యము, అందలి సారస్యములు చక్కగా తెలిసికోలేము.

ద్యావాపృథివీదంపతుల దాంపత్యము నందలి విశేషములు కాళిదాసుని శాకుంతలనాటకము చదివి సంతోషము పట్టలేక ఉబ్బి గంతులువేసి నాట్యమాడిన 'గటే' (Goethe) అను జర్మన్‌కవి - విమర్శకుడు ఈ క్రింది పద్యములో చక్కగా వ్యక్తముచేసినాడు:

"Wouldst thou, the young year's blossoms and the fruits of its age
And all by which the Soul is charmed feasted and fed,

Wouldst thou the Earth and Heaven itself in one name combine?
I name thee "Oh Sakuntala" and all at once is said."

"వసంతయౌవనవికాసములకు శరత్కాలవార్ధక్య ఫలప్రాప్తితో పొత్తు కలిపి, ఆత్మను పీడిస్తున్న క్షుద్బాధల నివారిస్తూ మధురసోపేతంగా మృష్టాన్న భోజనముతో బ్రహ్మానందం కలిగించి ద్యావాపృథివీ దంపతుల దాంపత్యవిశేషాలన్నీ ఒక్క మాటలో ఇమిడ్చి చెప్పమంటారా ? అయితే 'శకుంతల' అని ఒక్క మాట మనవిచేస్తాను. ఆ ఒక్క మాటలో అన్నీ ఇమిడే ఉన్నవి ; కనుక ఇక వేరే యేమీ చెప్పనక్కరలేదు.

గెటీ వ్రాసిన విమర్శను రవీంద్రనాథటాగూర్ గారు చక్కని వ్యాఖ్యానం వ్రాశారు.

"శకుంతలలో ఒక చక్కని పరిణామచరిత్ర వ్యక్తమవుతున్నది. పూసిన పుష్పం కాసి కాయయై పండి ఫలం అవుతున్నది. మట్టి స్వభావమును విడిచి భూమి ఔన్నత్యమును పొందుచు స్వర్గసీమలో లీనమగుచున్నది. ద్రవ్యభావమును విడిచి ద్రవ్యము (Matter) ఆధ్యాత్మిక (Spirit) పరమార్థభావము నొందుచున్నది. భూమి ఎంత సహజంగా, స్వతస్సిద్ధంగా స్వర్గంలో చేరి అందుతో ఐక్యమవుతున్నదంటే—ఎంత ప్రయత్నించినా, వాటిమధ్య సరిహద్దు ఇదుగో-ఇక్కడ-ఈచోట ఉన్నదని స్పష్టంగా చూపించుటకుకూడా సాధ్యంకాదు. అంత చమత్కారంగా ద్యావాపృథివీ దంపతులు ఏకమయిపోతారు. ఐహికసౌందర్యస్థానం నుంచీ కామచింతలనుంచీ బయటపడి, ప్రేమ, శాశ్వతమూ, నైతికమూ అయిన పవిత్రజ్యోతిరూపం పొందుతుంది. ఈ ప్రేమలో స్వేచ్ఛ ఉన్నదికాని అది యథేచ్ఛమాత్రము కాదు. కొంత హద్దూ, అదుపూ ఉన్నవి. వాటికి లోబడి, ఆరోగ్యమై, అవసరమైన నిర్బంధనిబంధనలతో లంకె కట్టబడిన స్వేచ్ఛ. ఈ ప్రేమ సౌందర్యములలో దైవికమైన దివ్యతేజము, అనుభవైకవేద్యమైన మేటిశృంగారము, విశిష్టమైన నమ్రత, విమలమైన సౌమ్యత-ఇవన్నియు చేరియున్నవి. ఈ ప్రేమ నిత్యోత్తేజకరమైనది. విశేషించి విశ్వవ్యాప్తి కలది."

ఇక ఖగోళ సమన్వయ విషయములో:—

(i) జగన్నిర్మాణకారణభూతుడైన బ్రహ్మదేవుని యొక్క సృష్టికళా ప్రావీణ్యమును,

(ii) భావాంబరవీథి విశ్రుతవిహారిణియు, కుమతులకు పక్కవుల చైతన్యహేతువు నైన సరస్వతీదేవి యొక్క కవిత్వకళాశిల్పభావములను,

(iii) హంసకు గల తేజఃప్రియత్వము, సదసద్విచక్షణ దౌర్జన్యరహితమైన శాంతి సమభావములును—

ఇవన్నియు నొకదానితో నొకటి చక్కగా మేళవించి, ఒండొంటిలో లీనమయి, మహనీయతేజో విరాజమానములై యొప్పుచున్నవి. ఈ మహత్తరదృశ్యమును మనయెదుట ప్రదర్శించుచు, ధన్యుడైనాడు నన్నయభట్టారకుడు.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో నారసి మేలు నా" ననునట్లును, "ఇతరులక్షరరమ్యత నాదరించు"నట్లును నన్నయ తెనుగు భారతము రచింతునని ప్రతిజ్ఞ పట్టినాడు. కాళిదాసుని 'శాకుంతల' నాటకమువలెనే అతడు శకుంతలమున ద్యావాపృథివీ దాంపత్యమునుగూర్చి చేసిన వర్ణనము గెటె రవీంద్రుల మెప్పు వడసె ననుటకు సందేహము లేదు. సంస్కృతిమూలమున కానరాని యీ ద్యావాపృథివీ దాంపత్యమును ఖగోళరాజహంస, బ్రహ్మ, సరస్వతీ దంపతుల యానముతో నుపమించి అక్షరరమ్యత నాపాదించి, జ్యోతిశ్శాస్త్రజిజ్ఞాసువుల శాశ్వతప్రతిజ్ఞకు పాత్రుడవైనావు! నన్నయభట్టారకా! వేదఋషుల సంస్కృతి నీలో పూర్తిగా ప్రతిబింబించి ప్రజ్వలించుచున్నది. జ్యోతిశ్శాస్త్రవేత్తవు! కవివి! ఆంధ్రవాగనుశాసనుడవు! పునః ఆంధ్రవాగనుశాసనుడవు. జ్యోతిర్లోకమున వెలుగు సరస్వతీదంపతులు నీ జిహ్వాగ్రమున వెలసియున్నారు! మహాకవీ! నిన్ను కడుపార పుత్రునిగా గన్న తెనుగుతల్లి ధన్యురాలు! నీ తెనుగుశకములో పుట్టి నీ ప్రతిభ నొకింత తెలిసికొనగలిగిన మేము ధన్యులము!

## పరిశిష్టము

ఇందు బ్రహ్మరహస్యములనుగూర్చిన ముఖ్యాంశములు కొన్ని చర్చించితిమి. సృష్టిక్రమములో కొంత వఱకు మాత్రము తెలిసికొంటిమి. 'Chaos' అనబడు ప్రళయాంతమునుండి 'Nebulae' అనబడు తెల్లమబ్బులు వేడి పొగలతో కూడుకొని పరిభ్రమించుకొనుచు లక్షలకోట్లు సంవత్సరములతరువాత చుక్కలేర్పడునని పైని చదివితిమి. చుక్కలు బ్రహ్మాండపరిమాణముగల ప్రచండ సూర్యగోళము లని తెలిసికొంటిమి. ప్రకృతిశక్తుల ప్రాబల్యమునకు లొంగి ఈ సూర్యగోళములు కొన్ని తునకలై పోవును. ఈ తునకలు తమలోతాము తిరుగుకొనుచు, మఱల సూర్యునిచుట్టు ప్రదక్షిణము చేయుచుండును. ఈ తునకలే మన గ్రహములు. సూర్యుని నుండి వెలువడిన తునకలలో నొక తునక మన భూమి. ఒకప్పుడు ఆకాశమున తెల్లమబ్బురూపముతో పరిభ్రమించుచుండిన వేడి పొగలనుండియే సూర్యుడును, సూర్యునిలో నొక తునకయై భూగోళమును ఏర్పడినవి. భూగోళము భ్రమణ-పరిభ్రమణములు గావించుకొనుచు రాగారాగా, పైపొరలు చల్లారజొచ్చినవి. పొరల వేడిమి మందముకాగా ఆ పొగలోని ధాతువులు, మూలవస్తువులు వీనియొక్క నిర్మాణక్రమముగూడ మారుచువచ్చినది. పైపొరలలో వాయుపదార్థములు ద్రవింపజొచ్చినవి; ద్రవపదార్థములు ఘనములు కాగలిగినవి. జలాశయముల మఱల భూభాగములు ఏర్పడినవి. భూగర్భమున ప్రకృతిశక్తుల సంఘర్షణములతో భూకంపములు కల్గుచుండినవి. ఆ క్రోపులాటలలో ఉబ్బుమని భూమ్యుపరిభాగమున కొండలు బయల్పడినవి. జలాశయములు సముద్రము లయినవి. లోతు సముద్రములు మెత్తటి ఒడ్డులను కోరివేయుచుండెను. లోతులేనిచోట భూమి నీటిని మట్టిచేయుచుండెను. సముద్రము పొంగినపుడు భయంకరముగా ఉప్పెనలు చెలరేగుచుండెను. సంతతధారావృష్టిని వర్షములు, హోరున గాలి, తుపానుబీభత్సములు, హిమపాతములు ఇలాగున బహుకాలము సందడులు జరుగగా తుదకు దీర్ఘములైన పర్వతపంక్తులు ఏర్పడినవి. వాని మఱల చక్కని లోయలు, ఉపరిభాగమున శీతభూములు, నదీ నదములు - ఒకటేమిటి! నేడు ప్రకృతిశోభను ప్రకటించు సమస్తమును క్రమముగా వ్యక్తమగుచు వచ్చినది. ఇట్లు స్ఫటికీకరణము నొందినట్లు గట్టిపడిన భూమిపొరలు, జలప్రపూర్ణములైన సముద్ర మహాసముద్రములు, స్థలజలమయమైన భూగోళపుటుపరిభాగమున వ్యాపించియున్న గాలి-ఇవన్నియు నొకప్పుడాకాశమున తెల్లమబ్బురూపమున తేలిపోవుచుండిన వేడిపొగనుండియే పుట్టుకొని వచ్చినవి. మహాపాషాణ పాదపములతో కూడుకొనిన పర్వతరాజము లన్నియు నాటి వేడిపొగనుండియే ప్రాదుర్భావము నొందినవి. చీమ దోమలు మొదలు మహాగజము వరకు, చిరుచేప మొదలు తిమి తిమింగిల శింశుమారాది భయంకరజలజంతువులవరకు సమస్తప్రాణులును ఒకప్పుడు తెల్లమబ్బుగా తేలిపోవుచుండిన వేడిపొగనుండి వెలువడినవే. బ్రహ్మజిజ్ఞాసాపరులైన మహాఋషులు, పరశురామ, భీష్మ, -ద్రోణులు, అలెగ్జాండరు, సీజరు, నెపోలియన్ మొదలగుమహావీరులు, అసంఖ్యాకాక్షౌహిణులతో సైన్యములు, మృత్యుముఖములం బోలు మాశులతో ఫిరంగులు, ఎంతటి కొండనైన నవలీలగా మట్టిచేయు టార్పెడో సాధనములు, వాయుపథమున విహరించుచు తెడిదముగ నగ్నివర్షము కురిసి సర్వనాశనము చేయు విమానములు, పాశుపతశక్తుల మించిన శక్తులు గల ఏటంబాంబులు-హిట్లరు, చర్చిల్, మహాత్మాగాంధీ, జిన్నా సాహెబు, అన్నము లేకను, దుర్భరదారిద్ర్యముల కోర్వక నల్లలు వేగిపోవుచున్న ప్రజాసామాన్యము -వీరందరును, ఇవన్నియు నొకానొకప్పుడు ఆకాశమున తేలియాడిన తెల్లమబ్బులోని వేడిపొగనుండియే ఆవిర్భవించినారు. ఈనాడు మన భూమిమీద నున్న సమస్తమును నీహారప్రాకృతమైనట్లు ధవళముగా తోచిన వాయుపదార్థమునుండియే ప్రారంభము కనినది.

ఇదివరకు ఉండిన సమస్తమును, ఇప్పుడున్న సమస్తమును, ఇటుపై నుండగల సమస్తమును ఆనాటి శిలి మట్టునుండే ఏర్పడినది; ఏర్పడుచున్నది; ఏర్పడగలదు. *

"యస్మిన్ విశ్వాని భువనాని తస్థుః" అను వేద వాక్యములో అతిసంగ్రహముగా పైని వ్రాసిన వివరము లన్నియు వ్యక్తము చేయబడియున్నవి. శ్రుతిప్రమాణము ఎప్పటికిని శ్రుతిప్రమాణమే!

* ఈసృష్టి పరిణామక్రమములో చాల విషయములు హా॰క్సలిన్ దొరగారు వ్రాసిన 'భూగోళపు పుట్టుపూర్వోత్తరములు' (Origin of the World) అను గ్రంథమునుండి కైకొనబడినవి.

---

# నాడు - నేడు



— శ్రీ కోట సుందరరామ శర్మ —

ఆనా డది అదృష్టదేవత
ఈనాడో మహాపిశాచం.

ఆనా డొక మోహావేశం
ఈనా డో భుజంగపాశం.

ఆనాటిది ఆ పయోముఖం
ఈనా డది విషకుంభం.

ఆనా డది సాధుసువాదం
ఈనా డది ధిగ్ధిగ్వాదం.

ఆనా డది నవనవశోభి
ఈనాడో అంతఃక్షోభి.

ఆనా డది త్రిపదీ సుపదీ
నేడో సప్తపదీ 'విపది'.

ఆనా డది తారకమంత్రం
ఈనాడో నారకయంత్రం.

కానీ నా డది అక్షయపాత్ర
ఈనాడూ అక్షయపాత్రే.

---

# హేమమాలి

[ శ్రవ్య నాటిక ]



– శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి –

## ఆముఖము

అటు కుటిలవిత్తరాజమహాగ్రహమ్ము
లీల నిటు ప్రేయసీ సుధాలింగనమ్ము
నడుమ నవనీతమతి! యెంత నలిగినలిగి
రామగిరి శరణ మంటివో-హేమమాలి!

రాజరాజు ప్రభుత్వంపు రాతిగుండె
సిరిసెపుంబూలజంటలో చిచ్చువెట్టె;
చైత్రరథపుష్పశయ్యాప్రశస్తభోగి
ఏగతి నెఱుంగు పరుల వియోగబాధ—

### ౧ దృశ్యం

[అలకాపట్టణం. చల్లని ప్రాతఃకాలం. ఒక యక్షసౌధం. యక్షసుందరి విశాలాక్షి అలంకరించుకొనే ప్రయత్నంలో జడ అల్లుకొంటూ—]

విశాల—ప్రభూ, అంత చీకటి ఉండగా నన్ను ఒక్కతెనూ విడచి ఎక్కడికి వెళ్లారు? అబ్బ! మీరు దగ్గరగా లేకపోతే ఎంత దిగులుగా ఉంటుందని- శ్రుతిలేని వీణలా మనస్సంతా వెలితిగా కలతగా ఉంటుంది.

హేమ—విశాలా! ఇలా చూడు—

విశాల—ఓహో! ఎక్కడివి పువ్వులు ప్రభూ! ఇవేనా మీరు చెప్పే స్వర్ణపద్మాలు? బంగారానికి ఇంత మృదుత్వమా? ఈ పరిమళమా? వింతగా ఉంది. ఇంకా ఎన్ని పువ్వులు! రకరకాల పువ్వులు-రంగురంగు నవ్వులతో మా దోసిట ఒదిగే పువ్వులు-ఎందు కివి ప్రభూ?

హేమ—నా బాహుపంజరశుకాన్ని-నా ప్రేమ రాణిని అలంకరించి ఆనందించడానికి—

నందనమందారములే-పారి
చందనకుందకుసుమములే
ఓసఖి! నాసఖి నీ
కైశికభూషాకలన కివే॥ నం॥

మానసకాంచనకుసుమములే నీ
కేవలి దురిచెద ప్రియ! రావే
భువనవాటిలో పూవులు పూచెను
ప్రేయసిజడ సవరించుటకే॥ నం॥

ప్రియా! ఇట్లా రా! ఈ కాంచనకమలాలను నా చేతితో నీ వేణీబంధంలో తురుముతాను. ఆ పూలతో

కదలే నీ సౌందర్యరేఖను నేను సర్వాంగా కలయొత్తి చూడాలి. (పూలు జడలో పెడతాడు)

విశాల—సంతస్నగ మంతా వెదకి, హఠాత్తుగా వనలక్ష్మిని కలుసుకొని తన ప్రేమసారంతో, సౌందర్యసర్వస్వంతో ఆమెను మంచిత్తే నాధనమూర్తిలా నా కై ఊపిరి తిరగని పుష్పాలంకారధనం ఏమిటి ప్రాణపతీ!

హేమ—విశాలా! శీతలమైన ఈ పుష్పాలు నీ కలంకారాలా! నీ చెంపల నునుపు చూసి ఈ పారిజాతం, పెదవుల రక్తిమను చూసి ఈ మందారం, శరీరపు మెరుగు చూసి ఈ స్వర్ణ కమలాలూ, సిగ్గుచే ఎలా తలలు వంచుకుంటున్నాయో చూశావా? సృష్టిలో కదిలే ప్రతి అందమైన అణువూ ఒక సారు నీ దగ్గర సౌందర్యలవాన్ని యాచించి తెచ్చుకున్నదేమో అని పిస్తుంది ఒకొక్కప్పుడు నాకు—

ప్రియతమా! జగత్తులోని పరిమళభరితపుష్పాల నన్నిటినీ ఏరి ఒక సింహాసనం కట్టి నిన్ను దానిలో అధివసింపజేసి నా తనువంతా కళ్లు చేసుకొని నిన్ను చూచినా నాకు తనివి తీరదేమో!

విశాల—ప్రభూ! కడలి పొంగులా ఉన్మత్తుగా నన్ను ముంచెత్తే మీ గాఢతరప్రేమమాధుర్యాన్ని భరించలేనేమో!

ఎంత ప్రియమైనా, హద్దు లేని పన్నజాజుల పరిమళాన్నీ, మకరందాన్నీ అనుభవించి నిలవ దొక్కుకోలేము కదా హృదయపతీ!

హేమ—ప్రియా! నేను ఎదురుచూడని ఏదిక్కు నుంచి వచ్చి నా జీవితప్రాంగణంలో ప్రవేశించావో గాని, కమ్మని ఊహలు తియ్యని భావనలతో నాకు సంపూర్ణత్వాన్ని ప్రసాదించావు. కొల్లబోయిన నా తొలి ఆశను ఉషస్సుందరిలా వచ్చి వెలిగించావు కదూ—

ఈ గహనాలతమ్మ వెలి
గించిన లక్ష్మీ! నిరాశలేలు నీ
రాగవిపంచి మీటిన స
రస్వతి! ఈ మృతశీతలాద్రిపై
నైగమసంగీతముల
పాట్లను సల్పిన సర్వమంగళా
రాగిణీ! నన్ను నీ హృదయ
రాజ్యపు కాంచనపీఠి నిల్పవే—

విశాల—ప్రాణప్రియా! తీక్ష్ణసుందర సూర్యకిరణానికి లక్ష్యమై గిర్రున తిరిగే ప్రొద్దు తిరుగుడు పువ్వు లాంటి నన్ను మీ తీవ్రప్రేమలో లీనం చేసుకోరాదా ప్రభూ! ఈ ద్వైతభావం ఎంత బాధాకరంగా ఉందో మీరు గ్రహించడం లేదు.

హేమ—(ప్రేమగా బుగ్గమీద తట్టి) ఎంత వెర్రిదానవు విశాలా! నీవు నీవుగా, నేను నేనుగా ఉన్నప్పుడే యీ ప్రబలమైన ఆకర్షణ. శూన్యమైన అద్వైతం అంటే నాకు మహాభయం. సృష్టి కంటికి అతీతమై వెలిగే నీ లావణ్యమూర్తి ఒక క్షణం నా యెదుట చలించకపోతే ప్రళయం పుట్టదా!

విశాల—(కృతజ్ఞతగా చిరునవ్వు నవ్వుతూ) ఎంతటి విజ్ఞానవంతులకైనా ఆత్మీయవస్తువంటే ఎంత వ్యామోహం ప్రభూ!

హేమ—కాదు విశాలా.........నా కళ్లతో చూచి నా మెదడుతో ఆలోచించలేవు నువ్వు-మరి సాధ్యమైతే, ఇంద్రధనుస్సు తూగుటుయ్యాలలో నిన్నుంచి, సృష్టిలోని అందమంతా తుంచి నీ జడలో తురమాలని ఉంటుంది. అదిగో అట్లా చూడు-ఉదయసూర్యకిరణాలతో, ధగధగ మెరిసే కాంచనగంగానీహార శిఖరపు మెరపుతో నీ శరీరాన్ని, చిక్కని ఆకాశపు నీలంతో నీకళ్లను అలంకరించలేనుగదా—

తియ్యమామిడిచిగుళ్ల వన్నెని మెరపునంతా ఊర్చి, నీ పాదాలకు అలక్తకంగా పూసి, నెమలికంఠపు రంగుల తళుకును, శీతాకోకచిలుక రెక్కల లావణ్యాన్ని తెచ్చి పరిధానంగా నీకు చుట్టబెట్టగల్గితే ఎంత ధన్యుణ్ణి!

విశాల—ప్రభూ! ఇంక వద్దు. ఆపండి. మీ మహోన్నతప్రణయసౌధంమీద నిలుచుండి క్రిందికి చూచినకొద్దీ కళ్లు తిరుగుతున్నాయి. అతిస్నేహం పాపాన్ని శంకిస్తుందేమో—ఏదో బెంగగా—భయంగా

ఉంది. హిమవత్పర్వతసానువులమీద విహరిస్తూ అకస్మాత్తుగా ఒక లోయలోకి చూచినట్టు అవకాశం కలుగుతున్నాను ప్రాణపతీ!

హేమ—(హేళనగా నవ్వుతూ) గంధర్వలోకంలో పుట్టి, దుర్బలప్రాణులు మానవుల్లా ఏమిటే మాటలు! ఇట్లా రా! ప్రాంగణంలో కాంచనవాపయొడ్డి మీద ఉన్న నీ పెంపుడునెమలిని ఒక పాట పాడి ఆడించు. చేతికందే నీ బాలమందారపు గుత్తుల శోభను చూచినట్లామా! మన పచ్చల మెట్ల దిగుడుబావి చెంతగాని, ఇంద్రనీలాల క్రీడాపర్వతంవద్దగాని కాస్తసేపు తిరిగినట్లాం, రారాదూ! ఎంత ఉత్సాహంగా ఉంటుంది!

విశాల—మీ అనంతప్రేమచంద్రికాపరివ్యాప్తంలో పరవశనైన నాకు మాటలు రావు. చాలా అలసి వచ్చారు, కొంచెం మధువు సేవించి విశ్రమించరాదా ప్రభూ!

హేమ—ఇంకా మధువు లెందుకు విశాలా! నీ లావణ్యసుధువు చాలదూ—నీ మెడలోని మెన్నని బంగారపు మెరపు, కళ్ళలోని కాంత మనసునీలిమ నాలో ఎంత ఉత్సాహాన్ని రగిలిస్తుంది!

ఒక్కసారి లే—నీ సౌందర్యప్రభ సంతతినీ చరచర నెమలిపురిలా విప్పి, దిక్కులన్నీ నీ విభ్రమాన్ని ముద్రించుకునేలాగు చెంగున నాట్యం చెయ్యి.

ఇట్లా ఎదురుగా కూర్చుని, ప్రేమరాజ్యచక్రవర్తిగా అవలోకిస్తాను.

దీనిముందు ఆ రాజరాజపదవిభూషాఅల్పం, అణువులా కనపడుతుంది నాకు—

విశాల—(నవ్వుతూ నృత్యం. మంజీరధ్వనులు ముఖరితం కాగా భవనం ప్రతిధ్వనిస్తుంది)

నందనమందారములే......

(హఠాత్తుగా ఇద్దరు యక్షులు)

౧ యక్షుడు—హేమా, హేమా!

౨ యక్షుడు—శ్రీ కుబేరప్రభువువారు...

హేమ—(చిరాకుగా, లోని ఆగ్రహం అణచుకుంటూ) ఏమిటయ్యా! అంత అలజడి!

౧ యక్షుడు—తక్షణం తీసుకురమ్మన్నారు.

౨ యక్షుడు—నిమిషం ఆలస్యం కూడా ఇక సహించరు.

౧ యక్షుడు—శ్రీ రాజరాజప్రభువు—

౨ యక్షుడు—మహేశ్వరపూజమాట మరచిపోయావా?

౧ యక్షుడు—మహాదేవసహస్రనామార్చన ఆగిపోయింది. తరువాత నీయిష్టం.

హేమ—మీ అడుగుజాడల్లో వస్తున్నాను ప్రభుసన్నిధికి. మీరు ముందు నడవండి—

యక్షులు—సరే—(వెళ్లారు)

విశాల—ప్రభూ! ఏమిటీ కలవరం? నాకేదో దిగులుగా ఉంది.

హేమ—(నవ్వి) ఏమీ లేదు. ఊరకే స్త్రీప్రకృతివల్లే దిగులుపడుతూంటావు. (మెల్లగా) నీ జడలోని హేమపద్మాలు ఇట్లా తే...

విశాల—(తీసి ఇచ్చి) నాకేమో...భయంగా ఉంది... లేదు ప్రాణపతీ!

హేమ—భయం లేదు. మళ్లా వస్తా.

(నిష్క్రమణ.)

## ౨ దృశ్యం

[కుబేరమహారాజభవనంలోని మహేశ్వర పూజామందిరం. కుబేరుడు శివపూజాపీఠంముందు ధ్యానముద్రలో కూర్చుని చేతులు మోడ్చి]

జయ మహేశ! కైలాసశైలభవన!
భువనభవబంధనాశశీలవనశీల!
ఎంత భాగ్యమబ్బె నాది నీ చెంత నిలువ
ప్రాణసఖ! ప్రేమ నా పూజ గొనుకొనుము—

(ముందు శంఖధ్వని, తరువాత ఘంటానాదం, నెమ్మదిగా హెచ్చు తగ్గుతాయి)

కంబుగ్రీవా! మూకు, ఆ మందాకినీజలపూర్ణకలశం ఇట్లా అందుకో—

కంబు—చిత్తం. ఇదిగో—

కుబేర—ఓం నమః సోమాయచ రుద్రాయచ నమ స్తామ్రాయ చారుణాయచ. నమః శంగాయచ పశుపతయేచ.

కాంచనకేగా! హేమమాలి వచ్చాడా? ఏవీ మానససరస్స్వర్ణకమలాలు?

కాంచన—చిత్తం ప్రభూ...ఇప్పుడే వెళ్ళి వచ్చాం...ఇంకా హేమమాలి...

కుబేర—రాలేదా?

కాంచ—మహాప్రభూ! కన్నులు చింపుకొని నిరీక్షిస్తున్నాము. కనుచూపు మేరలో కానరావడం లేదు.

కుబేర—ఏమీ— మానసంనుంచి ప్రభాత కాలానికి తెచ్చి సమర్పించవలసిన పూజాపుష్పాలకు ఇంత ఆలస్యమా? హేమమాలి ఇంత ఒడలు తెలియకుండా ఉన్నాడన్నమాట—

కంబు—మహారాజా! అంతా లేత భృత్యులం— ఏమి పనిచేసినా అనూయలా కనపడుతుంది.

కుబేర—ఏమిటది? (గొంతు హెచ్చించి) చెప్పండి!

కాంచన—చిత్తం. చిత్తం. అతనికి సర్వకాల సర్వావస్థల్లోనూ...

కంబు—భార్యకంటే ఇతర ప్రపంచం లేదు ప్రభూ—

కాంచ—అవి పుష్పవనవిహారాలా - కేళీ పర్వత క్రీడలా-నిరంతర నృత్యగానాలా—

కంబు—వాటిలో నుంచి ఎప్పుడైనా జ్ఞాపకం వస్తే—అసలు...తీరుబడి ఉంటే...

కాంచన—అప్పుడూ ప్రభుసేవ—

(ఘంటమీద దెబ్బ)

కుబేర—(మండిపడుతూ) ఏమిటీ! యక్షప్రభు సేవకులకు ఇంత కన్నులు కప్పుకొని పోతున్న వన్నమాట—

కంబు—ప్రభూ - అడుగో - హేమమాలి...

హేమ—(ప్రభుసన్నిధానానికి వణకుతుంగా వచ్చి) ప్రభూ - క్షమించవలెను. మహాదేవపూజాపుష్పాలకు...ఈ రోజున కొంచెం...ఆలస్యం...

కుబేర—(కోపకంపితంగా) నా భృత్యులకు ప్రభుశాసనం అంటే ఎప్పటినుంచి ఇంత నిర్లక్ష్యం బలిసింది...హేమ...మాలీ...

హేమ—(కొంచెం చలించి) పదకమలాంతఃకర కరణాలు శ్రీ యక్ష ప్రభువులు...ఈ భృత్యుని అపరాధం క్షమింపవలెనని ప్రార్థిస్తున్నాను.

కుబేర—ఇంకా ఆలస్యం చేస్తావేం? ఏవీ హేమపద్మాలు—నీ మూలాన ఇప్పటికే మహేశ్వరపూజా వేళ అతిక్రమించింది.

హేమ—ఇదిగో - మహాప్రభూ—

కుబేర—(అందుకొని) ఓం మహాదేవాయ నమః ఓం బాలేందుశేఖరాయ నమః ఓం హ్వసంగౌప్రాణ వల్లభాయ నమః (హఠాత్తుగా ఆగి) ఏమిది—మహాపాపీ, హేమమాలీ!...ఛీ, ఛీ, మహేశార్చన అంతా దూషితమైపోయింది.

ఏమిరా, పొగరు!! పరమపవిత్రమానససరోజాలలో...ఈ...శిరోజంఎల్లావచ్చింది? ధిక్కారం... (గట్టిగా గంటమీద దెబ్బ) త్రియంబకప్రాణసఖుని మాహేశ్వరారాధనంలో ఒక తుచ్ఛ కామపరతంత్రుని శివాపరాధమా!— ఇక ... క్షమ గాని...క్షమార్పణలు గాని లేవు. శివద్రోహీ! హేమమాలీ!

హేమ—(వివశుడై) ప్రభూ...ప్రభూ...

కుబేర—ఏ భార్యా వ్యామోహంలో... కామసేవా పరతంత్రుడివై కన్నులు మూసుకొని శివాపరాధం చేశావో—ఆ భార్యకూ...నీకూ...

హేమ—ప్రభూ! నన్ను చంపివేయండి. ఆ మాట మాత్రం వినలేను.

నలకూబరుడు—(హఠాత్తుగా ప్రవేశించి) పితృదేవా! ఏమిటీ వైపరీత్యం! ప్రభువుకు బిడ్డలొకటి-భృత్యులొకటీనా? అతనిది అపరాధమే. కాని, హృదయమి శోకపుహద్దులనే దాటిపోయిన ప్రణయపారవశ్యంలో ఈ అపచారం జరిగింది. జీవనపు తొలి

సంస్కారాన్ని రాగతీవ్రత వివేక మార్గాన్ని మరపించగ లేదా !

కుబేర— సాహసా, నలా, అజ్ఞాధంగాని! నేను విచారిస్తున్నా ననుకోకు— నా ప్రాణప్రదమైన మహాదేవుని యెడల నా భృత్యుని అపచారమా ! దీనిని నేను క్షమించను. ఈ అపచారానికి శిక్ష జరిగి తీరాలి.

నల— ప్రభువులు ఉగ్రులై అపరాధానికి గట్టింపు దండనం విధించి భృత్యభృత్యులమైనా మను కోవడంకంటె ఉదార బుద్ధితో భృత్యుల దుష్కలితా నికి జాలిపడి కరుణతో వారిని క్షమించి వారిని కంపడం ఎక్కువ శిక్ష కాదా పితృదేవా ! అన్యాదృశశూలి పర మేశ్వరుడు ఈ దీన ప్రేమికుని క్షమించకపోడు. తన కన్నుతో కామమూర్తిని భస్మీభూతుణ్ణి చేసిన మహా రుద్రుడు మధుర ప్రేమమూర్తియై జగదంబిక హైమవతీ దేవి నిరంతరాశ్లేష సుఖాన్ని విహరించడంగదా—

కుబేర— హేమమాలీ! ప్రభువాక్యమూ, శివా పరాధమూ వ్యర్థంగా పోవు. నీ ప్రమత్తతకు పర్యా ప్త కారణభూతురాలైన.. నీ భార్యకూ...నీకూ... ఒక...వత్సరం...వియోగం...తప్పదు.

హేమ— (ఖంగారుగా) ప్రభూ!...ప్రభూ...

కుబేర— ఈ శాపకాలంలో నీకు సహజమైన ఎట్టి మానవాతీతశక్తులూ...ఉండవు...ఇక వెళ్లు.

హేమ— (మౌన నిష్క్రమణం)

## 3 దృశ్యం

[వింధ్య ప్రాంతారణ్యభూమి. రామగిరి ఆశ్రమం. దట్టంగా పురపొన్న చెట్లు. యక్షప్రవాసి హేమమాలి విరహవేదనలో కృశించి, మతి చలించి అక్కడక్కడ తా తిన్నలవక తిరుగుతూంటాడు.]

(ప్రవేశం: హేమమాలి)

(ఒక కొలను ఒడ్డున రాతిపలకమీద కూచుని కళ్లు మూసుకొని బాధలో ఒక్క కేకగా—)

హే— విశాల! శోభావతీ! అస్మదీయ
లోచనామృతవర్తి, విలోలమూర్తి !
ఈ విరహవేదనమున నెట్లు జీవనమ్ము
నిలుపుదునో? నీవు దూరాన-అలకలోన—

(కొంతసేపు నిశ్శబ్దం)

ఇదిగో...విశాల...ప్రియతమా వచ్చావా? నా విరహవిషణ్ణ కంఠస్వని అలక దాకా వినపడ్డదా?...ఔను. వినపడుతుంది. ఎంత దూరదూరాలలో కాలాలలో ఉన్నా... మన్ని ఎవరు కలుసుకోకుండా చెయ్యగలరు? రా... ఇంకా దగ్గరగా...రా! నీ కోసం తపించి తపించి ఈ శరీరం ఎంత కృశించిందో చూచావా?

ఒక్కసారి నీ చివురుచేతులతో నిమిరితే ఎంత శాంతిగా ఉంటుంది!

ఏమిటీ!...ఇన్నాళ్లూ...నా వెంటనే ఉండి, ఇంత నలిగి నలిగి అలసిన నన్ను చూస్తూ...ఊరుకున్నా వా... నా విశాలా!

ఎవ్వరైనా...ఇట్లా చేశారా! ఔను ప్రభు తిరస్కృతుడిమీద నీకు మాత్రం సానుభూతి ఎందు కుం టుంది! ఆ ప్రభుపాలనలోని ప్రజవు కావూ? నువ్వు— అదిగో...కోపమేం—మన్మథ ధనుర్లతలవంటి కనుబొమ్మ లను ఎంత కుటిలంగా వంచావూ! వద్దు. బతిమాలు కొంటున్నాను.

నీ మృదులవక్షః శయ్యమీద...ఒక్కసారి తల వాల్చి వెచ్చని కన్నీరు విడిచి విశ్రమించనీ—అ అ— విశాలా—విశాలా—దూరంగా జరిగిపోకు! వస్తున్నా...

(కళ్లు తెరచి) ఏదీ విశాల?ఏదీ? ఎవ్వరూ ఎదుట లేరు. అంతా వట్టి భ్రాంతి. నేను ప్రియాపరిష్వంగం కోసం వట్టి బయలులో చాచిన చేతులు చూచి...పాపం వనదేవతలు గుండె కరిగి విడిచిన కన్నీటిబొట్లు పెద్దపెద్ద ఆణిముత్యాలుగా చెట్ల ఆకులమీద నిలిచాయి.

(నిశ్శబ్దం)

(లేచి...నిలుచుని) అదిగో...అదిగో. విశాల! ఇప్పుడు నిజం. కనబడి ఆ చెట్టుచాటుకు వెళ్లింది.

అదిగో...ఆ సుకుమారదేహయష్టి—నీలవేణీ ధరం. ఆగు...ఆగు...ప్రియతమా! ఇప్పటికే చాలా అలసి పోయాను. ఇక పరుగెత్తలేను—

(వెళ్ళి, చూచి, నిట్టూర్పు విడిచి) ఇదీ మోసమే. ఇది ఆమె శరీరం కాదు—ప్రియంగులత.

ఇది వేణీభరమూ కాదు. నెమలి పురివిప్పింది.

(కొలనువైపు చూచి) ఓహో !! ఈ తామర కొలనులో ఉన్నావా ! ఉండు—అట్లాగే ఉండు, వస్తున్నాను.

నీ సుందరముఖాన్ని, కనుబొమ్మ సంపుటిన్ని ఏలోకంలో ఉన్నా నేను గుర్తుపట్టగలను.

(కొలనులో ఉరికి) విశాలా—విశాలా, ఆహో—ప్రాణానికి ఎంత హాయిగా ఉంది—ఇది సుశీతల సరస్సలిలం కాదు. నీచల్లని కౌగిలింత. స్త్రీపరిష్వంగానికిగాని ఇంత ఎముకల్ని కొరికే సుఖం ఉండదు.

వద్దు—వద్దు—నాచేతి కంది మునిగిపోయావా చండీ—వి...శా...లా !

(తెలివి తెచ్చుకొని) ఏదీ ఇక్కడ లేదు. ఇది ముఖం కాదు. తామరపువ్వు. ఇవి కనుబొమ్మలు కావు—చిరుకెరటాల కదలికలు.

లేదు...నా...విశాల ఇక్కడ లేదు - ఎక్కడా లేదా ? అబ్బా...ఈ తలపు ఒక్కటే తప్ప ఏ ఘోర నరకయాతనవైనా సంతోషంగా భరించగలనేమో-

(ఆగి) ఈ ప్రవాసి, దీనప్రేమికుని సందేశవార్తను నాప్రియాతిమ విశాలాక్షికి తెలిపి పుణ్యము కట్టుకొనే మహాత్ముల్లెవ్వరూ లేరా ?

(ఎదురుగా కొండశిఖరాన పట్టిన మబ్బు ఉరుముతుంది)

హేమ—మేఘరాజా ! దయాళీ ! నా దయితకు వార్త చెప్పి పుణ్యముకట్టుకుంటావా ?

తప్తశరణ ! దీనబంధు
దయచేసి రావా జలదా !

నరవాహన కోపము మా
విరహానల మైనదోయి ॥ త ॥

ఆషాఢప్రథమదివస
మరుగుచెంది కరుణించెను
రామాహమణి కరిగింపవె
ఒక్కమాట నను గూరిచి ॥ త ॥

ఉపవనపున్నా హితమహే
కో త్తనూంగ శిఖరాలము
యక్షజనావాసము మా
యలకాపురి కరుగవోయి ॥ త ॥

మిత్రమా, జీవనదాతా ! నా ప్రాణప్రియకు ఈ రెండుమాటలూ చెప్పి మేలుచెయ్యి—

వింటున్నావా !
ఎప్పటికైన శాప మూడేది, సుఖము
గాంతు ననుకొందు ; నీవు నాకతినె మనము
సుఖము దుఃఖమ్ము లొక్కచోట నిలవు
చక్రనేమిక్రమమ్ముగా సాగుచుండు—
చక్రపాణి భుజగశయ్య వీడదీవాక
కన్నుమూసి రోట్లా గడుపు మబల !
కోరికల కొలంది శారదచంద్రికల
కేలిపోద మంత పూలబాట.



# మన ప్రాచీన వర్తకసంఘములు

## 'వజ్రబైషిక'

•

– శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ –

ప్రాచీనకాలములో ఒక్కొక్క వ్యాపారము చేయువారు ఒక్కొక్క వ్యాపార సంఘముగా ఏర్పడుచుండిరి. ఈసంఘములకు ధర్మశాస్త్రకారులు, స్మృతికర్తలు శ్రేణులు అని పేరిడిరి. ఈ శ్రేణులు ఇప్పటి వర్తక సంఘములవంటి వని చెప్పవచ్చును. పూల దండలు గుచ్చువారిది ఒక వర్తకసంఘము, గానుగ ఆడి నూనె తీయువారిది ఒక వర్తక సంఘము. ఇట్లు వేరువేరు దినుసులతో వర్తకవ్యాపారము చేయువారు వేరువేరు సంఘములుగా ఏర్పడుచుండిరి. ఏ సంఘమున కాసంఘమునకే ఆ సంఘమునందలి వర్తకులయొక్క, వారు చేయు వ్యాపారము యొక్క క్షేమలాభములను పరిరక్షించునిమిత్తము కట్టుదిట్టమైన నీతినియమములు ఉండెడివి. మధ్యయుగమున, అనగా క్రీస్తుశకము పది, పదునైదువందల సంవత్సరముల మధ్య కాలమున ఈ వర్తకసంఘములను 'సమయము'లని వ్యవహరించువారు. ఈ సంఘములందలి సభ్యులకు 'సమయమువా' రని పేరు. ఎన్నెన్ని దినుసులతో వ్యాపారము చేయు సంఘము లున్నప్పటికి ఇవి పదునెన్మిదని (పద్దెనిమిది సమయాలు) పరిపాటిగ ప్రాచీనకాలమునుంచి వచ్చుచున్న వ్యవహారము. ఒక్కొక్క దినుసుతో వర్తక వ్యాపారము చేయువారు, ఒక్కొక్కవృత్తిని అవలంబించువారు. కాలక్రమమున ఒక్కొక్క కులముగ నేర్పడిరి. వృత్తులను, వ్యాపారములను అనుసరించి యేర్పడిన కులములగుటచేత వీటికిని సమయము లని పేరు వచ్చినది. ఈ వృత్తి, వర్తకసంఘముల నీతినియమములే రానురాను 'కులకట్టుబాటులు'గా పరిణమించినవి. ఈ కులములకు వర్ణము లని పేరున్నది కాని అది సరియైనదిగ కనిపించదు. అయినను అది పౌరాణిక యుగమునుంచి వచ్చుచున్న వ్యవహారమే. అందువలననే అష్టాదశవర్ణము లను వ్యవహారము లోకమున రూఢమైనది. సంస్కృత, ప్రాకృత వాఙ్మయములలో ఈ యష్టాదశ వర్ణముల పేరులు గలవు. కాని ఒక గ్రంథమున ఇచ్చిన పేర్ల పట్టికకు మరొకదానిలో ఇచ్చినదానికి సంబంధము లేదు; కాగా అష్టాదశవర్ణములు ఏవి అను విషయమున గ్రంథకారులలో ఏకాభిప్రాయము లేదు. ఇది న్యాయ్యమే. ఎందువల్ల ననగా, వృత్తులు, వ్యాపారములు అనేకము లుండుటవల్లను, పరంపరగా వచ్చుచున్న పదునెనిమిది సంఖ్యకు సరిపుచ్చవలసియుండుటవల్లను ఎవరికేవి ముఖ్యములని తోచిన వాటిని పేర్కొన్నారు. అష్టాదశవర్ణముల పేర్ల పట్టికలు ఒకదానికి నింకొకదానికి తేడా యుండుటకు కారణ మిది. ఈ కులములను జాతులని

వ్యవహరించుటకూడ కలదు. 'పద్దెనిమిది జాతులవారు' అన్న వ్యవహారము మన కందరికి తెలిసినదే.

ప్రధానముగ ఈ కులములు, లేక వర్ణములు, లేక జాతులు వర్తకవ్యాపార, వృత్తి సంఘము లయినను వీటిలో వేరువేర్లు వహించిన అవాంతర వర్తక సంఘములుకూడ నున్నవి. వాటి నన్నిటిని ఇక్కడ పేర్కొనుట అనవసరము. ఈ వేర్వేరు వర్తక సంఘములన్నియు గలిసి ఇప్పటి 'చేంబర్ ఆఫ్ కామర్సు'(Chamber of Commerce) వంటి ఒక బృహద్వర్తకశ్రేణి (Trades Union) గా ఏర్పడినవి. ఇట్టి బృహద్వర్తకశ్రేణులు దక్షిణ హిందూదేశమున ఒకటి కంటె నెక్కువగ నున్నట్లు కన్పట్టుచున్నది. దక్షిణహిందూ దేశమునందలి ఇట్టి బృహద్వర్తకశ్రేణులలోని కెల్ల గొప్పది 'అయ్యావళీ' వర్తకసంఘము. మధ్యయుగమునాటి బృహద్వర్తకసంఘములలో ఇదియే ప్రముఖమైనది. కన్నడ దేశములోని విజాపుర మండలమున (Bijapur District) హుంగుండ (Hangunda) తాలూకాలోని అయ్యావళీపురము (Aihole) అయ్యావళీవర్తకసంఘమునకు ప్రధాన కార్యస్థానము. అందువల్ల ఇది ముఖ్యముగా కన్నడదేశపు వర్తకసంఘమని చెప్పకయే తెలియుచున్నది. ఇది కన్నడదేశపుది అయినప్పటికి ఇప్పుడు మనము పాటించు కర్ణాట, ఆంధ్ర, ద్రావిడాది జాతివిభేదములు ఆకాలపు రాజకీయరంగమున నెట్లు లేవో ఆ మధ్యయుగమునాటి వర్తకవ్యాపార రంగమునను అట్లే లేవు. అప్పుడు ఉన్నది ఒక్కటే విభేదము—హిందువులు, హిందేతరులు. కర్ణాటులయినను, ద్రావిడులయినను, ఆంధ్రులయినను హిందువులందరు ఒకటే. అట్టిది ఆనాటి హిందూసోదర్యము. రాజకీయములైనట్టివికాని, వర్తకమునకు సంబంధించినట్టివికాని, మరేవిధమైనట్టివికాని విభేదములు ఆనాటి హిందువులను సాంఘికముగ వేరుచేయ లేకపోయినవి. అందువలననే రాజ్యములు వేరయినను, రాజులు వేరయినను హిందువులందరు ఒకటే; హిందూసంస్కృతి ఒకటే; హిందూకళలు, విద్యలు ఒకటే. ఈ కారణముచేతనే హిందూత్వమును పరిరక్షించినంతకాలము, హిందూకళలను, విద్యలను-ఇంతెందుకు, హిందూసంస్కృతిని పోషించినంతకాలము ఏరాజు పోయి మరొకరాజు వచ్చినను, ఏ రాజవంశము కూలి మరొక రాజవంశము అధికారమునకు వచ్చినను పూర్వకాలమున ఈ మార్పును హిందూ సాంఘికులు లెక్క పాటించువారు కారు. వారికి కావలసిన దొక్కటే; అది హిందూధర్మపరిరక్షణము; హిందూసంస్కృతి పరిపోషణము. శత్రుత్వ, మిత్రత్వములు రాజులకే, రాజవంశములకే. అది ప్రజలు జోక్యము కలిగించుకో నవసరములేని వ్యవహారము. ఈసూత్రము ననుసరించే అయ్యావళీవర్తక సంఘము ప్రధానముగ కర్ణాటసంస్థ అయినను ఆంధ్రులు-ఆంధ్రులే కాదు, కర్ణాటేతరులు అందరు దానిని ఆదరించినారు. అయ్యావళీ వర్తకసంఘము శాఖలు ఒక్క కన్నడ దేశములోనే కాక ఆంధ్ర, ద్రావిడ, మలయాళ దేశములలోగూడ నుండెడివి. ఇంతే కాదు, బర్మా దేశములోను, సింహళ, సుమత్ర, జావా ద్వీపములలోనుకూడ ఈ వర్తక సంఘమువారు తమ శాఖలు స్థాపించినారు. వేరువేరు దేశములలోను, ద్వీపములలోను

స్థాపితమైన ఈ శాఖల ననుసరించియే అయ్యావళీవర్తకసంస్థ ఎంత బాహుళ్యమయినదో, ఎంత ప్రఖ్యాతమయినదో తెలియగలదు. కొంచెమించుమించుగ మనదేశములోని బలిజసంఘమువా రందరును ఈ యయ్యావళీసంస్థకు చెందినవారే. ఈ విషయము ఈక్రింది సీసపద్యపాదమువలన తేటతెల్లమగుచున్నది.

"శ్రీమదయ్యావళీ సింహవిక్రమపుర
వరులు బలిదులైన బలిజవారు
దుష్టనిగ్రహులును శ్రేష్ఠులు ప్రెంకాటి
పట్టబద్ధులయిన బలిజవారు...."

అయ్యావళీవర్తకసంస్థకు ప్రతి ముఖ్యపట్టణమునను శాఖ లుండెడివి. సింహవిక్రమపురము (నెల్లూరు) లోని అయ్యావళీపుర వర్తకప్రముఖులైన బలిజవారినిగురించి చెప్పిన పద్యములలోని పాదములు పైనిచ్చినవి. ఈ యయ్యావళీ వర్తకసంస్థకు ఒక జెండా యుండెడిది; ఒక ప్రత్యేకజంత్రవాద్యముండెడిది; వారికి కాలక్రమమున పెరుగుచువచ్చిన గొప్ప బిరుదగద్య మున్నది. ఈ వర్తకసంస్థకు వీరబలంజసమయ మని నామాంతరము. వీరబలంజవా రనగా వీరులయిన బలిజవారని యర్థము. తమ సంస్థకు కాని, తమ వర్తకవ్యాపారమునకుగాని సౌకర్యములు కూర్చునట్టి, ఉపకృతి చేయునట్టి వారిని ఈ సంస్థవారు అనేకవిధముల బహూకరించుట కలదు. ఈ బహూకృతివిధములలో బిరుదములిచ్చుట ఒకటి. ప్రాచీనకాలమున మహారాజులిచ్చునట్టి బిరుదములకును, మతాచార్యు లిచ్చునట్టి బిరుదములకును ఎంతటి విలువ యుండెడిదో ఈ యయ్యావళీసంస్థ, ఈ వీరబలంజసమయమువా రిచ్చునట్టి బిరుదములకును అంతటి సమానమైన ఆధిక్యము, విలువ యుండెడివి. వీ రొసగునట్టి బిరుదము లన్నిటిలో గొప్పది, అరుదైనది, వీ రొసగు బహూకృతు లన్నిటిలో గొప్పది పృథివీశెట్టి అను బిరుదసత్కార ప్రదానము. ఇంచుమించుగ ఈ పృథ్వీశెట్టి బిరుదము ఇప్పటి బిరుదములతో పోల్చవలెనన్న అది Lord Mayor of the Earth వంటిదిగ పరిగణించి చెప్పవచ్చును. ఈ బిరుదమును వీరబలంజసమయమువారు మహారాజులకును, మండలేశ్వరులకునుగూడ నిచ్చుట కలదు. ఇప్పటి మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణాది బిరుదములకు, ఆ బిరుదమును గుర్తించుటకు ఎట్లు కొన్ని లాంఛనము లుండునో అట్లే ఈ పృథ్వీశెట్టి బిరుదమునకును గలవు. ఈ లాంఛనములలో కొన్ని సత్కారవిశేషములును (Privileges and honours) ఉండును. పృథ్వీశెట్టి బిరుదాంచితుడు ఏ దేశమున కరిగినను, ఏయూరికి, ఏనగరమునకు వెళ్లినను అచ్చటి వీరబలంజసమయమువారు ఆ సత్కారవిశేషము లాతనికి జరుపవలసినదే. అది దేశకట్టడి!

యుద్ధసమయములందు ఈ వర్తకసంస్థలవారు అవసరమయినచో సైన్యమున జేరి తమ పరాక్రమమును జూపి విక్రమించి తమ ప్రభువునకు జయముగూర్చి క్రొత్త బిరుదములను, గౌరవ విశేషములను బడయుచుండిరి. ఈవిధముననే ఈసమయమువారి బిరుదగద్యము రానురాను పెరుగుచువచ్చినది. అందువలననే ఈసమయమువారు వీరబలంజులైనారు.

ఈ వర్తకసంఘమున కంతటికి రాయన భాస్కరుడు గురువు. రాయన భాస్కరుడన్న పేరు శ్రీశంకరాచార్యులవంటిదే. స్మార్తులగురువు ప్రతివానికి శంకరాచార్యులను పేరున్నట్లే వర్తకశిఖామణుల గురువు ప్రతివానికి రాయనభాస్కరు డని పేరు. ఇది

ఆ గురుపదమునకు పరంపరగా వచ్చు నామము. తమ గురువునకుకూడ ఈ వర్తక సంఘమువారు తాము చేయగలిగిన గొప్ప గౌరవము, తాము ఈయగలిగిన గొప్ప బిరుదమును ఇచ్చి సత్కరించి గౌరవించినారు. దానంజేసియే రాయసభాస్కరు లను పేరు వహించినవర్తకకులగురువులందరు పృథ్వీసెట్టి రాయసభాస్కరులే. రాయస భాస్కరుడు బ్రాహ్మణుడు; అయినను పృథ్వీసెట్టి బిరుదాంచితుడే. ఈ పృథ్వీసెట్టితనము అరుదుగా లభించు మహాగౌరవము.

ఈ వీరబలంజసమయమువారు ముప్పదిరెండు వేలానగరము (కరపట్టణము-port) లలోను, పదునెనిమిది మహానగరములలోను, అరువదినాలుగు యోగపీఠస్థానములలోను, అరువది నాలుగు ఘటికాస్థానములలోను వర్తకవ్యాపారము చేయువారు. వీరు తమ కులములకు, తమ వర్తకమునకు వర్తకసంస్థకు సంబంధించిన వ్యవహారములను కులసభ ద్వారా, లేక సమయమువారి సభద్వారా పరిష్కరించుకొనువారు. వీరి కులమునకు సంబంధించినట్టికాని, వర్తకవ్యాపారమునకు సంబంధించినట్టికాని వ్యవహారములను పరిష్కరించుకొనుటలో వీరికి సంపూర్ణస్వాతంత్ర్య ముండెడిది. దేశమును పరిపాలించు ప్రభువు అట్టివాటిలో నేమాత్రమును జోక్యము కలిగించుకొనెడివాడు కాడు. కుల వ్యవహారములనుమాత్రమే కాక వారసత్వమునకు, ఆస్తికి సంబంధించిన వ్యవహారములనుకూడ ఈ సమయమువారు ధర్మాసనములకు (న్యాయస్థానములకు) పోవనక్కర లేకయే, ప్లీడర్లను పెట్టకొనవక్కరలేకయే తమ వివాదములను తామే సమయసభ సమావేశపరిచి అందు పరిష్కరించుకొనువారు. సమయమువారిచ్చు తీర్పుకు వాది ప్రతివాదు లుభయపక్షముల వారును బద్ధులు. ఎవ రాతీర్పుకు బద్ధులు కాకపోయినను వారిని త్రోవకు తెచ్చుట ఎట్లో సమయము వారికి దెలియును. సమయద్రోహులకు శిరశ్ఛేదము విధించుటకుకూడ ఒకప్పుడు సమయమువారికి అధికార ముండెడిది. అట్టి సందర్భములలో సయితము రాజు కలుగజేసికొని శిక్ష తప్పించుటకు అతనికి అధికారము లేకుండెను. అంతటి మహానిరంకుశులు సమయమువారు సమయవ్యవహార పరిష్కారమునకు సంబంధించినంతవరకు. అందువలననే ఈ వీరబలంజ సమయమువారికి వీరశాసను లని బిరుదుపేరు. కొన్నికొన్ని కాలములలో వీరి పలుకుబడి మరియు నధికముగ నుండెడిది. మహారాజులుకూడ వీరి చేతిలోనివారు. అవసరమైనప్పుడు కొన్ని సందర్భములలో గొప్పగొప్ప అయ్యావళిసెట్లు మహారాజులకుకూడ ఋణప్రదాతలు (Bankers) గా వ్యవహరించి అంతటి పలుకుబడి సంపాదించుచువచ్చిరి.

అయ్యావళీవర్తకప్రముఖుల మహాసభ సాధారణముగా ఏ దివ్య క్షేత్రముననో అచ్చటి స్వామికల్యాణమహోత్సవసందర్భమున తిరునాళ్లలోగాని, వసంతమహోత్సవసందర్భమునగాని ఆ స్వామిముఖమండపముననో, అమ్మవారి మండపముననో, లేదా కల్యాణ మండపముననో సమావేశమగుచుండెడిది. 'దేశాయిసెట్టి' వ్యవహారపరిష్కారమున న్యాయాధిపతిగ వ్యవహరించును. 'ధనపాలదేశాయిసెట్టి' అని ఇతనికి నామాంతరము. పదునెనిమిది సమయముల వారిమీద నిత డధికారి; వారివ్యవహారములను పరిపాలించు న్యాయపరిపాలకుడతడు.

# పరిశుభ్రతకు పూచీ

తాము తయారుచేసే సరకుల్లో అతి అమితమైన పరిశుభ్రత ఉండేటట్లు చూడటం పెప్పర్‌మింట్లు వగైరా తయారుచేసే ప్రతివారికీ విధి. స్వీట్సు అపరిశుభ్రంగా ఉంటే, హాని చేస్తవి. స్వీట్స్ ఎక్కువగా తినేది చిన్నపిల్లలు. అందువల్ల తమ సావరిన్ స్వీట్స్ ప్రతిదీ కూడా అమితపరిశుభ్రంగా ఉంటుందని కె.సి.పి.వారు గట్టిగా చెబుతున్నారు.

దేశమంతా ఆదరించబడిన



## సావరిన్ స్వీట్స్

కె. సి. పి. తయారి

వీరబలంజసమయమునకు ఒక లాంఛనము-సమయలాంఛనము (Ensign of the Vira Balanja Corporaticn) కలదు. దానిపేరు 'వజ్రబైషిగ'. దీనినే వ్యవహారమున 'వజ్రబైసుగ', 'వజ్రబైసిగ', 'వజ్రభైషిగ' అందురు. ఈ సమయమునకు సంబంధించిన ఏవిధమైన వ్యవహారము పరిష్కరించుటకు సమావేశపరిచిన సభయందయినను ముందు ఈ 'వజ్రబైషిగ' ప్రతిష్ఠితము కావలెను. అది లేని సభలోని నిర్ణయములు ధర్మనిర్ణయములుగ సంగీకరింపబడవు. స్టాంపుకు రాజముద్రిక ఎట్టిదో, రాజునకు రాజదండమెట్టిదో వీరబలంజసమయమునకు 'వజ్రబైషిగ' అట్టిది- రాజు మొహరువంటిది; అంతటి ప్రాముఖ్యమైనది. వ్యవహారపరిష్కారము చేయునపుడు దేశాయిసెట్టిముందు ఈ లాంఛనమును ప్రతిష్ఠింతురు. తరువాత అభియోగము విచారణ జరుగును. గొప్ప ధర్మాసనములలోకూడ ప్రాచీనకాలమున ఇతని తీర్పుకు చెల్లుబడి ఉండెడిది. జాన్ కంపెనీవారు (మన కుంఫిణీ ప్రభుత్వమువారు) ఆదిలో స్థాపించిన కోర్టులలోకూడ దేశాయి సెట్టితీర్పు మన్నింపబడెడిది.

ఈ వజ్రబైసుగ త్రెడ్డువంటి వస్తువిశేషము-గరిటెవంటిది. త్రెడ్డు వెలుపలిభాగపు అంచులమీద పదునెనిమిది సమయముల వారి లాంఛనములు నుండును. మొత్తము వీరబలంజసమయమున కున్నట్లే దానిలోని అంతస్సంఘములైన పదునెనిమిది సమయములకు ఒక్కొక్క సమయమునకు ఒక్కొక్క లాంఛనముచొప్పున వృత్తి, వర్తక వ్యాపారములను దెలుపు పదునెనిమిదిలాంఛనములు తిన్నవి. ఒక్కొక్క లాంఛనము ఒక్కొక్క వృత్తి, వర్తకవ్యాపారమునకు సంకేతము. హిందూసామాజికజీవనము సరళముగ సాగిపోవుటకును, దేశమున ఆహారపదార్థసంపాదన, వినియోగములు ఉచితరీతిని జరిగి జను లందరు సుఖించుటకును అవసరమైన వృత్తి, వర్తకవ్యాపారములను దెలియజేయు సంకేతము లవి- ఆ పదునెనిమిది సమయముల లాంఛనములును. ఒక్కొక్క లాంఛనప్రతిమక్రింద అది ఏ కులమునకు, ఏ సమయమునకు సంకేతమో ఆ కులము-సమయముపేరు చెక్కియుండును. దేశాయి సెట్టి 'వజ్రబైసుక' తన ముందు ఆ సమయ మహాసభలో ప్రతిష్ఠించెనన్న తాను ఆ పదునెనిమిదిసమయములకు ప్రతినిధిపాలకుడ ననుటకు సంకేతము. అందువలననే త్రెడ్డు వంటి ఈ లాంఛనములేని సభలో చేసిన ఏ ధర్మనిర్ణయమును చెల్లునది కాదు; చెల్లనేరదు.

ఈ 'వజ్రబైసుక' ఆర్థికసమృద్ధి, వినియోగములకు హిందువులు ఏర్పరిచిన దివ్య సంకేతము. కాశీ అన్నపూర్ణాదేవి ఆహారవస్తు సామగ్రిని సేకరించి నిత్యము అతిథిఅభ్యాగతులకు లేదనకుండ సంతర్పణచేయునట.

> శ్రీవిశాలాక్షిబంగారుత్రెడ్డునందు
> నమృతపాయస మొసగు నభ్యాగతులకు,
> గాశికాపురి మధ్యాహ్నకాల మనగ
> వినియు వెలుగవె యాతిథ్యవేళలందు.

'వజ్రబైషిగే' శ్రీ కాశీవిశాలాక్షీబంగారు త్రెడ్డు. అది సర్వసంపత్సమృద్ధి సంపాదన, సంప్రదానసంకేతము గనుకనే శ్రీవిశాలాక్షీ మహాదేవి నిత్యము దివ్యాన్నభిక్షయొసగ గలుగుటకు కారణము. అద్భుతమును, దివ్యము నైనదికదా ఈ భారతీయ వీరబలంజ సమయలాంఛనసంకేతము! అది ఎంత అర్థవంతమైనది! ఇతర దేశములలో ఏదీ యిట్టి సంకేతము?

# దేశంకోసం

✵

— శ్రీ రా. సీ. ఆంజనేయశాస్త్రి —

"అమ్మా!..."

"..."

"అమ్మా!... ఎలా వుంది?...చూడు..."

"...ఊఁ!...ఊఁ!!..."

"కళ్లు తెరవలేవూ?...నేను విశ్వాన్ని..."

అమ్మ మొహంలో సంతోషరేఖ తళుక్కుమంది. అతికష్టంగా కనురెప్పలు విప్పుతూ "......వచ్చావా నాన్నా!..."అంది అస్పష్టంగా. విశ్వం యింకా దగ్గిరికి జరిగి "...కొంచెం తేలికగా వుందా అమ్మా!!" అని ప్రశ్నించాడు. మీద చెయ్యి వేద్దామని కుడిచెయ్యి ఎత్తబోయేసరికి అమ్మకి పంచప్రాణాలూ పట్టుకుని లాగేసినట్టనిపించింది ఎముక విరగటంవల్ల. ఆ యమబాధ కొడుక్కి కనపడనీయకుండా వుండాలని ఎంత ప్రయత్నించినా, మూలుగుమాత్రం పైకి రాకుండా ఆపుకోగలిగింది తప్పితే కనుకొలకుల్లోంచి దాచలేకపోయింది. అనకేంమాత్రం "ఆఁ!...కొత్త నరకమే!...నాన్నా..."అంది.

"దాస్తున్నావా అమ్మా?...అమ్మబాబోయ్!... ఇదేమిటే యింత వాచిందీ చెయ్యి?..." అంటూ విశ్వం కట్టు విప్పుతుంటే, ఆయాసపడుతూ పరిగెత్తుకొచ్చిన రామం గుమ్మాన నిలబడిపోయాడు. విశ్వంకంటే ముందుగానే అమ్మ "...ఏం నాన్నా? అంత హడావిడిగా వచ్చావు, ఏం జరిగింది?..." అని ప్రశ్నించింది. కుడిచెయ్యి బాధపడుతూ సలుపుతుంది. రామం సార్థకంగా విశ్వంకళ్లల్లోకి చూశాడు. అమ్మ ఆదుర్దాగా "...చెప్పు నాన్నా...చెప్పు...భయంలేదు...నాకు తేలిగ్గానే వుంది...భయపడకు..." అని తొందరచేస్తుంటే రామంకు చెప్పక తప్పలేదు "పోలీసుమూక ముట్టడివేసింది. ఇళ్లల్లో జొరబడటమే కాదు...లాఠీలతో బాదటమే కాదు...అదృష్టవశాత్తు నేను ఊరుబైటి చెరువుగట్టున వుండటంచేత యిలా పరిగెత్తుకొచ్చి మీకు చెప్పగలుగుతున్నా..." అన్నాడు.

అమ్మకి ఆవేశం ఎక్కువైంది. "ఇళ్లల్లో జొరబడుతున్నారూ?...మనుష్యులు లేరా అక్కడ?... పడదాం పదండి"అంటూ లేవబోతుంటే, విశ్వం పట్టుకొని ఆపాడు. మోకాటిచిప్పకూడా చితక కొట్టారయ్యో! పాపం ఎలా లేస్తుంది?!

"జనం ఎలా వున్నారు?"అని అడిగాడు విశ్వం.

"మంచి ఉద్రేకంగా వున్నారు. బహుశః యీపాటికి కాల్పులదాకా కూడా వచ్చిందేమో!" అని రామం అంటూండగానే తుపాకి పేలుడు వినిపించింది.

"అమ్మో, మొదలెట్టారు...ఇక మీరు రాకపోతే సర్వనాశనమే! శ్మశానం చేసి వదల్తారు పోలీసులు" అని అరిచాడు రామం.

"చివరిక్షణాలుకూడా అమ్మదగ్గిర వుండలేకపోతున్నానే!..." అన్నాడు విశ్వం గంభీరంగా.

తుపాకీశబ్దం వినగానే కలిగిన ఉద్వేగంలో స్పృహతప్పినట్లు పడివున్న అమ్మ కొంత సేదదీరగానే "...ఇంకా యిక్కడే వున్నావట్రా?...ఈ ముసలిముండకోసం?...నేను చావనులే...చచ్చినా ఫరవాలేదులే...పోండి...నాపిల్లలు...నాదేశం...... అదిగో తుపాకీగుండ్లు...వాళ్లు లొంగిపోతారేమో?... వెళ్లండి...నాన్నా...వెళ్లండి..."

కాసిని నీళ్లుమాత్రం నోటిదగ్గిరిగా పెట్టి, అమ్మ కాళ్లని కళ్లకద్దుకుని వెళ్లిపోయారు విశ్వం, రామమూను ఆసుపత్రిఆవరణ దాటి.

౨

నిశాపిశాచపు నక్రదంతమల్లే వున్న ఆ కాలిదోవన వాళ్లిద్దరూ గ్రామం సమీపించారు పరిగెత్తినట్లు నడిచి. రాత్రి కార్చిన కన్నీటిచుక్కలల్లే నేలంతా నెత్తురుచుక్కలు కనిపిస్తున్నాయి. మృత్యువునిట్టూర్పల్లే రెల్లుగుబ్బుల్లోంచి వచ్చిన గాలి నెత్తురులోని తడిని ఆరేస్తోంది. ఆ గుబ్బుల్లోంచే వస్తున్న మూలుగు ధ్వని, నరరక్తసిక్తమైన సైకతంలో పోలీసుబూట్ల జాడాల ముద్రలు చూసి అమాంతం ఆగిపోయింది ధీరత్వంతో. ఆదుర్దాగా విశ్వం గుబ్బులోకి తొంగిచూసేసరికి ఆకాశంలోంచి కిందపడ్డ నక్షత్రంలాగా మంగళసూత్రం మెరుస్తోంది.

"కల్యాణీ!" అని అప్రయత్నంగానే విశ్వం నోట్లోంచి వెలువడింది. గాఢంగా కావిలించుకున్న కనుగప్పుల్ని చీల్చుకుంటూ మిలమిలలాడే రెండుకళ్లు ఆ పరిచితధ్వని వచ్చినవైపుని వెతుక్కున్నాయి... విశ్వం ఆమెని చేతికి తీసి యిసుకమీద పడుకోబెట్టి నిర్ఘాంతపోయాడు. కన్నీ రాపుకోటం అశక్యమైంది. కల్యాణిపమిటచెంగంతా ఆమెరక్తంతోనే తడిసిపోయింది. ఒక తుపాకిగుండు దూసుకుపోయింది కుడి రొమ్ములోంచి. ఉత్తరీయం చించి కట్టుకట్టారు. కాని ఏం లాభం! ఆ సమయంలో భర్తని చూడగలిగినందుకు ఆశ్చర్యాన్నీ, భర్తసాన్నిధ్యంలో తనువు చాలిస్తున్నందుకు తృప్తినీ కనపరుస్తూ రెండుచేతులూ ఎత్తబోయి వాల్చేసింది. బలిదానదీప్తిని తమలోనే యిముడ్చుకుంటూ నేత్రాలు రెండూ మూసుకున్నాయి......

శవాన్ని భుజానేసుకుని వస్తున్న విశ్వాన్నీ, అతని వెనకాలే లక్ష్మణుడల్లే నడుస్తున్న రామాన్నీ చూసి ఊళ్లో స్త్రీలంతా గొల్లున ఏడ్చారు. ఏడుస్తూనే జరిగిందంతా చెప్పారు. వచ్చీరావటంతోటే పోలీసులు ఇళ్లల్లో జొరబడి "ఏడీ విశ్వం?... ఎక్కడ రామం? ... కల్యాణి ఎవరు?..." అంటూ, నానాదుర్భాషలూ ఆడటం మొదలెట్టారు. చేతికందినవారిని లాఠీలతో మోదసాగారు. మీ సంగతి మాకు తెలీదుకదక తెలీదని చెప్పాము! 'నేనే కల్యాణిని' అంటూ యీమె ముందుకొచ్చింది. ఆమెమీద చెయ్యి వెయ్యబోయేసరికి జనం ఉద్రిక్తమైంది. పోలీసుల చేతుల్లోంచి లాఠీలు లాక్కున్నారు. వాళ్లు కాస్త జంకేసరికి ఊరుబైటికి తరిమారు పోలీసుల్ని కల్యాణి ఎంత చెప్పినా వినకుండా. ఇంతలోకే తుపాకులతోసహా రెండోలారీ వచ్చింది. ఏదో జయించామనే ధీమాలో ఉన్న జనంమీద గుండ్లవర్షం కురిపించారు...కల్యాణిని లారీలో ఎక్కించుకు పోవటం చూశాం...కాని దారిలో లారీలో ఏం జరిగిందో ఏమో!!"

ఇంతసేపూ కొయ్యబొమ్మల్లే నిలబడివున్న విశ్వానికి మతిచలిస్తుందో, గుండె ఆగిపోతుందో అని భయపడుతున్నాడు రామం. క్షణకాలం నిస్తబ్ధత భయపెట్టింది. మందహాసం చేస్తూ "కల్యాణి పోయినదారి కనిపిస్తోందికదూ?" అన్నాడు విశ్వం. అవునన్నట్టుగా అంతా నిశ్శబ్దంగా నుంచున్నారు.

"కల్యాణి వద్దంటున్నా పోలీసుల్ని తరిమికొట్టారు మీరు...!" అని ఆవేదనపడ్డాడు విశ్వం.

"ఆ తల్లిమీద ఆ రాక్షసి చెయ్యివెయ్యబోయేసరికి మా నెత్తుర్లు పొంగాయి" అన్నాడు ఓ శతవృద్ధు.

"అందుకనే కాల్పటానికి సందు చిక్కింది." అని నచ్చచెప్పబోయాడు విశ్వం.

"వారంరోజుల క్రితం ఊరుకుంటేనేగదాండి, మీ అమ్మగార్ని నలగబాదిచేశారయ్యో!..." అని ఒక యువకుడు ఉద్రేకంతో అడిగాడు.

"అయినా అప్పుడిన్ని ప్రాణాలు పోయాయా తమ్ముడూ?" అంటూంటే విశ్వం కళ్లల్లోంచి రెండు అశ్రుకణాలు రాలాయి.

౩

రుధిరప్లావితమైన అరుణాంబరాన్ని ప్రాక్పటిక లోంచి తీస్తోంది ఉషాకన్య. ఇంటిలోకి అమ్మమరణ

వార్తని మోసుకొచ్చింది ఆసుపత్రి నర్సు. ఆ దుఃఖాన్ని మింగటానికి రాత్రినుంచే సిద్ధపడుతున్న విశ్వం అత్తే స్వస్థత పొందలేదు. ఎంత చెప్పినా వినకుండా కల్యాణి శవాన్ని ఊరేగించితీరాలని పట్టుపట్టారు గ్రామస్థులు. పోలీసు లెంత రెచ్చగొట్టినా దౌర్జన్యానికి దిగకుండా వుంటే ఊరేగింపుకు ఒప్పుకుంటా నన్నాడు ఆఖరికి విశ్వం. అమ్మమరణవార్త కొత్తదిక్కుని తెచ్చిపెట్టింది. నిర్బంధంలో వుండగా మరణించడంవల్ల, అమ్మశవాన్ని అప్పజెప్పటానికి అధికార్లు అంగీకరించలేదు. మళ్లా ఘర్షణ చెలరేగేటట్టు కనిపిస్తోంది. పట్నం జనంకూడా అస్పత్రిచుట్టూ యిసక వేస్తే రాలకుండా మూగారు. టెలిఫోనుమీద ఏం మంతనాలు జరిగాయో ఏమో, బారెడు పొద్దెక్కాక, అమ్మశవాన్ని ప్రజల కప్పగించారు అధికార్లు. బ్రహ్మాండమైన ఆ ఊరేగింపులో శాంతిభద్రతల్ని కాపాడటానికి రక్షకభటులు సిద్ధమయ్యారు. అమ్మనీ, కల్యాణినీ అతిదారుణంగా హత్యచేసిన ఆ పోలీసులే మళ్లా ప్రత్యక్షమయేసరికి ప్రజల ఆవేశాలు ఆకాశాన్నంటాయి. "శాంతికి భంగం కలగరాదని నిజంగా కోరేటట్లయితే, పోలీసుల్ని వెళ్ళిపొమ్మనండి"అని విశ్వం అధికారులకి చెప్పాడు స్వయంగా వెళ్లి. అంతకుపూర్వమే వారంట్లు జారీ చెయ్యబడినాకూడా, ఆ సమయంలో విశ్వాన్ని అరెస్టు చేసే సాహసం లేకపోయింది వాళ్లకు. విధిలేక పోలీసుల్ని తొలగించారు ఊరేగింపులోంచి...దారిపొడుగునా ఆ అమరజీవులమీద పూలవర్షం, అశ్రువర్షం కురిపించారు ప్రజలు. రెండు శవాల మధ్య నడుస్తున్న విశ్వం మొహం ఉద్రిక్తపడుతున్న జనసమూహాన్ని శాంతింపజేస్తోంది. స్వర్గధామంచేరుకుంటున్న అత్తాకోడళ్ల ఆత్మలు ఏమిటో మాట్లాడుకుంటున్నాయి దార్లో గుర్తులు పెడుతూను......

స్మశానంలో విశ్వం అందరిచేతా "దేశంకోసం సర్వస్వం అర్పిస్తాం"అని ప్రమాణంచేయించాడు. జనమంతా ఎవరిళ్లకి వాళ్లు వెళ్ళింతర్వాత, విశ్వాన్ని అరెస్టు చెయ్యటానికి రెండులారీల్లో సాయుధులైన పోలీసులూ, అధికార్లూ వచ్చారు. కాళ్లకీ చేతులకీ సంకెళ్లు వేసి విశ్వాన్ని తీసుకుపోతుంటే ప్రజలు నిర్ఘాంతపోయారు. ఇంతకీముందేగా, శాంతిభద్రతల్ని కాపాడటానికిగాను విశ్వాన్ని ఊరేగింపులో ఉండనిచ్చింది! రామంమాత్రం అందలేదు. అప్పటికప్పుడే ప్రత్యేక రైలులో విశ్వాన్ని ఎక్కడికో తీసుకుపోయారు.

తరవాత రెండునెలలకి తెలిసింది, పోలీసులకి అందకుండా తప్పించుకుపోతుంటే, రామాన్ని కాల్చి చంపారని !!



# విద్యుల్లోకము



— శ్రీ వేలూరి శివరామశాస్త్రి —

3

భూలోకమునుండి బ్రహ్మలోకమునకుఁ బోవువారి దారిలో నొక విద్యుల్లోకము[1] కనఁబడుచున్నది. ఇది భాస్కరుఁడు చెప్పిన పంద్రెండు యోజనముల పైదిగాని, నవీన వైజ్ఞానికులు చెప్పిన పదునాలుగు యోజనముల పైదిగాని కాదు. ఈ విద్యుల్లోకము సూర్య చంద్ర లోకముల కావలనున్నది.

## రెండు దారులు

గ్రామమునం దగ్నిహోత్రాదికమగు వైదిక కర్మనుగాని, సప్తసంతానములు మొదలగు పుణ్యకర్మలనుగాని చేసినవారు చంద్రలోకమును బొందుదురు. దహరాది విద్యోపాసకులు బ్రహ్మలోకమును బొందుదురు. చంద్రలోకమునకుఁ బోవు దారిపేరు పితృయాణము. బ్రహ్మలోకమునకుఁ బోవుదారి పేరు దేవయానము.

## పితృయాణము

ధూమము[3] ఉత్క్రాంతి చెందిన జీవుని రాత్రి[4] కడకుఁ దీసికొనిపోవును. ఆ రాత్రి కృష్ణపక్షము కడకును, అది దక్షిణాయనము కడకును, అది పితృలోకము కడకును దీసికొనిపోవును. ఈ జీవుఁ డటనుండి భౌతికాకాశమును, దానినుండి చంద్రలోకమును[5] జెందును. ఎవఁడు దేవతల కన్నమో, ఎవనిని దేవతలు భుజింతురో ఎవనికి ద్విజరాజని ప్రసిద్ధి కలదో, మఱి యెవఁడు మన కంతరిక్షమునఁ గనఁబడుచున్నాఁడో అతఁడే యీ చంద్రుఁడు. అచట నీ జీవుఁడు ఉదకమయమగు శరీరము దాల్చి కర్మక్షయమగునంతవఱకును సుఖముండి పిదప నాకాశమును, వాయువును బొంది మఱల వానగా[6] నేలమీఁదికి వ్రాలును.




1. తస్య హైతస్య హృదయాగ్రం ప్రద్యోతతే.... ౬-౪-౨. విద్యుద్బ్రహ్మేత్యాహుః ౫-౭-౧ బృహ.

2. ఆదిత్యా చ్చంద్రమసం, చంద్రమసో విద్యుతమ్. ఛాందో. ఈ చంద్రలోకము వేఱు.

3. ధూమము=ధూమాభిమాని దేవత.

4. రాత్రి=రాత్ర్యభిమాని దేవత. ఇటులే ముందును గ్రహించునది.

5. ధూమా ద్రాత్రిం రాత్రే రపరపక్ష మపరపక్షా ద్యాన్ షడ్దక్షిణై తి మాసాం స్తాన్నైతే సంవత్సర మభిప్రాప్నువన్తి. మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశా చ్చంద్రమస మేష సోమో రాజా తద్దేవానా మన్నం తం దేవా భక్షయన్తి. ఛాందోగ్య ౫-౧౦-౪.

6. ఛాందోగ్య బృహదారణ్యకములు. బ్రహ్మసూత్ర ౩-౧-౪.

## నాడీ రశ్మి సంబంధము

ఉత్క్రాంతిసమయమున దహరాది విద్యోపాసకుల హృదయము జ్వలించును. పుండరీకాకారమును, బ్రహ్మోపాసనస్థానమును అగు హృదయమునుండి చాల నాడులు7 సూర్యునుండి కిరణముల చందముగా శరీర మంతటను వ్యాపించియున్నవి. వీనిలో కొన్ని పింగళ మును, సూక్ష్మము నగు రసముచే నిండి పింగళములుగా నుండును. మఱి కొన్ని తెలుపు నలుపు పసపు ఎఱుపు రంగుల రసముచే నిండి తెల్లగను, నల్లగను, పచ్చగను, ఎఱ్ఱగను ఉండును. సూర్యుఁడుగూడ పింగళుఁడు, శుక్లుఁడు, నీలుఁడు, పీతుఁడు, మఱియు లోహితుఁడు.

దూరముగాఁ బోవు నొక ఘంటాపథము అన్ని గ్రామములను, అన్ని పత్తనములను ముట్టుచుఁ బోవు నటులు ఈ సూర్యకిరణములు ఈ లోకము నాలోక మునుగూడ ముట్టుచుఁ బోవును. ఈ కిరణములకు రేయుంబవలను భేదము లేదు. వాని కందఱయు నాడులతో సంబంధము కలదు. బ్రహ్మలోక మేఁగు వారు రేయుంబవళ్లను భేదము లేక యీ రశ్ములగుండ ఊర్ధ్వ మాక్రమింతురు.

## దే వ యా న ము

ఈ మార్గమునకు అర్చిరాదిమార్గ మనియు పేరు. దహరాది విద్యోపాసకులైన జీవులను అర్చిరభిమాని దేవత అహరభిమాని దేవతకడకు8 మోచికొనిపోవును. అది వీరిని శుక్లపక్షో త్తరాయణదేవతలకడకు9 మోచికొని పోవును. వారు వీరిని సంవత్సరాభిమాని దేవతకడకుఁ జేరవేయుదురు. అది వీరిని దేవలోకమునకుఁ దీసికొని పోవును. అటనుండి వీరు వాయులోక మేఁగుదురు.10 అది వీరికి బండిచక్రపు కన్నంత బిలము విడుచును వీ రాబిలముగుండ ఆదిత్యలోక మరుగుదురు. అది వీరికి లంబర వాద్యపు కన్నంత బిలము11 విడుచును. వీ రట నుండి చంద్రలోకము మెట్టుదురు. అది వీరికి దుందుభి కన్నంత బిలము12 విడుచును. వీ రాబిలమునఁ బడి విద్యుల్లోకము చేరుదురు13. అమానవుఁడగు పురుషుఁ డొకఁడు అటనుండి వీరిని వరుణేంద్ర ప్రజాపతుల లోక ముల 14మీఁదుగా బ్రహ్మలోకమునకుఁ గొంపోవును. అనఁగా ప్రాణమును వశపఱచికొనినవారు మృత్యువు వాకిట నుండఁగా నిచ్చెనమెట్లమీఁదనుండి మేడమీఁది కెక్కు నటులు సుషుమ్నగుండ శిరస్సు నెక్కి బ్రహ్మ

---

7. ఉపనిషత్తులలో కొన్నియెడల నాడులు నూఱు లును వేలును గలవు. అవి వెంట్రుకలకంటె సన్ననివి. తంత్రము నాభిక్రింద పదునాలునాడులు కల ఒక నాడీచక్ర మును చెప్పెను. యోగులు మేరుదండము ప్రక్కల శాఖా ప్రశాఖాసమేతమగు ఇడా పింగళా సుషుమ్నలను నాడిచక్ర మనిరి (Plexsus). Radial Artery పట్టుకొని చూచుట నాడీపరీక్షయని ఆయుర్వేదవైద్యుల వాడుక. శిరా ధమనీ స్నాయునాడుల కేకార్థమున లోకుల వాడుక కలదు. శిరా=Vein· ధమని=Artery అని ఆంగ్లకోశము. నాడికిని స్నాయువునకును Nerve అని కొందఱు వాడుచున్నారు. డాక్టర్లు దీని కొప్పరు. నాడులు రక్తశక్తివాహకములు. చూ. ౨-౧-౧౯ బృహ. శాం. భాష్య. Nerve లు అట్టివి కావు. అవి మస్తిష్క-జ్ఞాన-చేష్టా-ప్రేరణములమాత్రమే వహిం చును. ఈ చిక్కునుండి 'నాడిని' విడఁదీయుటకు చిక్కువడి కలకత్తా విశ్వవిద్యాలయపారిభాషికసంఘమువారు Nerve ను నెర్వ్ అనియే భాషాంతరీకరించిరి.

8. తే ర్చిష మభిసంభవన్తి. ఛాం. 'అగ్నిం ప్రాప్య తత శ్చార్చి స్తతశ్చా వ్యహరాదికమ్' నారదీయ. 'దివాది దేవతాభిస్తు పూజితో బ్రహ్మ యాతి హి' బ్రాహ్మ.

9. పూజిత స్త్వయనే నాసౌ మాసైః పరివృతేన హి. గారుడ. సాహ్నా మధ్యందినే నాథ శుక్లేన చ సపూర్ణిమా. సవిష్వా చాయనే నాసౌ పూజితః కేశవం వ్రజేత్. బ్రహ్మవైవర్త.

10. చూ కౌషీ. బృహదారణ్యకములు.

11. లంబరస్య ఖమ్.

12. దుందుభేః ఖమ్. ఈ చంద్రలోకమువంగతి ఛాందోగ్యమునఁ గలదు. బృహదారణ్యకమున నెనిమిదవ అధ్యాయమున లేదు. ఐదవ అధ్యాయమునఁ గలదు. దీని వివరణ మచటనే చూచునది.

13. ఛాందోగ్యము విద్యుల్లోకమునుండి బ్రహ్మలోక మున కొక గంతువేసెను. బృహదారణ్యకమును ౬-౨-౧౫ కూడ అంతియే.

14. 'స ఏతం దేవయానం పన్థాన మాప ద్యాగ్ని లోక మాగచ్ఛతి. స వాయులోకం, స వరుణలోకం, స ప్రజా పతిలోకం, స బ్రహ్మలోకమ్' కౌషీ. ౧-౩

రంధ్రమును భేదించి సుషుమ్నాగ్రమున నంటు సూర్య కిరణముల ననుసరించి అగ్నిలోకాదులమీఁదుగా బ్రహ్మలోకము చేరుదురు.

పితృయాణమునం దాదిత్యలోకము తగులదు. దేవయానమున ఆదిత్యలోకముమీఁదుగా చంద్రలోకము తగులును. కాని ఇది జ్యోతిశ్శాస్త్ర విరుద్ధమగుటవలన మఱొక చంద్రలోకమని కొందఱు వ్రాసిరి. మఱియు కైలాసవైకుంఠాదులును, మహర్జన తపో లోకములును పితదంతఃపాతు లని కొందఱు వ్రాసిరి. ఇది యంతయుఁ గలిసి బ్రహ్మాండ కటాహము.

## దేవపితృయానములకు మూలము

ద్వే సృతీ అశృణవం పితౄణా
మహం దేవానా ముత మర్త్యానామ్
తాభ్యా మిదం విశ్వ మేజ త్సమేతి
యదంతరా పితరం మాతరం చ.

(ఋక్. ౧౦-౮౮-౧౫)

—మనుష్యులకు దేవమార్గము, పితృమార్గము అని రెండు మార్గము లున్నవని వింటిని. తలిదండ్రులవంటి భూమ్యాకాశములనడుమ గతిశీల మగు నీ విశ్వ మెల్లయు ఆ రెండు మార్గముల బడి పోవుచున్నది.




అను నీ మంత్రము నుదాహరించి బృహదారణ్యకము దేవయాన మనియు, పితృయాణ మనియు 15 భేదము చేర్పఱచెను. ఛాందోగ్యముగూడ నీ రెండు మార్గములఁ జెప్పెను. ఈమంత్రమును తైత్తిరీయబ్రాహ్మ

---

15. కొందఱు ఈ మంత్రము దేవ మర్త్య మార్గపరమే కాని పితృయాణపరము కాదు. మర్త్యమార్గమే పిదపఁ బిదప పితృయాణముగా మాఱెను. ఋక్కులందు పితృయాణము దేవయానాంతర్గతము అని చెప్పుదురు. మంత్రమునందు 'దేవానా ముత మర్త్యానాం ద్వే సృతీ అహంపితౄణా మశృణవమ్; పితృసంబంధి శ్రవణమ్', అని వేఱు రీతిగా అన్వయింతురు.

ణము గ్రహించెను. ఆరెండ వినియోగసంగ్రహము 'సురాశేషం తు వర్త్మనో నతుతి ద్వే సృతీ ఇతి' అని చెప్పెను. వీనిని పురస్కరించుకొని వదపటి స్మృతి గ్రంథము లన్నియు ఈ రెండు మార్గములను ప్రవాత మొనరించెను.

## జ్యోతీరూపము

ముమ్మొదట విష్ణు వాయు మత్స్య పురాణము లీ దేవయానమునకు రూపకల్పన మొనరించెను. పిదప భాగవతాదులు వీని ననుసరించెను.

వైశ్వానరపథమునకు వెలుపల అగస్త్యునకు ఉత్తరముగా అజవీథికి దక్షిణముగా పితృయాణము, నాగవీథికి ఉత్తరముగా సప్తర్షులకు దక్షిణముగా ఉన్న సూర్యుని ఉత్తరమార్గము దేవయానము. 16

పథ మన నేమి? వీథి యన నేమి? ఒక్కొక్క గ్రహమునకు మూఁడేసి స్థానము లున్నవి. 17. ఉత్తరమున ఐరావతము. దక్షిణమున వైశ్వానరము. నడుమ జారద్గవము. ఈ మూఁడును పథములు, లేక మార్గములు. ఈ మూఁటికిని మరల మూఁడేసి వీథులు కలవు. ఒక్కొక్క వీథిలో మూఁడేసి నక్షత్రము లున్నవి.

వాయు విష్ణు పురాణములు ఈరెండ సమానము. మత్స్య పురాణము నూట ఇరువది నాలుగవ అధ్యాయము ౫౩ మొదలుకొని ౬౦ వఱకు చూచునది. అందు కొంచెము మార్పు కలదు.

నక్షత్ర వీథీ మార్గము లీదిగువ—

| నక్షత్ర | వీథి | మార్గ |
|---|---|---|
| అశ్విని, భరణి, కృత్తిక | నాగ | ఉత్తర మార్గ లేక ఐరావత పథ |
| రోహిణి, మృగశిర, ఆర్ద్ర | గజ | |
| పునర్వసు, పుష్య, ఆశ్లేష | ఐరావత | |
| మఘ, పూ. ఫల్గుని, ఉ. ఫల్గుని | వృషభ | మధ్యమ మార్గ లేక జారద్గవ |
| హస్త, చిత్ర, స్వాతి | గో | |
| విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ | జారద్గవ | |
| మూల, పూ. ఆషాఢ, ఉ. ఆషాఢ | అజ | దక్షిణమార్గ లేక వైశ్వానరపథ |
| శ్రవణ, ధనిష్ఠ, శతభిష | మృగ | |
| పూ. భాద్ర, ఉ. భాద్ర, రేవతి | వైశ్వానర | |

గర్గుని మతమున వీథీమార్గముల ప్రకారము భిన్నము. అది యీ దిగువ—

| నక్షత్ర | వీథి | మార్గ |
|---|---|---|
| కృత్తిక, భరణి, స్వాతి | నాగ | ఉత్తర మార్గ |
| రోహిణి, మృగశిర, ఆర్ద్ర | గజ | |
| పునర్వసు, పుష్య, ఆశ్లేష | ఐరావత | |

---

16. ఉత్తరం య దగస్త్యస్య అజవీథ్యా శ్చ దక్షిణమ్
పితృయాణం స వై పంథా వైశ్వానరపథా ద్బహిః.
(విష్ణు-౨-౮-౮౬-వాయు-౫౦-౨౦౮)
నాగవీథ్యుత్తరం యచ్చ సప్తర్షిభ్య శ్చ దక్షిణమ్
ఉత్తరః సవితుః పంథా దేవయాన శ్చ సస్మృతః.
(విష్ణు-౨-౮-౯౨. వాయు-౫౦-౨౧౬.)

భాగవతమునందును ఈ వీథ్యాదికము సమమే. ఈ భాగము తెలుఁగు భాగవతమున లేదు.

17. ఈ జ్యోతీరూప కల్పన కంతకును ఆధ్యాత్మికార్థము కొందఱు చెప్పిరి.

| నక్షత్ర | వీథి | మార్గ |
|---|---|---|
| మఘ<br>పూ. ఫల్గుని<br>ఉ. ఫల్గుని | వృషభ | మధ్యమ మార్గ |
| అశ్విని<br>రేవతి<br>పూ. భాద్ర<br>ఉ. భాద్ర | గో | |
| శ్రవణ<br>ధనిష్ఠ<br>శతభిష | జరద్గవ | |
| అనూరాధ<br>జ్యేష్ఠ<br>మూల | మృగ | దక్షిణ మార్గ |
| హస్త<br>విశాఖ<br>చిత్ర | అజ | |
| పూ. ఆషాఢ<br>ఉ. ఆషాఢ | వైశ్వానర | |

తరువాతఁదరువాత ఈ వీథీమార్గము లింకను మాఱుచువచ్చెను. భరణి మొదలు తొమ్మిది చుక్కలుత్తరమార్గ మనియు, పూ. ఫల్గుని మొదలు తొమ్మిది చుక్కలు మధ్యమ మార్గ మనియు, పూర్వాషాఢ మొదలు తొమ్మిది చుక్కలు దక్షిణమార్గ మనియు మఱియొక మత మని వరాహుఁడు చెప్పెను. తొల్లి యీ వీథీగణనమునందు కొండొక రీతి యుండెడి దనుటకు వాయుపురాణ మతకాళ మొసఁగుచున్నది. కాలభేదముచే సూర్యుని ఉత్తర మధ్యమ దక్షిణ మార్గముల ననుసరించి వీథీ మార్గ గణనము మార్పు చెందె ననుట సువిస్పష్టము.

విష్ణు వాయు మత్స్యపురాణములలోని దేవయాన పితృయాణ వర్ణనము అచ్యుతత్వాలు కాకతక్కిన దంతయు సమానమే. శ్లోక శరీరముగూడ సమానమే. ఈ మూఁటిలోనే రెండో ఒక పురాణము ననుసరించియుండవలయును. లేదా యీ మూఁటికిని ఆకరమే జ్యోతిస్సిద్ధాంతమో యైయుండవలయును. ఇది పరిశోధనకు విషయము.

ఈ యానములు రెండును సూర్యమార్గ మగు క్రాంతివృత్తమునందు రెండు భాగములు. పై పురాణములలో నాగవీథీ సప్తర్షుల స్థాన నిర్దేశము లేదు. వీని రెండింటికే అపాయము నెఱుకవలయును. దాని కిది తావు కాదు.

ఈ యానద్వయకల్పనాసమయమున ఆశ్లేష మూఁడవ పాదములోనో, మఘ మొదటి పాదములోనో ఉత్తరాయణము ముగియుచుండెడిది. ఏలనఁగా, 'మఘయే పితృదైవత్యముకావున విజ్ఞులు మఘలోనే పితృకార్యములు తీర్తు' రని వాయుపురాణము.

మానవసంవత్సరము దేవతల కహోరాత్ర మని పురాణములందును, జ్యోతిశ్శాస్త్రమునందును సుప్రసిద్ధము. మానవుల ఆఱు నెలలు దేవతల కొక పగలు. మఱియొక ఆఱు నెలలు రేయి. సూర్యుఁడు దేవయానమునందాఱు నెల లుండును. అపుడు దేవతలకు పగలు.

ఈ యుత్తర దక్షిణాయనముల ఆరంభ మెచట? విషువత్తు అని శ్రీ బాలగంగాధరులు.

విషువత్తొక నక్షత్రమునందే యుండదే. ఒకపుడే నక్షత్రమునందు విషువత్తుండునో మఱొకపు డచట అయననివృత్తి యగునే.

సూర్యుని ఉత్తర దక్షిణ మార్గము లెపుడు భేదించెనో అపుడు సూర్యుఁడు దక్షిణదిక్కునుండి ఉత్తర దిక్కునకుఁ బోవుట ఉత్తరాయణ మని ప్రసిద్ధమాయెను. విషువత్తు స్థిరము కాదు. కావున గర్గాదులు వీథ్యాది గణనమునందు క్రమాంతర మవలంబించిరి. ఈ పయి సంగతులఁబట్టి చూడఁగా ఈ యానద్వయ కల్పనా సమయమున రోహిణిలో విషువత్తుండియుండు నని యోగీశచంద్రవిద్యానిధు లనుమించిరి.

ఈ రీతిగా బయలుదేఱిన యీ రెండు దారులను మెలమెలగా పరిహద్దులతోడను, అంచెలతోడను ఏర్పాటయి కర్మిష్ఠులకును, ఉపాసకులకును సిమెంటురోడ్లయిపోయెను. ఇంతటితో నీసంగతి వదలి వెనుకకు మరలుదము.

## స్థూల రూపము

జీవుని ఉత్క్రాంతి మొదలుకొని బ్రహ్మలోక పర్యంతము కల లోకముల నుపనిషత్తులును, పురాణములును కనులకుఁ గట్టినటులు వర్ణించెను. విద్యుదంతములగు నీ యర్చిరాదులు బ్రహ్మలోకమునకుఁ బోవు నుపాసకులను18 తోడ్కొనిపోవు దేవతలు. వెళ్లువారి లింగదేహములు; అచేతనులు. తోడ్కొనిపోవువారు సచేతనులు. ఆదిత్యాదిలోకములు తమతమ లోకములందున్న వారికి భోగభూము లగుచో గావచ్చుఁగాని సంపిండితేంద్రియసముదాయము కల యీ బాటసారులకు భోగస్థానములు కావు 19.

## బ్రహ్మలోకము

భూలోకమునుండి లెక్కింపఁగా మూఁడవది 20 బ్రహ్మలోకము. అచట సముద్రములంతటి అమృత హ్రదములు కలవు. మఱియు నచట అన్నమయమను సోక కొలను కలదు. అమృతము వర్షించు అశ్వత్థ మొకటచట నున్నది. అచట కర్మజ్ఞానశూన్యులకుఁ బ్రవేశింపరాని పత్తన మొకటి యున్నది. అందు హిరణ్యగర్భుఁడు నిర్మించిన బంగారుమంటప మొకం డున్నది. అని ఛాందోగ్య మధ్యవసించి బ్రహ్మలోకమును వర్ణించెను.

---

18. ఉపాసనములు పెక్కులు. ఉపాసకులును పెక్కురు. వీరిలో దహరాది విద్యోపాసకులకుమాత్రమే అపునరావృత్తి. ప్రతీకోపాసకులకు రెండవ దారిగాని, మూఁడవ దారిగాని లేదు. వా రర్చిరాదిమార్గమున విద్యుల్లోకమునకుఁ బోయి ఫలక్షయానంతరమే భూమికి వంగుదు రని సంప్రదాయము. మఱి సామోక్తబృహద్రథంతరవైరూప వైరాజ శాక్వర రైవత కాంధన కాలేయాద్యష్టాత్మకావం దివి, నస్తోమముగ మహతిని ఉపాసించి సామ్రాజ్య భౌజ్య స్వారాజ్య వైరాజ్యాదిక్రమమున బ్రహ్మలోకము నొందువారును అవృత్తిచెందుదురు.

19. కొన్ని పురాణములు ఉపాసకుల కిచట పూజలు కల్పించెను. శంకరానందీయ మీలోకములను వీరికి భోగస్థానములుగాఁ జేసెను.

20. స్వర్గముగూడ ఇటనుండి మూఁడవ లోకమే అవను; ఇట దాని లెక్కలేదు.

## ముక్తులు

ఈ బ్రహ్మలోకమునకు ప్రణవ దహరా ద్యుపాసనములచే నేఁగిన వారి కచట శరీరము ఉండ దని బాదరియు, ఉండునని జైమినియు నభిప్రాయపడిరి. ఈ రెండు విరుద్ధవాక్యములను అవిరుద్ధముగనే యున్న వని బాదరాయణుని అభిప్రాయము. పెక్కు వత్తులలో దీపమునకు ప్రవేశ మున్నటులు ముక్తజీవులకు పెక్కు శరీరములలో ప్రవేశ ముండును. జగద్వ్యాపారము వినా వారి కోరిక లన్నియు సంకల్పమాత్రముననే సిద్ధించును.

ఈ దేవయాన మంతయు ముఖ్యముగా సగుణ బ్రహ్మోపాసకులకు. ఇఁక బ్రహ్మవేత్తల కొక దారి లేదు. 'న తస్య ప్రాణా ఉత్క్రామన్తి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి... ఉదస్మాత్ప్రాణాః క్రామన్త్యాహో నేతి నేతి హోవాచ యాజ్ఞవల్క్యో౽త్రైవ సమవనీయన్తే', బృహ.-౩-౧-౧౧. బ్రహ్మవేత్తలకు పొందఁ దగినది లేదు. పొందఁదగినదానిని వా రిచటనే పొందిరి. వారిచటనే బ్రహ్మభూతు లయిరి.

## పరలోకచింతాధార

బ్రహ్మము తెలియుట యనఁగా బ్రహ్మసాక్షాత్కారము పొందుట. బ్రహ్మసాక్షాత్కారము చెందిన వారలు బ్రహ్మవేత్తలు.

'బ్రహ్మము ఇట్టిది' అని అప్పుఁడు-అనఁగా ఏ రామకృష్ణపరమహంసయో, ఏ రమణమహర్షియో చెప్పఁగా తెలియుట బ్రహ్మస్వరూప మాత్రమును తెలియుట.

బ్రహ్మవేత్తలకు ఉత్తరాయణాదికములతో పని లేదు. ఇఁక బ్రహ్మస్వరూపమాత్రమును తెలిసినవారు పుణ్యకాలమున చనిపోయినంతమాత్రమున పునరావృత్తి నొంద రనుట యుక్తిసహము కాదు. కాఁబట్టి కాల మేమి చేయఁగలదు? అన్నచో భీష్ముఁడు బ్రహ్మవేత్త యయ్యు ఉత్తరాయణమునకుఁ బ్రతీక్షింపలేదా? అని యడుగుదురు. అతఁడు బ్రహ్మప్రాప్తికి కాలము నపేక్షింపలేదు. కాలమే బ్రహ్మప్రాపకమేని బ్రహ్మవేత్త లందఱును చావునకు ఉత్తరాయణమునకు వార్పు

యుండవలయును. శక్తి లెవరు నటులు చేయలేదు. అదియుఁగాక ఇట్టి కాలమునఁ జావవలయు నని ఎచటను విధి లేదు; ఉండఁజాలదు. ఈ పరిగణనమే విధి యని ఎవరేని వాదించినను ఎవరును అటులు చావరు. ఇఁక భీష్ముని మాట. మృతి యాతని చేతిలో నున్నది. ఉత్తరాయణాదికము కళేబరసన్న్యాసమునకు గతి విశేషాధాయక మని చెప్పు ఆగమములను ప్రమాణీకరించుట కతఁ డటులు చేసెను. కాఁబట్టి 21యీ కాలద్వయమునం దేదో విశేష మున్నది.

రహస్యశాస్త్రములు 22కాలము బాహ్య మనియు, ఆభ్యంతర మనియు రెండు విధము లని చెప్పును. అందు సూర్య చంద్రుల చారముచే కూడుకొన్నది బాహ్యము. ప్రాణాపానలక్షణమైన సూర్య చంద్రుల చారముచే నుపలక్షిత మయినది ఆభ్యంతరము. ఈ రెంటిలో ముఖ్యార్థమగు సూర్యేందుచారోపలక్షితమగు కాలము పైహేతువులచే బాధితమగుచున్నది కావున నిచట గౌణమగు ఆభ్యంతరకాలమును గ్రహింపవలయును. కాఁగా కాలవాచకశబ్దములు ప్రాణగతిప్రతిపాదకములు. రహస్యశాస్త్రములలో నచటనచట ప్రాణగతియే దివసాద్యుత్తరాయణకాలావయవముగా ప్రసిద్ధము: . కావున అంతకాలమునందు బ్రహ్మద్వారమునకు స్వరసముచే ప్రవహించు ప్రాణచారమునందు నియంత్రిత మగు బ్రహ్మవేత్తల సంవిత్ప్రవాహము మహాసంవిత్సముద్రమునందు సమరసీభావము నొందును. ఇది బ్రహ్మవేత్తల దేవయానము.

ప్రాణవృత్తిని ఆశ్రయించి దేహమును విడుచు కేవల యోగులు బ్రహ్మవేత్తలు కారుకాన తత్త్వస్ఫూర్తిలేమి, దేహాదులం దాత్మభావము విడలమి అపానవృత్తి యగు సంసారము నాశ్రయించి విశిష్టమగు దేహాంతరము నాశ్రయింతురు. ఇది పితృయాణము.

ఈమతమున బాదరి బాదరాయణులు కొండలవలె అడ్డుపడినను కార్యబ్రహ్మలోకము నెత్తివేయవలయును. అటు లగుచో దహరాదివిద్యోపాసకులుకూడ ధూపరిమళము నాస్వాదింపవలసియుందురు. ఇంతియ కాక, ఆ సుధాహ్రదములలో స్నానపానము లుండవు. ఆ యశ్వత్థశాఖల కెవరును మక్కిబట్ట లాఁగట్టరు. ఆ యన్నసత్రమున అతిథు లుండరు. ఆ బంగారు మంటపమును, ఆ పత్తనమును ఖాళీ.

ప్రకృతమునకు వత్తము. ప్రకృత విద్యుల్లోకమునకును, వెనుకటి విద్యుల్లోకమునకును గల సంబంధమేమి! తెలియుట లేదా,—అది బాదరాయణ సంబంధము.

---

21. ఈ కాలము మార్గపరమని కొందఱు. దేవతాపరమని కొందఱు, ఈ రెండు నొకటియే యని యింకొందఱు.

22. చూ. సర్వతోభద్ర.

23. స్కాందాదులయందు సూర్యచంద్రనాడులును ధ్రువేందుమండల సుధాస్వాదాదులును ప్రసిద్ధము. 'య ఏష స్తన ఇ వావలంబతే, అంతరేణ తాలుకే, సేంద్రయోనిః' అను తైత్తిరీయోపనిషత్తునందు కొంతనాలుక యింద్రలోకము. 'తస్యాసత ఋషయః సప్తతీరే' అను సప్తర్షులు సప్తప్రాణములుకదా—'ప్రాణా వా ఋషయః' కావున ఇంద్ర చంద్ర విద్యుల్లోకాదులు శారీరకములు. బాహ్యములు వానికి స్ఫోరకములు.



# ప్రగతి



## శ్రీ అనుముల వెంకటశేషకవి

నవనవోన్మేష నానాభావ విన్యాస
రవళి, భారత దేశరంగభూమి ఘటిల్లి;
భవములే మార్చె నాబాలగోపాలమున;
'కవురవుర!-' యనిపించెనా?
స్వాతంత్ర్య
నవయుగం బేతెంచెనా?

ప్రళయభీకర రక్తపాత హింసాఘాత
ఘళఘళార్భటులతో బీభత్సగా నున్న
స్థలము లన్నిట నింక శాంతి సంస్థాపనకు
నలువు కృషి ఫలియించునా ?
దాస్యశృం
ఖలలెల్ల నశియించునా?

సాంద్ర జాతీయ విజ్ఞాన దివ్యజ్యోతి
కేంద్రముల వెలుగొంది, క్రిందిరాష్ట్రములందు
చంద్రకాంతుల రీతి సరసరా వ్యాపించి
యింద్రభోగము లిచ్చునా?
దారిద్ర్య
మింతలోనే చచ్చునా?

అంధకారము మాసి; యజ్ఞాన మెడబాసి;
బంధముల దిగద్రోసి; పారతంత్ర్యము రోసి;
సంధికాలములోని సౌఖ్యములకోసమై
జగతి చేతులు చాపునా ?
నవయుగ
ప్రగతి మానస మూపునా?



# ఫిర్యాదు

[కథానిక]

శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రి

పట్నవాసపు పెద్దస్కూలునుంచి పల్లెటూరు మిడిలు స్కూలుకి బదిలీ అయినట్లు కాగితం వచ్చింది చక్రపాణికి. ఇది మరిఒకరికి ప్రాముఖ్యం ఇవ్వడంకోసం చేయబడిందా, లేక తనలో ఏదైనా లోటుండడంవల్ల చేయబడిందా అని మొదట తటపటాయించాడు. కాని తక్షణం నెలరోజులు సెలవుపెట్టి ఆఫీసుకి వెళ్లి ఆ ఆర్డరు రద్దుచేయించుకోడంకోసం నిశ్చయించాడు. భార్య కింకో పదిహేనురోజులుపిమ్మట పురుడువచ్చే రోజులు. అందుచేత మొదటిఫారం చదువుతున్న కుమార్తెను, భార్యను పుట్టింటికి పంపించేశాడు. తాను తిన్నగా ఆఫీసుకి వెళ్లి వాళ్ళనూ వీళ్లనూ పట్టుకొని తన బదిలీని రద్దుచేయించుకోడంకోసం విశ్వప్రయత్నం చేశాడు. కాని 'వేసిన ఆర్డరు మరల వెంటనే రద్దు చేయుటకు వీలులేదు, కొన్నాళ్లు అమలుజరగాలి' అన్నారు అధికారులు. చేసేదేమీ లేక సెలవనంతరం సామాను పట్టించుకొని ఆ పల్లెటూరు వెళ్లి జాయినయినాడు. అక్కడికి భార్యపుట్టినిల్లు సరిగా రెండున్నర మైళ్లుంది. రోజూ ఆ వూరునుంచి ఈ స్కూలుకి వచ్చి చదువుకొనే కుర్రాళ్లు చాలామంది ఉన్నారు. తాను వొంటరిగా ఓ చిన్న యిల్లు తీసికొని అందులో మకాం పెట్టాడు. అది శుద్ధపల్లెటూరు. హోటలులేదు సరికదా, తనకు వండిపెట్టే దిక్కుకూడా లేకపోవడంచేత చేయి కాల్చుకోవడం తప్పనిసరి అయింది. ఒక శనాది వారాల్లో వచ్చినప్పుడు భార్య గడ్డం పట్టుకొని బతిమాలింది. "సామానంతా బండిమీద వదేసి మాయింటికి వచ్చేయండి. ఇంతా చేస్తే రెండున్నరమైళ్లేకదా దూరం, ఆ మాత్రం నడవలేకపోతారా? అంతగా నడవలేకపోతే యీ నాలుగుమాసాల్లోనూ తీర్చుకొనే పద్ధతి మీద అప్పుచేసి ఓ సైకిలు కొయ్య కొనుక్కోండి. ఏదో ఆ చారూ మెతుకులూ తొమ్మిదిగంటలకి మా మనలమ్మ ఉడకేస్తుంది. పిల్లా మీరూ కూడా ఇక్కణ్ణుంచే వెళ్లవచ్చు. ఇంటద్దీ తప్పుతుంది. మీకు చేయికాల్చుకోడమూ తప్పుతుంది." అని. అయితే చక్రపాణికిదేం నచ్చలేదు. తను కాస్తోకూస్తో సంపాదించుకుంటూ అత్తవారింట పడి తినడం బాగుండదనిపించిం దాతని మనస్సుకి. చివరికి తా నొక్కడే ఆ పల్లెటూరులోనే ఉండి వండుకుతినడానికే నిశ్చయించాడు. పిల్లవాడు శాంతినక్షత్రంలో పుట్టడంవల్ల నీడ చూచుకొనేవరకు అత్తవారిల్లు తొక్కడానికే వీలులేకపోయిందికూడాను. తన తల్లి రామేశ్వరంనుంచి ఇంకా రాకపోవడంవల్ల మూడోనెలవరకు నీడచూచుకొందుకు వీలులేకపోయింది.

పద్మకి పదకొండో యేడు. చురుకుచక్కదనాలు గల పిల్ల. మనస్సులో ఏ ఉన్నతాశయం లేకపోయినా కాలక్షేపంకోసం ఈ చదువులో ప్రవేశపెట్టాడు తండ్రి ఆ బస్తీలో ఉన్న రోజులలో. బస్తీలో ఉన్నప్పుడు తోటిచెలికత్తెలతోటి చెంగుచెంగున నడుస్తూ పెద్దస్కూలుకి వెళ్ళడం సరదాయే అనిపించింది పద్మకి. అవాంతరంగా తన తండ్రికి పల్లెలో ఉన్న మిడిలుస్కూలుకి బదిలీకావడంతో కొంత ఉత్సాహం తగ్గినా చదువుమాత్రం మాన తలచుకోలేదు. అయినా పట్నంనుంచి వచ్చేప్పుడు "నేను సీతగారింట్లో ఉండి ఈ వూళ్ళోనే చదువుకుంటాను, సీతకూడా నన్ను వెళ్లవద్దని పట్టుపడుతోంది" అని పరాధీనపు బాల్యత తెలియని దృష్టితో తండ్రిని వేడుకొంది. తండ్రి ఒప్పుకోలేదు.

కొత్తమేష్టారుని చూసి మురిసిపోతున్నారు పిల్లలంతా. వీధివెంట నడుస్తోంటే "ఆయనే మా కొత్త మేష్టరు. చాలా మంచివారు. పద్యాలు బాగా పాడు

కారు" అని ప్రచారంకూడ సాగించ మొదలు పెట్టారు. దీనికి కారణంకూడా లేకపోలేదు. ప్రధానకారణం తాను చెప్పదలచుకొన్న పాఠాన్ని అరగంటలో ముగించి ఏదో పుస్తకంలోని ఒకఘట్టం యెత్తుకొని శ్రావ్యంగా వాళ్ల కర్థమయే విరుపులతో పద్యాలు చదివి కుర్రాళ్ళ బడలికను పారదోలడమే. చూడ్డానికి శాంతుడులాగే కనిపిస్తాడు. కాని కొంచెం పట్టుదల మనిషి. కాని ప్రతీకుర్రాడూ ఆమేష్టారి క్లాసుకోసం తహతహపడేవాడు. కొత్తలో కుర్రాళ్ల ఆకర్షణ కోసం పద్యాలూ అవీ చదివినా మెల్లిమెల్లిగా ఆ కార్యక్రమం సడలిస్తూ పాఠాలమీద దృష్టిని కేంద్రీకరింపసాగాడు. ఇది కుర్రాళ్లకి కొంచెం కష్టమే అనిపించింది. కాని మధ్యమధ్య ఏరోజయినా ఏదోఘట్టం యెత్తుకొని పద్యాలు చదవడం ప్రారంభించాడా, లోపల్నుంచి పెల్లగించుకొనివచ్చేది విశ్వాసం కుర్రాళ్ళకి. ఒకటికనో దాహానికనో చెర తప్పించుకొనివచ్చిన కుర్రాళ్ళారోజున ఈయన క్లాసుకిటికీలవద్ద నిలబడిపోయేవారు.

ప్రతీసోమవారం ఆ స్కూలులో ఏదో ఒక క్లాసుకి హిష్టరీపరీక్ష పెట్టుతారు హిష్టరీమాష్టరుగారు. ఆరోజు సోమవారం. మొదటిఫారాని కారోజున వంతు ప్రకారం పరీక్షరోజు. జవాబులు సరిగా చెప్పకపోతే కొడతారని భయపెడుతూ ఉండడంచేత కొంతమంది దొంగసెలవులు వ్రాసిపంపి క్లాసు ఎగకొట్టారు. మధ్యాహ్నం మూడోగంటకొట్టడంతోటే అచ్చాఫీసులోని గదులపెట్టెలో అక్షరపుముక్కలు పోగుబడినట్లు ఎవరి క్లాసులకి వాళ్లు వెళ్లిపోయారు. మధ్యాహ్నం భోజనాలకి ఇళ్లకు వెళ్లిన కుర్రాళ్ళు, వాన వెలిసినతరువాత చూరునుంచి ఒక్కొక్కబొట్టే జారిపడినట్లు, ఒక్కొక్కరే వచ్చి క్లాసులకి చేరుకుంటున్నారు. నిలబడ్డవాళ్లనందరినీ కూర్చోమని సంజ్ఞచేసి డ్రాయరులోని బెత్తం తీసి కుడిచేత్తోటీ, పాఠ్యగ్రంథం మరొక చేత్తోటీ పట్టుకొని కుర్చీలోంచి లేచారు హిష్టరీ మాష్టారు. పెద్ద [illegible]లాగ కుర్రాళ్లకి గుండెలు ఓసారి తొణుక్కుతొణుక్కు మన్నాయి. క్లాసు పలచపలచగా ఉండడంచేత కుర్రవాళ్ల ముఖాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. బిక్కముఖం వేసుకొని కూర్చున్న ఓ కుర్రవాడిదగ్గరకు వెళ్లి రెండుమూడు ప్రశ్నలు వేశారు. కుర్రవాడు దిక్కులు చూడసాగాడు. లాల్చీచెయ్యి పుస్తకాని కడ్డుపడుతూంటే బెత్తం ఉన్న చేత్తో సర్దుకోబోయేసరికి గతుక్కుమన్నాడు కుర్రాడు కొట్టబోతున్నారనుకొని. కిటికీ పక్కనుంచి చిన్నస్కూలుకి వెడుతూ కుర్రవాడొకడు "వాటీజ్ దిస్ వంకాయ్‌పుల్సు"అని అరిచి పారిపోయాడు. క్లాసంతా ఓసారి కిలకిలమన్నారు. మేష్టారు ఓసారి ఉరిమిచూచేసరికి స్విచ్చివేసినట్లు సద్దుమణిగిపోయారు. ఆదేమాదిరిగా ఇంకొకటి రెండు బిక్కముఖాలదగ్గరకు వెళ్ళి ప్రశ్నించారు. మూడోవాడినుంచి జవాబులు సరిగా రాకపోగా చురుకు మరుక్కన రెండు దెబ్బలు తగిల్చారు మేష్టారు. పద్మదగ్గరకు వచ్చి మరొకరకం ప్రశ్న వేశారు. పరుగుపరుగున వచ్చినా ఆలస్యమయిపోవడంచేత ముఖమంతా చెమట బిందువులు ఇంకా ఆగలేదు పద్మకి. పరికిణీ చెంగుతో ముఖ మోసారి తుడుచుకొని "ఇది కొత్తగా చెప్పిన పాఠం-నాకు రాలే"దంది పద్మ. "శని ఆదివారాల్లో ఏంచేస్తున్నా"వని ఓ దెబ్బ, తప్పించుకోపోయినందువల్ల ఇంకో దెబ్బ కొట్టారు. అంతమందిలోనూ కొట్టినందుకు ముఖం అటు తిప్పుకొని వెక్కివెక్కి యేడ్పుం దాపిల్ల. క్లాసంతా ఓసారి గుసగుసలుపోయారు.

విశాలమ్మ చాకలవాణ్ని తొందరపెట్టి పిల్లకో మూడుజతలూ, భర్తకో మూడుజతలూ బట్టలు తెప్పించి సూటుకేసులో సర్ది పాలేరుచేత స్కూలుకి పంపింది. ఇంకొక పీరియడు ఉండగా సూటుకేసు పట్టుకొని వచ్చిన పాలేరుని చూచి చక్రపాణి ప్రధానోపాధ్యాయునివద్దకు వెళ్ళి, తాను మేనకోడలు పెళ్ళికి వెళ్లవలసియున్నట్లు మనవిచేసి ఆ నాలుగురోజులకి సెలవు దరఖాస్తు దాఖలు చేసుకొని సెలవుతీసుకొని బసకు వచ్చేశాడు. తండ్రి వెళ్లడం కిటికీలోంచి చూచి తను కూడా తనను ఈ స్కూలులో చేర్పించిన మేనమామ వ్రాసిచ్చిన సెలవు దరఖాస్తును క్లాసుమేష్టారి కిచ్చి తండ్రిబసకు వచ్చేసింది. బండి సిద్ధంగానే ఉండడంచేత ప్రయాణమై వెళ్ళిపోయాడు పిల్లను తీసుకొని చక్రపాణి.

సాయంకాలం స్కూలు విడిచిపెట్టారు. కారు కూతలు, ఈలలు, కేకలు, పేరులు పెట్టి పిలవడం మొదలైన కోలాహలంతో ఈవల బడ్డారు బోనుల లోంచి పిల్లలు. పొరుగూరిపిల్లలు అహమహమికగా పరుగులు పుచ్చుకొని ఇళ్లకు పోయారు. మాష్టారిచే దెబ్బలు తిన్న కుర్రవాళ్లిద్దరుముగ్గురు పరుగుపరుగున మహాలక్ష్మమ్మగారింటికి పోయి అర్గాలలో బిడ్డని పెట్టుకొని కూర్చున్న విశాలమ్మగారితో "మీ అమ్మాయిని ఇవాళ హిష్టరీమాష్టారు కొట్టారండీ" అని ఒకడు, "నెత్తిమీద బాదేశాడండీ" అని యింకొకడు, "గంట గంటల్లా వెక్కి వెక్కి యేడుస్తూనే ఉందండీ" అని మరియొకడూ సాయంపట్టి చెప్పేసి చంకలుకొట్టుకొంటూ పారిపోయారు. ఉత్తరోత్తరం బలీయులైన ఆ ముగ్గురూ చెప్పిన మాటలతో తల్లి ప్రాణం ఉసూరుమంది. "ఆడపిల్లని అల్లా కొట్టుకుంటారా ఎక్కడేనా, పోయే కాలం" అని బుగ్గలు నొక్కుకొంటూ సావిట్లోంచి వంటింట్లోకి వెళ్లి పోయింది ముసలమ్మ. పిల్లవాణ్ని మంచంమీద పడుకోబెట్టి పక్కయింటి కొలంగగుమాస్తాగారింటికి వెళ్లి జరిగిన సంగతంతా గుడ్లనీళ్లు అణచుకొంటూ వెళ్లబోసుకొంది విశాలమ్మ. ఇంతలోకే గుమాస్తాగారబ్బాయి ఇంట్లోంచి దూసుకొనివచ్చి "నాన్నా! గట్టిగా కొట్టారోయి పాపం, ఆ అమ్మాయిని. ముఖం అటు తిప్పుకొని చాలాసేపు ఏడ్చింది పాపం"అని ఆ అగ్గిమీద కాస్త గుగ్గిలం చల్లాడు. "మీ అబ్బాయికీ కూడా తగిలింది లెండి ఇవాళ, అంచేత అల్లా చెప్తున్నాడు"అన్నాడు కిటికీదగ్గర నిలబడ్డ ఓ పెద్దమనిషిపిల్లాడు. గుమాస్తాకి కూడా కొంచెం మనస్సు చివుక్కుమనగానే "అయితే పైవాళ్లకి ఫిర్యాదు చేయమంటారా" అని అడిగాడు. అవునన్నట్టు తలవూపింది విశాలమ్మ. గుమాస్తా తక్షణం కాగితం, కలం తీసుకొని తనకున్న ప్రావీణ్యంతో అధికారులకో అర్జీ వ్రాసిపెట్టి క్రింద స్థాం చూపించి సంతకం చేయమన్నాడు విశాలమ్మని. కిందటిమాటు పురిటికి భర్త పంపే మనియార్డరులు అందుకోడంకోసం దిద్దుకొన్న అక్షరాలతో సంతకం పెట్టింది విశాలమ్మ. "మిగతా కార్యక్రమం నే నడిపిస్తానెండి, మీరు వెళ్లండి" అని ఆమెను ఓదార్చిపంపాడు గుమాస్తా.

ఆడమనిషిసంతకంతో ఆడపిల్లను కొట్టినట్టు వచ్చిన ఆ అర్జీని రెండుమూడుసార్లు చదివి ప్రెసిడెంటుగారు ఈ ఫిర్యాదును విచారణచేయవలసిందిగా ఆ ఫిర్కామెంబరుకా కాగితాన్ని తక్షణం రవానా చేశారు. ఆఫిర్కామెంబర్కు కాకాగితం శనివారం అందింది. తనను విచారణచేయమన్నందుకు కొంచెం పొంగిపోయాడాయన. ఉద్యోగం ఊడతీయిస్తానని బెదిరించి కొంచెం ఏడిపించవచ్చునుకదా అని ఓసారీ, ఇంటిచుట్టూ ఆ మేష్టారుని పదిసార్లైనా తిప్పించాలని మరోసారీ మనస్సులో అల్లుకున్నా డామెంబరు. కాని మర్నా డాదివారం అయినందుకు చాలా విసుక్కున్నాడు.

ఆరోజు సోమవారం. ఫిర్కా మెంబరు ప్రొద్దుటి నుంచీ ఏదో పరధ్యానంగానే కాలకృత్యాలన్నీ నిర్వర్తించుకొని రెవిన్యూ ఆఫీసరుగారికి ఈ రోజు తన డ్యూటీని ఉదహరిస్తూ 'జీపు'ను ఒకసారి పంపవలసిందిగా ప్రార్థిస్తూ వ్రాసి తన మనిషిద్వారా పంపాడు.

పదకొండుగంట లయింది. రెవిన్యూ ఆఫీసరు పంపిన కారు వచ్చి గుమ్మంలో ఆగి కూతకూసింది. అద్దంముందు నిలుచుని మెడకు టై కట్టుకుంటున్న మెంబరుగారు హడావిడిగా తనపని ముగించి వచ్చి కారులో కూర్చున్నారు. ఊడిపోయే తలపాగాని సర్దుకుని హడావిడిగా వచ్చి డ్రైవరుపక్కని కూర్చున్నాడు ఇంట్లో పనిచేసే మనిషి. కారు వెళ్లి పోయింది.

పెళ్లికివెళ్లిన చక్రపాణి పిల్లలతో సహా సరిగా స్కూలు ఎదుటే దిగాడు బస్సు. ఎవరిక్లాసులికి వాళ్లు వెళ్లిపోయారు. అంతలో 'జీపు' ఓకూత కూసి స్కూలు గుమ్మందగ్గిర ఆగింది. జనమంతా ఓసారి కిటికీలలోంచీ గుమ్మాలలోంచీ తొంగిచూచారు. నెత్తిమీద దొర టోపీతో ఓమనిషి కారులోంచి దిగాడు. వెనకాల బంట్రోతులా ఉన్న ఓమనిషి దొరగారి సంచీ చేత్తో పట్టుకొని దిగాడు. 'డీయీఓగారు' అంటూ కుర్రవాళ్లు గుసగుసలు ప్రారంభించారు. ఉపాధ్యాయులు 'ఉష్షు'మని ఆ సంచలనాన్ని అంతా ఆపి నిశ్శబ్దంగా కూర్చున్నారు. బీరువామీది డవాలు తీసి మెల్లోతను

ల్చుకున్నాడు స్కూలుబంట్రోతు. కండువా సర్దుకొని ప్రధానోపాధ్యాయులు దొరగారికి స్వాగతం చెప్పారు. దొరగారు కుర్చీలో కూర్చోకుండానే వరండామీద నుంచీ ప్రతీక్లాసూ చూసుకుంటూ వెడుతున్నారు. ప్రధానోపాధ్యాయులు ప్రతిక్లాసునుగూర్చీ కొంత ముచ్చటిస్తూ దొరగారి ననుసరిస్తున్నారు. ఫంచీతో కూడ దొరగారి మనిషి వెంటాడుతున్నాడు. ముందుకి సాగిపోతూంటే వెనకనున్న ఉపాధ్యాయులు స్కూలు బంట్రోతుని 'ఎవర'న్నట్టుగా చేయి ఊపారు. బంట్రోతు పెదవి విరిచాడు. విరిచి, డ్రైవరుని అడిగి చూచాడు. డ్రైవరు "ఈ దొరగారిని ఎక్కడో అయి దారుసార్లు చూచానుకాని ఎవరో తెలియ"దన్నాడు. అజ్ఞాతంగా అంతా కళవళపడుతున్నారు. ఎంత ఊహిం చుకున్నా ఎవ్వరికీ ఏమీ తట్టడంలేదు. తిన్నగా ఆఫీసు గదిలోకి వచ్చేసి ప్రధానోపాధ్యాయులు చూపిన కుర్చీలో కూర్చుని దొరగారు "హిస్టరీమాస్టరిని ఓసారి పిలిపించండి" అన్నారు దక్షిణాది పలుకుబడితో. ప్రక్కనే ఉన్న బంట్రోతుకేసి చూచారు ప్రధానో పాధ్యాయులు. బంట్రోతు వెళ్లి ఆ మేష్టారిని తీసుకు వచ్చాడు. దొరగా రోసారి ఆ మేష్టారిని పాదాలో ఎగా దిగా చూచి కోటుజేబులోని అర్జీని తీసి ఓసారి చదివినట్టు నటించి ఆ కాగితాన్ని ప్రధానోపాధ్యా యుల కందిచ్చారు. రెండుచేతులతో ఆకాగితాన్ని స్వీకరించి ఆమూలాగ్రంగా కంగారుగా చదివేసి దృష్టిని హిస్టరీమాస్టరుమీద ప్రసరింపజేశారు. నిర్వణ్ణు డౌతున్నాడు హిస్టరీమాస్టరు. "ఆపిల్లను కూడా పిలి పించండి" అన్నారు దొరగారు. బంట్రోతుకి సూచించి ఆపిల్లను తీసుకురమ్మన్నారు ప్రధానోపాధ్యాయులు. పద్మవచ్చి ఓపక్కగా నిలబడి అందరినీ పరకాయించి హిస్టరీమాస్టారికేసి చూచింది. పైగా నవ్వబోయింది. మాస్టారు వాల్చిఉన్న చేత్తో 'ఊరుకో' అన్నట్టుగా నివారించారు.

ప్రధానోపా:—అమ్మాయి! ఈ మేష్టారు ని న్నెప్పుడు కొట్టారు?

పద్మ:—(మాట్లాడలేదు)

దొరగారు:—చెప్పమ్మా! భయం లేదు.

పద్మ:—నన్ను వారెప్పుడూ కొట్టలేదండీ.

దొర:—భయపడి నిజాన్ని కప్పిపుచ్చు తున్నావు. భయంలేదు చెప్పు.

పద్మ:—నన్నీమధ్య ఎప్పుడూ కొట్టిన జ్ఞాపకం లేదండీ.

దొర:—ఏమయ్యా! ఏవూరు మీది?

హిస్టరీ:—(చెప్పాడు)

దొర:—నీ పేరు!

హిస్టరీ:—(చెప్పాడు)

దొర:—ఈ అమ్మాయిని ఎప్పుడు, ఎందుకోసం కొట్టావు?

పద్మ భయంతో పోలీసు ఇనస్పెక్టరును చూచి నట్టు దొరగారికేసి చూచి మాస్టారికేసి చూచింది. హిస్టరీమాస్టారు ఆమెదృష్టికి శిక్షింపబడే నిర్దోషిలా కనబడ్డాడు. లోపల్నుంచి ఉబికివస్తోంది దుఃఖం. ప్రధానోపాధ్యాయులను చూచి సంకోచపడి ఆపుకో బోయింది దుఃఖాన్ని. ఆగలేదు. కట్టతెగింది ప్రవా హానికి. దొరగారికి జవాబు చెప్పబోతున్న హిస్టరీ మాస్టర్ని పద్మ, "నాన్నా!" అంటూ వావురు మని చేతులు చుట్టేసి కౌగలించుకొంది. దొరగారూ, ప్రధా నోపాధ్యాయులూ నిర్ఘాంతపోయి చూస్తున్నారు. "మీ అమ్మాయి గారేంటండి?" అన్నాడు స్కూలు బంట్రోతు. దొరగారూ, ప్రధానోపాధ్యాయులూ బంట్రోతు వేసిన ప్రశ్నకేసి ఆదుర్దాగా చూచి తక్ష ణమే హిస్టరీమాస్టరువైపుకి తమకు తెలీకుండానే ముఖాలు తిప్పారు.

హిస్టరీ:—(హెడ్మాస్టరుకేసి చూస్తూ) ఈ అమ్మాయి మా అమ్మాయేనండి, మీరెవ్వరూ ఎరుగరు కాబోలు.

అన్నాడు చిన్న నవ్వు నవ్వుతూ.



# భూప్రదక్షిణము

= శ్రీ మావిడిపూడి వెంకటరంగయ్య =

రష్యా, అమెరికాలమధ్యన అభిప్రాయభేదాలు వృద్ధియగుట; తమ ప్రాబల్యాన్ని, అధికారాన్ని, పలుకుబడిని వృద్ధిచేసుకొనుటకు ఈ రెండు దేశముల వారు మరికొన్ని ప్రయత్నాలు చేయుట; బ్రిటన్, ఫ్రాన్సు, హాలెండు దేశములవారు వారివారి సామ్రాజ్యములను నిలబెట్టుకొనుటకై పలుసాధనములు ఉపయోగించుట—జూన్ మాసములో గమనింపతగ్గ విశేషాలు. ఉన్న అధికారాన్ని నిలబెట్టుకొనుట, దానిని మరింత వృద్ధిచేసుకొనుట అన్నిరాజ్యాలకు సహజము. రష్యావారు, అమెరికావారు ఈ పనులలో నిమగ్నులై యుండుటలో ఆశ్చర్యపడవలసిన దేమియు లేదు.

## రష్యా

రెండవ ప్రపంచయుద్ధమునకు ఫలితముగ బల్గేరియా, రుమేనియా, హంగరీ దేశములున్ను, జర్మనీ ఆస్ట్రియా దేశములలోని తూర్పుభాగములున్ను రష్యావారిచే ఆక్రమితములయ్యెను. వీటిలో మొదటి మూడుదేశములతో ఈ మధ్యనే శాంతిఒడంబడికలు జరిగెను. ఇవి జరిగినతర్వాత మూడునెలలలోపుగ రష్యావారు వారి సైన్యములను ఈ దేశములనుండి ఉపసంహరించుకొనవలసియున్నది. అది జరిగినయెడల రష్యావారికి వీటియందు యుద్ధము మూలమున సంక్రమించిన ప్రాబల్యము అడుగంటును. కాని అట్లు తమ అధికారము అడుగంటుట వారి కిష్టములేదు. దానిని ఏలాగైన నిలబెట్టుకొనుటయే వారి దృఢనిశ్చయము. ఈ మూడుదేశములలో ప్రజలు స్వేచ్ఛగ ఎన్నుకొనిన ప్రతినిధులతో కూడిన ప్రభుత్వములను స్థాపించవలసినదిగా రెండు సంవత్సరముల క్రితమే మిత్రమండలి వారు ఒక రాజీకి వచ్చిరి. దాని ననుసరించి గతసంవత్సరము ఎన్నికలు జరిగెను. ఆ ఎన్నికలు స్వేచ్ఛగ జరుగలేదనియు, రష్యన్ అధికారులు వాటిలో జోక్యము కలిగించుకొని కమ్యూనిస్టుపక్షమువారు ఎన్నికలలో గెలుచునట్లు ఏర్పాటుచేసిరనియు, వారి ఏర్పాటులు హంగరీలో కాకపోయినను బల్గేరియా రుమేనియాలలో విజయవంతము లయ్యె ననియు, ఈ కారణముచేత వీటిలో ఏర్పడ్డ ప్రభుత్వములు నిజమైన ప్రజాప్రభుత్వములు కావనియు కొన్నినెలలనుండి అమెరికావారు, బ్రిటిష్‌వారు ఆక్షేపణచేయుచుండిరి. ఈ ఆక్షేపణలు సమంజసములు కావని రష్యావారి వాదము. ఈ వాదప్రతివాదముల స్వభావము ఎట్టిదైనను తుదకు వీటి ఫలితముగ ఈ మూడుదేశములలో ఒక గొప్ప మార్పు సంభవించెను. రష్యాతో స్నేహభావము వహించి, వారికి లోబడి తమ దేశములను పాలించుటకు అంగీకరించిన కమ్యూనిస్టుల ప్రభుత్వములు ఈ దేశములందు పూర్తిగ ఏర్పడుటయే ఈ మార్పు.

## బల్గేరియా

ఈ సందర్భములో ఈ దేశములందు జరిగిన చర్యలు కొన్ని గమనింపదగియున్నవి. బల్గేరియాయందు కమ్యూనిస్టుపక్షము అధికారమందుండినను దానికి విరోధిపక్షమువారుకూడ కొందరు శాసనసభలో నుండిరి. ఆ విరోధిపక్షపునాయకుడు దేశము

లోని ప్రజాప్రభుత్వమును తొలగించి ఫాసిస్టు ప్రభుత్వమును స్థాపించు ఉద్దేశముతో అమెరికన్ ప్రముఖులు కొందరి సహాయమున ఒక గొప్ప కుట్రను రహస్యముగ పన్నెనను మిషచే కమ్యూనిస్టుప్రభుత్వమువా రతనిని బంధించి చెరబెట్టిరి. అందుచేత విరోధిపక్ష మనునది ఒకటి లేక నియంత్రధికారముతో కమ్యూనిస్టుపక్ష ప్రభుత్వము గత మాసములో బల్గేరియాయందు స్థాపిత మయ్యెను. రషియన్ సైన్యముల ఉపసంహరణము జరిగినను రషియావారి ప్రాబల్యము బల్గేరియాలో స్థిరపడెను. రషియావారు కోరినది ఇదియే. టర్కీ గ్రీసులపై ఒత్తిడి కలుగజేయుటకు బల్గేరియా మంచి సాధనము. ఇదే విధముగ రషియావారి ప్రోద్బలముచే రుమేనియాయందుకూడ కమ్యూనిస్టుల ఏకపక్ష నియంతృత్వము సుస్థాపితమయ్యెను.

## హంగరీ

హంగరీదేశములోని చర్యలు ఇంతకంటె విపరీతములు. గతసంవత్సరము అక్కడ జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టులు అధికసంఖ్యాకులుగ ఎన్నుకొనబడలేదు. స్వల్పస్వవసాయదార్లకు సంబంధించిన పక్షము వారు గెలుపొందిరి. అందుచేత ఈ పక్షమునకు చెందిన వాడు ప్రధానమంత్రి అగుటయు, అతని అనుచరులు కొందరు తక్కిన మంత్రులగుటయు సంభవించెను; కాని ఇది రషియావారికి ఎంతమాత్రము ఇష్టములేదయ్యెను. ఏలాగైనను కమ్యూనిస్టులను ప్రభుత్వాధికార పదవులలో ఉంచుటకు వారు పూనిరి. గతమాసములో వారి పూనిక నెరవేరెను. ప్రధానమంత్రిగ నున్నవాడు విశ్రాంతికై స్విట్జర్లాండులో ఉన్నప్పుడు ప్రజాప్రభుత్వమును తొలగించి, ఫాసిస్టు ప్రభుత్వమును స్థాపించుటకు ప్రయత్నించుచుండెనని ఋజువుచేయుటకు వీలైన రహస్యపత్రములు కొన్ని తమకు దొరికినవని రషియావారు కొన్ని పత్రములను హంగరీప్రభుత్వమునకు అందజేసిరి. అందుపై ఆ మంత్రి రాజీనామా ఇచ్చెను. మరియొక మంత్రివర్గ మేర్పడెను. అది రషియాకు అనుకూలముగ నుండు మంత్రివర్గము. రాజీనామా ఇచ్చిన ప్రధాని తన దేశమునకు రాకుండ అమెరికాకు వెళ్లిపోయెను. రషియావారి చర్యలను ఖండించుచు అమెరికావారు, బ్రిటిష్‌వారు కొన్ని రాయబారములను జరిపిరి; కాని వాటిమూలమున లాభము లేకపోయెను. రషియావారి అధికారము హంగరీలోకూడ పాతుకొనుటకు వీలయ్యెను. అందుచేత అంతకుపూర్వము హంగరీకి అమెరికావారు చేయ నిశ్చయించుకొన్న ఆర్థికసహాయమును వారిచ్చుటకు వీలులేదని ప్రకటించిరి. ఏది ఎట్లైనను హంగరీ, రుమేనియా, బల్గేరియా దేశములు మూడింటియందును రషియావారి అధికారము ఇప్పటికి సుస్థిరమయ్యెనని చెప్పవచ్చును.

## ఆస్ట్రియా

తమ ఆక్రమణలో ఉండు తూర్పుఆస్ట్రియాలో కూడ తమ అధికారమును స్థిరపరచుకొనుటకు రషియావారు తీవ్రమైన ప్రయత్నములు చేయుచున్నారు. వీటి అన్నిటిలో వారికి కమ్యూనిస్టుపక్షము ప్రధానసాధనము. యూరపుఖండములోని ప్రతిదేశమందు ఈపక్షము ఉన్నది. ఇందులో చేరినవారు రషియాను అనుసరించువారు. ఆస్ట్రియాలోని వీరి నాయకుడు గతమాసములో దేశమందలి మంత్రివర్గము మారవలసియున్నదనియు, కమ్యూనిస్టులకు మరికొన్ని పదవులను ఇయ్యవలసియున్నదనియు ప్రధానితో సంప్రతింపులు జరుప ప్రారంభించెను. దానిమూలమున కమ్యూనిస్టుల ప్రాబల్యము ఆస్ట్రియాలోకూడ అధికముగ వ్యాపించు చిహ్నములు కనుపించుచున్నవి. యూరపుఖండపు తూర్పుదేశములలో కమ్యూనిస్టులకు స్వతహాగా ఎక్కువ బలముగాని, పలుకుబడిగాని లేకున్నను రషియావారు వారికి సహాయము చేయుటచేత—బ్రిటిష్ వారి సహాయమున ముస్లింలీగువారికిని, పాకిస్థాన్‌వాదులకును మన దేశములో ప్రాబల్యము కలిగినట్లు—వారి ప్రాబల్యము వీటియందు బాగుగ ఏర్పడినది. తూర్పు జర్మనీ, పోలెండు, జెకోస్లావేకియా, యూగోస్లేవియా, ఆల్బేనియాలలోని పరిస్థితులుకూడ చాలవరకు ఇట్టివిగనే ఉండుటచేత యూరపుఖండములో $\frac{1}{3}$ భాగమునకు రషియావారు అధికారులని చెప్పుట అతిశయోక్తి

కాదు. ఇదియే కమ్యూనిస్టు సామ్రాజ్యము. ప్రస్తుత పరిస్థితులలో కమ్యూనిస్టుప్రాబల్యమునకును, రష్యాప్రాబల్యమునకును ఎట్టి భేదము కనుపించదు.

## కమ్యూనిస్టుల వ్యాప్తి

యూరపుఖండమందలి తక్కిన ⅔ భాగములో కూడ—అనగా ఫ్రాన్సు, ఇటలీ, పశ్చిమజర్మనీ, హాలెండు, బెల్జియం, స్కాండినేవియా దేశములందు కూడ కమ్యూనిస్టుల సాధనమున తమ అధికారమును, పలుకుబడిని వ్యాపించుటకై రష్యావారు ఉద్దేశించియున్నారు. ఈ ఉద్దేశము కొనసాగుటలో కొన్ని పరిస్థితులు వారికి అనుకూలములుగ నున్నవి. రెండవ ప్రపంచ యుద్ధమున కలిగిన నష్టముమూలమున ఈ దేశములన్నిటియొక్క ఆర్థికస్థితిగతులు బహు క్లిష్టములుగ నున్నవి. సుభిక్షములుగనుండి అపరిమితముగ ఆహారపదార్థములను, పాలు, వెన్న, మీగడ, జున్ను, గుడ్లు, మాంసము మొదలగువాటిని ఎక్కువగా ఉత్పత్తిచేయుటకు వీలుగనుండిన పంటభూములు, వస్త్రములు, ఉక్కు, ఇనుము, యంత్రములు, దైనికజీవితమునకు కావలసిన ఇతరపరికరములు మొదలగువాటిని తయారుచేయుచుండిన కర్మాగారములు, రోడ్లు, ఇనుపదారులు మొదలగు రవాణాసౌకర్యములు వినాశముగాంచెను. తినుటకు అన్నము లేక, కట్టుకొనుటకు బట్ట లేక ఆకలిబాధ చేతను, చలిబాధచేతను కోట్లకొలదిజనము ప్రస్తుతము అనుభవించుచుండు కష్టములు వర్ణనాతీతములు. వీటిని నివారించుటకు అక్కడివారందరు ఉపాయములను వెదుకుచున్నారు. యుద్ధకాలమందును యుద్ధానంతరమునను చెలామణినోట్లు విపరీతముగ వ్యాప్తిలోనికి వచ్చుటచేత వస్తువుల ధరలు నాలుగైదురెట్లు పెరిగెను. కాని కార్మికుల కూలీలు ఇంత ఎక్కువగ పెరగలేదు. వ్యవసాయదార్లు పండించు పదార్థముల ధరలుకూడ ఇంత అధికముగ పెరిగియుండలేదు. కార్మికులు ఎక్కువకూలీలు కావలెనని ప్రతిదేశమందును ఆందోళన చేయుచున్నారు; అందుకై చీటికిమాటికి సమ్మెలు కట్టుచున్నారు. పదార్థములన్నిటికి కరవుగనుండు సమయములో ఈ సమ్మెలు క్షామబాధ మరింత అధికమగుటకు కారణమగుచున్నవి. కూలీలు హెచ్చైనయెడల ధరలు మరింత పెరుగునని ప్రభుత్వమువారు భయపడి కూలీలను అధికముచేయుటకు వెనుదీయుచున్నారు. ఇట్టి సందర్భములో సామాన్యప్రజలు దిక్కు తెన్ను లేక కమ్యూనిస్టుల ప్రచారమునకు లొంగిపోవుచున్నారు. దరిద్రులు ధనికులు అన్న భేదమును నిర్మూలముచేసి, కష్టపడి పనిచేయు కర్షకులను కార్మికులను ఐశ్వర్యవంతులుగ చేయుగల విధానము కమ్యూనిస్టువిధానమొక్కటే అని వారు చెప్పు మాటలకు అనేకులు లొంగిపోవుటలో ఆశ్చర్యమేమియు లేదు. యూరపు ఖండమందు కమ్యూనిస్టుపక్షమువారికి కొంత ప్రాబల్యము లభించుటకు ఇదియే కారణము. క్లిష్టములగు ఆర్థికపరిస్థితులు, క్షామము, ఆకలిబాధ—ఇవియే కమ్యూనిస్టుసిద్ధాంతవ్యాప్తికి కారణమన్నమాట మనము జ్ఞాపకముంచుకొనవలెను.

## కమ్యూనిస్టులపై దాడి

కాని కమ్యూనిస్టు ప్రచారమును, సిద్ధాంతమును ఎదుర్కొన దృఢనిశ్చయులుగ నున్న ప్రభుత్వములు కొన్ని గలవు. వాటిలో ప్రధానములైనవి అమెరికా బ్రిటిష్ ప్రభుత్వములు. ఇటలీ, ఫ్రాన్సు మొదలైన మరి కొన్ని దేశములలోని ప్రస్తుత ప్రభుత్వములుకూడ ఇట్టివే కాని, అమెరికా బ్రిటిష్ ప్రభుత్వముల కుండు శక్తిసామర్థ్యములు వీటికి లేవు. ఈ రెంటిలోకూడ అమెరికాకు ఉండునంతటి బలము బ్రిటిష్ వారికి లేదని చెప్పవచ్చును. అమెరికావారు కమ్యూనిస్టులపై దాడి జరుపుటకు ప్రబలకారణము లున్నవి. కమ్యూనిజం వ్యాప్తిగాంచినయెడల రష్యావారి సామ్రాజ్యము వ్యాప్తిగాంచుట అని వారి అభిప్రాయము. ఇప్పటికే బలవంతులుగ నుండు రష్యావారు కమ్యూనిజం మూలమున మరింత బలవంతులగుట అమెరికా వారికి ఇష్టములేకపోవుటలో ఆశ్చర్యము లేదు. ఇదిగాక ఇప్పటివరకు దౌర్జన్యమును, ఏకపక్ష నియంతృత్వమును ఉపయోగించియే కమ్యూనిస్టులు అధికారములోనికి రాగలిగిరి. రష్యాలోని కమ్యూనిస్టువిప్లవమునకు ఇదియే లక్షణము. తూర్పుయూరపు ఖండములోని ఇతరదేశములు ఈవిధముగనే కమ్యూని

స్టులు అధికారములోనికి వచ్చిరి. వ్యక్తిస్వాతంత్ర్యమునకును, వాక్స్వాతంత్ర్యమునకును, వివిధరాజకీయపక్షముల స్వేచ్ఛకును కమ్యూనిస్టువిధానము విరోధి యన్న భావము అమెరికావారిలోను, బ్రిటిష్‌వారిలోను నాటుకొనియున్నది. ఆ కారణముచేత కమ్యూనిస్టు విధానము ప్రజాప్రభుత్వమునకు విరోధియనికూడ వారు అభిప్రాయపడియున్నారు. ప్రజాప్రభుత్వవిధానమే శ్రేష్ఠతమమైన రాజ్యాంగవిధాన మని విశ్వసించు అమెరికనులు కమ్యూనిజముపట్ల ద్వేషభావము వహించుట సహజమే. ఇదిగాక తత్వరీత్యాకూడా కమ్యూనిజం లోపభూయిష్ఠమని వారి వాదము. వా రిట్లు వాదించుటకు గల కారణములన్నిటిని పేర్కొనుటకుగాని, అందులోని గుణాగుణములను విమర్శించుటకుగాని ఇచ్చట అవకాశము లేదు. క్రైస్తవమతము, మహమ్మదీయమతము, హిందూమతము మొదలగు మతములలో హేతువాదమునకు లొంగని సిద్ధాంతము లనేకములున్నట్లు కమ్యూనిజంలోకూడ ఇట్టి సిద్ధాంతము లనేకము లున్నవి. అదికూడ ఒక మతమే. మూఢవిశ్వాసము లేక ఏమతమూ నిలబడజాలదు. ఇంతకును రష్యావారి ప్రోద్బలముచేత అనేక దేశములలో కమ్యూనిజం వ్యాప్తిగాంచుచున్నదేగాని దాని స్వశక్తిచేత కాదు. ప్రజల ఆమోదము మూలమున కూడ కాదు. కత్తి చేతపట్టుకొని, ప్రజలను భయపెట్టి, దౌర్జన్యము మూలముగ మతవ్యాప్తి గావించినవారు ప్రపంచములో ఎందరో కలరు. ప్రపంచచరిత్రయే దీనికి దృష్టాంతము. కమ్యూనిజంకూడ ఇట్టిదే.

## కమ్యూనిజాన్ని ఎదుర్కొనుటకు నూతన సాధనము

కమ్యూనిజాన్ని, రష్యావారి ఆధిక్యతను ఎదుర్కొనుటకు కొన్ని నెలలక్రిందట అమెరికా అధ్యక్షుడగు ట్రూమన్ ఒక సిద్ధాంతమును ప్రతిపాదించి, దాని ననుసరించి ఒక సాధనమును ఉపయోగించ జూచెను. రష్యావారి ఒత్తిడికి లోబడనున్న గ్రీసు టర్కీ దేశములకు సైనికసహాయము చేయుటయే ఈ సాధనము. కాని సైనికసహాయము దౌర్జన్యముతో కూడుకొన్నదనియు, దానిమూలమున యుద్ధపరిస్థితులు ఏర్పడుననియు అనేకులు ట్రూమన్‌ను ఖండించసాగిరి. అందుచేత ఇట్టి ఖండనమునకు అవకాశము లేని సాధనాంతరము నొకదానిని గతమాసములో ట్రూమన్‌కు ప్రధానసలహాదారుడగు జనరల్ మార్షల్ సూచించెను. ఈ నెలలో జాలంగ ప్రపంచములోని ప్రధానములగు దేశము లన్నిటియందును ఈ సూచననుగురించియే వాదప్రతివాదములు అమితముగ జరుగుచున్నవి. దీనిలో ముఖ్యములైన అంశములు రెండుగా నున్నవి. (౧) యూరపుఖండములోని ప్రజలు దారిద్ర్యబాధ ననుభవించుచుండుటచేతనే వారు కమ్యూనిస్టుల ప్రచారమునకు లొంగిపోవుచున్నారు. ఈ బాధను తొలగించినయెడల అట్టి లొంగుపాటుకూడ తొలగిపోవును. ఇందుకుగాను అమెరికావారు కావలసిన సహాయం



జనరల్ మార్షల్

తయం చేయుటకు సంసిద్ధులైయున్నారు (౨) అయితే ఈ సహాయము చేయుటకుపూర్వము ఎంతటి సహాయము అవసరమో నిర్ణయింపవలసియున్నది. ఈ నిర్ణయము చేయు బాధ్యత యూరపువారు వహించవలెను. ఆ ఖండమందలి దేశములలోని ప్రతినిధు లందరు ఒకచోట సమావేశమై వారి అవసరము లెట్టివో, ఆ అవసరములు తీరుటలో పరస్పరసహాయము ఎంతవరకు వీలగునో, ఏయే దేశములవారు ఏయేపదార్థములను ఎంత

వరకు తయారుచేయగలరో ముందలగు విషయములను నిర్ణయించుచు ఒక ప్రణాళిక తయారుచేయవలెను. దానిమూలమున ఎంత సహాయము అమెరికావారు చేయవలసినదీ స్పష్టమగును. (3) ఈ ప్రణాళిక తయారు చేయుటయందు ఏ దేశమునకు ఆ దేశముగాక, అన్ని దేశములు కలిసి పనిచేయవలెను. రాజకీయముగ యూరపుఖండము అనేక దేశములుగ విభాగమైయున్నను ఆర్థికముగ ఖండమంతయు ఒకే ప్రదేశమన్న భావముతో ఈ దేశములవారు ప్రవర్తించవలెను. బెల్జియం, హాలెండు దేశములకు కావలసిన పదార్థములు ఫ్రాన్సులో దొరికినచో ఫ్రెంచివారు వాటిని ఆ దేశములకు పంపించుటకు వెనుదీయరాదు. ఫ్రాన్సుకు కావలసిన పదార్థములు జర్మనీలో తయారుచేయుటకు వీలైనయెడల అట్టివాటిని జర్మనీలో తయారుచేయుటకు ఏర్పాటులు జరగవలెను. ఈ విధముగ యూరపు ఖండములోని వివిధదేశములవారు ఏకీభావముతో మెలగగలిగినయెడల అమెరికావారు చేయవలసిన సహాయము క్రమబద్ధముగ నుండుననియు, యూరపుఖండపు ఆర్థిక పునర్నిర్మాణము జయప్రదమగుననియు జనరల్ మార్షల్ సూచనలోని ప్రధానలక్షణము. ఆర్థికకష్టములు తొలగిపోవుటకు కమ్యూనిజంకంటె అమెరికావారి ధనసహాయము శ్రేష్ఠమైన సాధనమని మార్షల్ ఋజువుచేయదలచెను.

## మార్షల్ ప్రణాళిక

ఈ ప్రణాళిక అందరికీ సమ్మతముగ నుండదగినదనియు, దాని ననుసరించి యూరపులోని అన్ని దేశములవారు కలిసి పనిచేయుట ఉత్తమమనియు బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్, ఫ్రాన్సు విదేశాంగమంత్రి బీడో, ఇటలీ, హాలెండు, బెల్జియం ప్రభుత్వములవారు తెలియబరచిరి. కాని ఈ దేశములతో రష్యా ఏకీభవించునా అన్న విషయముపై సందేహమేర్పడెను. కొన్ని రోజుల వరకు రష్యావారు ఏకీభవించరనియే అనేకులు అనుకొనుచుండిరి. కాని బెవిన్ బీడో రష్యన్ విదేశాంగ మంత్రియగు మొలటోవుతో సంప్రతింపులు జరిపిరి. తుదకు వీరు ముగ్గురు ఒక తేదీన పారిస్ నగరములో సమావేశమై మార్షల్ ప్రణాళికను గురించి ఆలోచించుచున్నారు. వీరిలో వీరికి ఏకాభిప్రాయము కుదురునో కుదురదో చెప్పుటకు వీలులేదు. గత రెండుసంవత్సరములనుండి ప్రధానవిషయములన్నిటియందును రష్యా ఒకపక్షముగను, అమెరికా బ్రిటన్ ఫ్రాన్సువారు మరియొకపక్షముగను వహించియుండిరి. ఇప్పటికికూడ వారి మనస్సులు కలియలేదు. అమెరికన్ల ప్రాబల్యమును యూరపులో స్థాపించుటకు మార్షల్ ప్రణాళిక ఉద్దేశించియున్నదను అనుమానము రష్యనులకు కలదు. అమెరికనులకు అపారమైన ధనసంపత్తి కలదు. సాహుకారు దరిద్రులకు ఋణములనిచ్చి వారిని వశపరచుకొనునట్లు సాహుకారీవిధానమునకు ప్రధానాశ్రయమైన అమెరికా దారిద్ర్యము ననుభవించుచుండు యూరపుదేశముల వారికి ఋణములనిచ్చి వారిపై క్రమక్రమముగ సర్వాధికారమును చెలాయించునను భీతి రష్యనుల కున్నది. ఇదిగాక యూరపులోని దేశములన్నియు కలిసి ప్రణాళిక నొకదానిని తయారుచేయుట ఆచరణయోగ్యము కాదని వారి అభిప్రాయము. రష్యావారిది కమ్యూనిస్టు ఆర్థికవిధానము. ఇతరదేశముల విధానము ఇంతకంటె భిన్నమైనది. ఇట్టి సందర్భములో అన్ని దేశములు కలిసి ప్రణాళిక తయారుచేయుట సాధ్యముకాని పని యని వారి వాదము. ఇట్టి సందర్భములో ప్యారిస్ నగరమున జరుగుచుండు మంత్రిత్రయసభ ఇదివరకు మాస్కోలో జరిగిన నాలుగుమంత్రుల సభవలె భగ్నమగునని తోచుచున్నది. అట్లు భగ్నమైనయెడల యూరపు రెండుభాగములుగ విడిపోవుట తప్పదు. తూర్పుభాగమంతయు రష్యావశముం దుండును. పశ్చిమభాగమంతయు బ్రిటన్ ఫ్రాన్సుల నాయకత్వమున అమెరికా ఆర్థికసహాయప్రణాళికను అనుసరించునది అగును. ఇందుమూలమున రష్యా అమెరికాల మధ్యన ఇదివరకుండు అభిప్రాయభేదములు, ద్వేషభావము మరింత అధికమగును.

## చైనా

గ్రీసు, టర్కీ, యూరపుఖండములోని ఇతర దేశములు మొదలగువాటికి ఆర్థికసహాయము చేసి, ఆ

ఖండమందు తమ ప్రాబల్యమును వృద్ధిచేసుకొనుటకు ప్రయత్నించుచుండు అమెరికాయొక్క ప్రయత్నములను భగ్నపరచుటకు రష్యావారు మరియొక మార్గమును అనుసరించుచున్నారు. చైనాలోని జాతీయ ప్రభుత్వమునకు కొంతవరకు అమెరికావారు సహాయము చేయుచుండుట అందరికి తెలిసిన విషయమే. ఈ సహాయముతో వారు కమ్యూనిస్టులతో యుద్ధము చేయుచున్నారు. కమ్యూనిస్టుల సహాయమున తమ పలుకు బడిని చైనాలో వ్యాపింపజేయుటకు రష్యా వారు గతమాసములో ఒకపన్నుగడనుపన్నిరి. చైనాలో పశ్చిమభాగమున సింకియాంగురాష్ట్రమొకటి యున్నది. దీని ప్రక్కనే ఔటర్ మంగోలియా (Outer Mongolia) అను రాజ్యమున్నది. ఈ రాజ్యము రష్యా వారి మిత్రమండలిలో చేరినది; కమ్యూనిస్టుల అధీనములోనిది. మంగోలియనులకు కొంత సహాయము చేసి, వారిని సింకియాంగుపైకి దండెత్తునట్లు రష్యావారు ప్రోత్సాహపరచిరి. చైనాకు ఈశాన్యమున మంచూరియా అను రాష్ట్రము కలదు. ఇది చైనాలో ఒక భాగము. కాని ఇందు కమ్యూనిస్టులు ప్రబలులుగ నున్నారు. చైనా అంతర్యుద్ధములో కమ్యూనిస్టులకు ఇదివరకు లభించిన విజయములకు ఈ ప్రాబల్యమే కారణము. రష్యావారు ప్రస్తుతము కమ్యూనిస్టులకు మరింత సహాయము చేసి వారిమూలమున చైనాప్రభుత్వమును చిక్కులపాలు గావింపజూచుచున్నారు. ఇదే జయప్రదముగ సాగినయెడల అమెరికావారి ప్రాబల్యమునకును, పేరుప్రతిష్ఠలకును చాల భంగము కలుగును.

## పాశ్చాత్యుల సామ్రాజ్యకాంక్ష

స్వలాభమే ప్రధానోద్దేశముగ పెట్టుకొని ఒక దేశమువారు మరియొక దేశమువారిపై అధికారము చెలాయించుటయే సామ్రాజ్యవిధానము. దీనిని అంతరింప చేయుటకై రెండవ ప్రపంచయుద్ధమును చేయుచున్నామని మిత్రమండలివారు ప్రకటించిరిగాని యుద్ధానంతరము జరుగుచుండు చర్యలన్నియు ఈ ప్రకటనకు విరుద్ధముగనున్నవి. రష్యావారు తూర్పుయూరపుదేశములపై అధికారమును స్థాపించుట దీని కొకకారణము అమెరికావారు జపాన్‌దేశముపై తమ అధికారమును స్థాపించుకొనియున్నారు. రాజకీయఆర్థికవిషయములందన్నిటియందును వారిదే శాసనము. జపాన్‌వ్యవహారములను నడుపుటకు మిత్రమండలిసభ యొకటి ఉన్నను దానికి పేరునకుమాత్రమే అధికారము. నిజమైన అధికారమంతయు అమెరికన్ సేనానియగు మెక్ ఆర్థరునందే ఉన్నది. ఆ అధికారమును అతడు చక్కగ వినియోగించుట లేదని బ్రిటన్ ఆస్ట్రేలియా మొదలగుదేశములవారప్పుడప్పుడు విమర్శించుట కలదు. గతమాసములో కూడ రెండుమూడు విషయములనుగురించి అట్టివిమర్శ జరిగెను. కాని అతడుమాత్రము ఆ విమర్శలను లక్ష్యపెట్టక ఇష్టానుసారము ప్రవర్తించుచున్నాడు. పాశ్చాత్యుల సామ్రాజ్యకాంక్ష అడుగంటలేదన్న దానికి ఇండొనీషియాలో ఇప్పుడు జరుగుచుండు చర్యలు మరియొక కారణము. రెండుసంవత్సరములుగ డచ్చివారితో పోరి జాతీయపక్షమువారు జావా సుమత్రాలలో ఇండొనీషియన్ రిపబ్లిక్ (Indonesian Republic) అను రాజ్యమును స్థాపించిరి. ఆ పక్షమును ఓడించుట సాధ్యముకానిపని అని డచ్చివారు గ్రహించి కొన్ని నెలలక్రిందట వారితో ఒక రాజీ చేసుకొనిరి. కాని అధికారమును వదలుకొనుటకు వారు హృదయపూర్వముగ ఇష్టపడినట్లు లేదు. రాజీజరిగినతర్వాతకూడ తమ అధీనములో నుండు ప్రదేశములలో తమ సైన్యములను వృద్ధి చేసుకొనిరి. మన దేశములో బ్రిటిష్‌వారు పాకిస్థాన ఉద్యమమును లేవదీసినట్లు డచ్చివారుకూడ ఇండొనీషియాలో విభజనోద్యమము నొకదానిని లేవదీసి రిపబ్లికుకు పోటీగా మరిరెండు రాజ్యములను నిర్మాణము చేసిరి. ౧౯౪౯ ప్రారంభమున రిపబ్లిక్ సర్వస్వాతంత్ర్యము ననుభవింపవలెనని రాజీలో ఒకసూత్రము. ఈ మధ్య కాలములో తాత్కాలికప్రభుత్వము (Interim Government) ఒకటి స్థాపితముకావలయునని ఇరుపక్షములవారు అంగీకరించిరి. కాని ఈ ప్రభుత్వములో ఏయేపక్షమువారికి ఎన్నిస్థానములు ఉండవలయును నను విషయములో డచ్చివారిప్పుడొక పేచీని లేవదీసియున్నారు. బ్రిటిషుఅధికారమును నిర్మూలముచేయుటకు మన దేశములో కాంగ్రెసుపక్షమువారు కష్టము

లను, నష్టములను భరించి అనేక త్యాగములు చేసినను ఫలితము అనుభవించు సమయము వచ్చినపుడు ఎట్టి త్యాగము చేయని ముస్లింలీగువారు దేశములో భాగము కోరినట్లు డచ్చివారితో రిపబ్లికన్లు యుద్ధము చేసినప్పుడు తటస్థులుగ నుండిన ఇతరరాజ్యములవారు రిపబ్లికనులతో సమానప్రాతినిధ్యమును, స్వాతంత్ర్యమును కోరుచున్నారు. కష్టపడువాడొకడు, ఫలము ననుభవించువాడు ఇంకొకడు—ఇట్టి న్యాయమును పాలించుటకు డచ్చివారు సంసిద్ధులై యున్నారు. ఒడంబడిక జరిగినతర్వాత డచ్చివారు వారి సైన్యములను వృద్ధి చేసుకొనిరిగాని రిపబ్లికనులు అట్లు చేయలేకపోయిరి. దానికి కావలసిన ఆర్థికవసతులు వారికి లేవయ్యెను. అమెరికన్లను వారు ౨౦ కోట్ల డాలర్ల ఋణసహాయమును కోరిరి. కాని వారిప్పటివరకు ఆ ఋణమును ఇయ్యకపోవుటయేగాక, డచ్చివారి షరత్తులకు అంగీకరించినగాని తాము ఆ ఋణము ఇచ్చుటకు వీలులేదని తెలియబరచిరి. బ్రిటిష్‌వారి సలహాకూడ ఇట్లే ఉన్నది. డచ్చివారి షరత్తులను అంగీకరించుటకు రిపబ్లికన్ నాయకులందరు ఇష్టపడుట లేదు. రెండుపక్షములవారికి యుద్ధము సంభవించనున్నది. యూరపులోని డచ్చివారి సంఖ్య ౮౦ లక్షలు. ఇండోనేషియాలో ౧౦ కోట్ల జనమున్నారు. రెండవ ప్రపంచయుద్ధములో తమ దేశమును రక్షించుకొనలేక డచ్చివారు జర్మనులకు లొంగిపోయిరి; ఇండోనేషియాను జపాన్‌వారికి స్వాధీనము చేసిరి. ఇట్టివారు ఇప్పటికైనను తమ బలహీనతను గ్రహించక, ౧౦ కోట్ల ఇండోనేషియన్లను దాస్యమునుండి విముక్తిచేయకుండుటకు నిర్ణయించుకొనియున్నారు. ఈ నిర్ణయము కొనసాగుటలో అమెరికావారు, బ్రిటిష్‌వారు వారికిసహాయపడుటకు సిద్ధముగానున్నారు. ఇండోచైనాలో ఫ్రెంచివారి ఉద్దేశముకూడ ఇట్టిదే. స్వాతంత్ర్యమునకై పోరాడుచుండు వియట్‌నాం ఎన్ని పర్యాయములు రాజీకి ప్రయత్నించినను ఫ్రెంచివారు వారి మాటలను చెడచెవిని పెట్టుకొని యున్నారు.

## భరతఖండము

ఆధునికభరతఖండచరిత్రమందు గతనెల బహు విషాదకరమైన ఘట్టమని చెప్పవలసియున్నది. బ్రిటిష్ వారితోను, లీగువారితోను కొన్నిసంవత్సరములనుండి సంపూర్ణ స్వరాజ్యసంపాదనార్థమై కాంగ్రెసువారి నాయకత్వమున ప్రజలు గావించుచుండిన యుద్ధమందు ప్రజలు ఓడిపోయిరి. దానిమూలమున దేశవిభజనకును, పాకిస్థాన్ స్థాపనకును, సంపూర్ణ స్వాతంత్ర్యమునకు బదులు అధినివేశ ప్రతిపత్తికిని (Dominion Status) వారు అంగీకరించవలసి వచ్చెను. అరవై సంవత్సరములుగ తలపెట్టిన ఆదర్శమును, సంకల్పమును వదలుకొనవలసిన పరిస్థితులు ఏర్పడుటకంటె విషాదకరమైన అవస్థ ఏదికలదు?

రాజ్యాంగతంత్ర ప్రయోగమందు బ్రిటిష్‌వారు ఆరితేరిన వృద్ధులు. దౌర్జన్యప్రయోగమందు లీగువారు కడు సమర్థులు. తంత్రప్రయోగమునందు కాంగ్రెసు నాయకులు పసిపిల్లలు; అధికారసంపాదనమందు దౌర్జన్యమును నిరాకరించినవారు. వారి అపజయమునకు ఇదియే కారణము. గతసంవత్సరము మేనెలలో ప్రకటింపబడిన మంత్రిత్రయప్రణాళిక మొదలు మౌంటుబాటన్ ప్రభువు ప్రకటించిన ఈ జూన్ 3 తేదీ ప్రణాళికవరకు జరిగిన విషయములనుగురించి కొంత ఆలోచించినయెడల ఇట్టి అపజయములు ఎన్నో రానున్నవని చెప్పవలసియున్నది. ఇవి రాకుండ మనము ఏమైనచేయగలమా అన్న విషయమునుగురించి మన నాయకులు, ప్రజలు ఆలోచించవలసిన సమయము సంప్రాప్తమైనది.

## బ్రిటిష్ వారు

గతఫిబ్రవరిలో అట్లీప్రధాని గావించిన ప్రకటనమందు ౧౯౪౮ జూన్ ఆఖరులోపుగ బ్రిటిష్‌వారు వారి అధికారమునంతను భారతీయులపరము చేయుటకు సిద్ధపడినట్లు చెప్పిరి. ఆ ప్రకటనలో సూచించిన అధికారపరివర్తనమును అమలులో పెట్టుటకు జూన్ 3 తేదీన వారు మరియొక ప్రకటనను చేసిరి. దీనిలోని సూచనలకు కాంగ్రెసువారు, లీగువారు అంగీకరించిరి. ఇట్టి ప్రణాళికకు ఉభయపక్షములవారి ఆమోదమును సంపాదించగలుగుటయే బ్రిటిష్‌వారి తంత్రకౌశల్యమునకు తార్కాణము. పైకి వారి అధికారము తొలగినట్లు కనబడుచున్నది; కాని నిజముగ వారి అధికారము రూపాం

తరమును పొందినదనియే చెప్పవలెను. ఇట్లనుటకు అనేక కారణము లున్నవి. జూన్ 3 తేదీ ప్రకటనను అనుసరించి ఏర్పడిన పాకిస్థాన్, ఇండియన్‌యూనియన్లు కొంతకాలమువరకు డొమినియన్లుగ నుండుట మొదటి కారణము. డొమినియన్లు అనగా బ్రిటిష్‌రాజునకు లోబడిన రాజ్యములని అర్థము. అవి బ్రిటిష్‌సామ్రాజ్యములోని అంతర్భాగములు. బ్రిటన్‌తో అనేక విషయములందు సన్నిహితసంబంధము గల ప్రదేశములు సర్వస్వామ్యము, సంపూర్ణస్వాతంత్ర్యమును అనుభవించునవి కావు. ఇదిగాక దేశమంతయు ఒక డొమినియన్ అగుటకుబదులు అనేకడొమినియన్లుగ విభాగమగుటచేత బ్రిటిష్‌వారి పలుకుబడి తగ్గకుండుటకు కావలసిన పరిస్థితులు ఏర్పడెను. ఈ ప్రకటనమూలమున రెండు డొమినియన్లుమాత్రమే దేశమందు స్థాపితమయ్యెనని చెప్పుటకు వీలులేదు. బ్రిటిష్‌పాలనలో ఉండిన ఇండియామాత్రము రెండుముక్కలుగ చీలిపోయెను. కాని, దేశములో ఎన్ని సంస్థానములు కలవు? ఈ సంస్థానములపై ఇదివరకు బ్రిటిష్‌వారి కుండిన సామ్రాజ్యాధికారము (Paramountcy) తొలగునని బ్రిటిష్ ప్రభుత్వమువారు ప్రకటించిరి. అట్లు తొలగినతర్వాత ఒక్కొక్కసంస్థానము ప్రత్యేకస్వతంత్రరాష్ట్రమై, బ్రిటిష్‌వారితో క్రొత్తఒడంబడికలు చేసుకొని, క్రొత్త డొమినియన్లు కావచ్చును. డొమినియన్లు అను పేరుతో ఇది ప్రవర్తించినను ప్రవర్తించకపోయినను బ్రిటిష్‌వారితో ఒడంబడికలద్వారా సంబంధము ఏర్పరచుకొను రాజ్యములు అనేకములు దేశమందు ఏర్పడుట సత్యము. అట్టి రాజ్యములలో బ్రిటిష్‌సైన్యములు, ఉద్యోగస్థులు, వర్తకులు ఉండుట అసంభవము కాదు. ఇదిగాక ఇవన్నియు చిన్నచిన్న రాజ్యములు. పాకిస్థానముకూడ ఆర్థికముగ మిక్కిలి వెనుకబడియుండు ప్రదేశము. బ్రిటిష్‌వారి సహాయములేక నిలబడజాలదు. ఇట్టి పరిస్థితులలో అధికారము బ్రిటిష్‌వారినుండి భారతీయుల చేతులలోకి మారెనని చెప్పుటలో కొంత సత్యముమాత్రమే ఉన్నది. మరికొంతకాలము, మరియొక పేరుతో, ఇంకొక రూపమున తమ అధికారమును భరతఖండమందు నిలబెట్టుకొనుటకు బ్రిటిష్‌వారు పన్నిన పన్నాగమే ఇదంతయు. ఇరవై అయిదు సంవత్సరములక్రిందట ఐర్లాండులో చేసినదంతయు ఇప్పుడు ఇండియాలో చేసిరి. వారి రాజనీతియందు ఎట్టి మార్పు లేదు. వారితో సంప్రతింపులు గావించుటకు వచ్చిన ఐరిష్ నాయకులు మోసపోయినట్లు ప్రస్తుతము కాంగ్రెసునాయకులు మోసపోయిరి. వారివలె వీరుకూడ వట్టిఅమాయకులుగ ప్రవర్తించిరి.

## లీగు

ఈ సంప్రతింపులలో కీర్తిప్రతిష్ఠలను నిలుపుకొని తన పట్టునుగెలిచినవాడు లీగునాయకుడగు జిన్నా. ౧౯౪౦ లో అతని నాయకత్వమున ముస్లింలీగువారు లాహోరుసమావేశమందు పాకిస్థాన్‌స్థాపనమునకై ఒక తీర్మానము చేసిరి. దాని ఉద్దేశము దేశమునందు ప్రత్యేకమహమ్మదీయరాజ్యమును స్థాపించుట. అందుకై అతడుగాని, అతని అనుచరులుగాని ఎట్టిత్యాగము చేసినవారు కారు. కాంగ్రెసు అవునన్నదానిని కాదనియు, కాదన్నదానిని అవుననియు ప్రతిఘటించి, బ్రిటిష్‌వారికి సుముఖులుగ నుండుటయే వారుపయోగించిన సాధనము. కనుక బ్రిటిష్‌వారు పాకిస్థానము విషయమై తమకు సహాయముచేయుదురను విశ్వాసము వారికి కుదిరెను. కాంగ్రెసువారేమైన ఆటంకములు కలిగింతురేమో అను అనుమానము వారి కొకప్పుడు ఉండెను. ఆ అనుమానమును తీర్చుకొనుటకై వారు మొట్టమొదట బంగాళమందును, తర్వాత పంజాబునందును, వాయవ్యసరిహద్దురాష్ట్రమందును నిరాయుధులగు హిందువులు, శిక్కులు మొదలగు అల్పసంఖ్యాకులపైబడి, వారిని నానావిధముల హింసించి, వారికి ప్రాణమాన అర్థనష్టములను కలిగించి భయపెట్టిరి. ఇట్టి హింసనుండి మహమ్మదీయేతరులను రక్షించుటకు కాంగ్రెసుకు శక్తిసామర్థ్యములు లేవయ్యెను. నెహ్రూ, పటేల్ మొదలగువారు తాత్కాలికప్రభుత్వమందు సభ్యులుగ నున్నమాట వాస్తవమే. కాని సభ్యత్వము మాత్రమే వారిది. అధికారముమాత్రము గవర్నరుజనరలు, గవర్నరులది. సైన్యములు పోలీసువారి అధీనమందుండెను. శాంతిభద్రతలను కాపాడుటకై తాము భరతఖండములో ఉండునట్లు ప్రగల్భములు పలుకు

చుండిన బ్రిటిష్ అధికారులు లీగువారి దౌర్జన్యమును
ఆపుటకుగాని, అల్పసంఖ్యాకులను రక్షించుటకుగాని
సిద్ధపడరైరి. బ్రిటిష్ అధికారులు, లీగుఅనుచరులు కలి
యుటచేతనే బంగాళము మొదలగు మూడు రాష్ట్రము
లందును గత అయిదారుమాసములలో జరిగిన దారుణ
కృత్యములు జరుగుటకు అవకాశ మేర్పడెను. ఇట్టి
ఘోరమును చూడలేక, కాంగ్రెసునాయకులు పాకిస్థాన్
స్థాపనకు అంగీకరించిరి.

## పంజాబు బంగాళముల విభజన

జిన్నాకు కలిగిన విజయము సంపూర్ణమైనది
కాదనియు, పాకిస్థానములో అతడు చేర్చుకొనదలచిన
పంజాబు, బంగాళము, ఆసాం అతనికి పూర్తిగ లభిం
చలేదనియు, పంజాబుబంగాళములలో కొంతభాగము
విడిపోయి ఇండియన్‌యూనియనులో కలిసియుండుట
చేత ఇప్పుడు ఏర్పడిన పాకిస్థానము మొండెములేని
పాకిస్థానమనియు కొందరు వాదించుచున్నారు. కాని
ఇందులో సంతోషింపదగిన అంశము లేవియు లేవు.
అఖండహిందూస్థానవాదులకును, భరతఖండమంతయు
ఒకే కేంద్రప్రభుత్వముక్రింద నుండుటయే శ్రేయస్కర
మని విశ్వసించుచుండినవారికిని జూన్ ౩ తేదీ ప్రక
టనమూలమున కలిగిన అపజయముగాని, ఆవేదన
గాని దీనిమూలమున అదృశ్యము కాజాలదు. ఇదిగాక
మరొకవిషయముకూడ గమనించవలసి యున్నది. ఏ దౌర్జ
న్యమును ఉపయోగించి, పరిమితపాకిస్థానమును లీగు
వారు సాధించిరో అట్టి దౌర్జన్యమునే వారు మరియొక
పర్యాయము ఉపయోగించి వా రిప్పుడు కోల్పోయిన
పంజాబు బంగాళములలోని ప్రదేశములను తిరిగీ వశ
పరచుకొనజాలరని ఎవరు చెప్పగలరు? డొమినియన్
ప్రభుత్వము పాకిస్థానములో ఏర్పడినక్షణమునుండి
లీగువారికి సైన్యములు, ఆకాశవిమానములు, మందుగుండు
సామానులు లభ్యములగును. ఇట్టివి లేనప్పుడే దౌర్జన్యము
నుపయోగించి కాంగ్రెసును బెదిరించి భయపెట్టిన లీగు
వారు ఇవన్నియు లభించినతర్వాత ఎట్లు ప్రవర్తిం
తురో! గనుక పాకిస్థాన్‌సంస్థాపనమునకు కాంగ్రెసు
వా రంగీకరించుటతో దేశములో శాంతిభద్రతలు ఏర్ప
డుననియు, లీగువారు కాంగ్రెసువారితో సామరస్య
ముగ ప్రవర్తింతురనియు అనుకొనుట పొరపాటు.
పాకిస్థాన్‌సంస్థాపనముతోడనే మనకష్టములన్నియు
ప్రారంభమైనవని మనము నమ్మవలసియున్నది. రాను
రాను దానిమూలమున అవి వృద్ధికాగలవు.

## కాంగ్రెసు

కాంగ్రెసునాయకులకు ఇంతటి దూరదృష్టి
లేదా? ఇట్టిప్రమాదములు సంభవించునని తెలియక
వారు పాకిస్థానమునకు అంగీకరించిరా? అను ప్రశ్న
కొందరు వేయవచ్చును. జూన్ ౧౪, ౧౫ తేదీలలో
సమావేశమైన అఖిలభారతకాంగ్రెస్‌కమిటీ చర్చలను
సావధానముగ పరిశీలించినయెడల ఈ ప్రశ్నలన్నిటికి
సమాధానము లభించును. జూన్ ౩ తేదీ ప్రణాళికను
కాంగ్రెసువా రంగీకరించుటకు కల్లోలభయమే ప్రధాన
కారణమని వాటిమూలమున స్పష్టము కాగలదు. కొన్ని
ప్రదేశములు దేశమునుండి విడిపోయినను తక్కిన భాగ
ములో మనము సర్వస్వతంత్రులుగ నుండగలమనియు,
౧౯౪౨ ఆగస్టు ౮ తేదీన కాంగ్రెసువారు గావించిన
"క్విట్ ఇండియా" తీర్మానము ఆచరణలోనికి వచ్చుట
మన మందరము కోరదగినదనియు, కొంతకాలమైన
తర్వాత పాకిస్థానము తిరిగి భరతఖండములో చేరగల
దనియు కాంగ్రెసునాయకులు వాదించిరి.
నాయకులు సమ్మతించిన ప్రణాళికను
ఎదిరించుట శ్లాఘ్యము కాదనియు, అందు ఎన్ని లోపము
లున్నను వారిని అనుసరించుటయే ధర్మమనియు,
ఇప్పటి నాయకులు తొలగిపోయిన యెడల వారికంటె
ఉత్తములగువా రెవ్వరు - నాయకత్వమువహింపతగ్గ
వారు లేరనియు, దేశమందు శాంతినెలకొనుట అత్య
వసరమనియు మహాత్మాగాంధీగారు వాదించిరి. కాని
దేశమందు నిజముగ శాంతినెలకొను సూచన లున్నవా?
లాహోరు, అమృతసరము, కలకత్తాలయందు ఇప్పటికి
కూడ దౌర్జన్యము అడుగంటలేదుగదా? సరిహద్దులను
నిర్ణయించవలసియున్నది. సైన్యము, ఆస్తులు, అప్పులు
మొదలగునవి విభాగము కావలసియున్నది. ఇదంతయు
దౌర్జన్యము లేక శాంతిమార్గమున జరుగగలదా?
కాంగ్రెసును చూచి లీగువారు భయపడు పరిస్థితులు దేశ

ముందు ఏర్పడునంతవరకు శాంతి ఉండజాలదని మన నాయకులు గ్రహించవలెను. దయ్యము దెబ్బకే పరచును. రాజకీయములలో హింసాహింసల ప్రయోగమునుగురించిన సిద్ధాంతములను కాంగ్రెసు నాయకులు పునర్విమర్శన చేయవలసిన తరుణము సంప్రాప్తమైనది.

## వాయవ్య సరిహద్దురాష్ట్రము

పాకిస్థానములో చేరని రాష్ట్రము లన్నియు ఐక్యభారతదేశములో చేరవలసియుండునని జూన్ 3 తేదీ ప్రణాళిక స్పష్టపరచెను. కాని వాయవ్య సరిహద్దురాష్ట్రములోని కాంగ్రెసువర్గమువారికి పాకిస్థానములోగాని, ఐక్యభారతములోగాని తమ రాష్ట్రము చేరుట సమ్మతముగ నుండలేదు. వారు తమ రాష్ట్రము సంపూర్ణస్వాతంత్ర్యము కలదిగ నుండవలెనని వాదించుచు, రాష్ట్రము పాకిస్థానములో చేరుటయా, హిందూస్థానములో చేరుటయా అనువిషయమును నిర్ధారణ చేయుటకై ఏర్పరచబడిన ఎన్నికలలో పాల్గొనక, దానిని బహిష్కరించుటకు తీర్మానించియున్నారు. కాని దీనివలన విస్తారము లాభముండదు. ఎన్నికలలో పాల్గొనువారు పాకిస్థానములో చేరవలయునని నిర్ధారణ చేయువారగుటచేత సరిహద్దురాష్ట్రము ప్రస్తుతము పాకిస్థానరాష్ట్రమగుట తప్పదు. అట్టిది జరిగినపుడు అప్పటి కాంగ్రెసుపక్షమువారు ఊరకుందురా? లేక సహాయనిరాకరణోద్యమమునో, సత్యాగ్రహమునో, దౌర్జన్యమునో ఉపయోగించి సంపూర్ణస్వాతంత్ర్యమునకు పోరదరా? అను విషయము సందిగ్ధముగ నున్నది.

## సంస్థానములు

దేశములోని సంస్థానములలో అనేకములు ఐక్యభారత (Indian Union) రాజ్యాంగపరిషత్తులో ఇదివరకే పాల్గొనుచున్నవి. మైసూరు మొదలగునవి కొన్ని రాబోవు సమావేశమునుండి పాల్గొనుటకు అంగీకరించియున్నవి. కాని హైదరాబాదు, తిరువాన్కూరు సంస్థానములు ఏ రాజ్యాంగపరిషత్తునందును చేరక సర్వస్వామ్యము (Sovereignty), సర్వస్వాతంత్ర్యము (Independence) గల రాజ్యములుగనుండ నిశ్చయించుకొన్నట్లు ఆ ప్రభుత్వములవారు ప్రకటించిరి. కొల్హాపూరు, భోపాల్, ఇండోరు, కాశ్మీరము మొదలగు మరికొన్ని సంస్థానములుకూడ ఇదేవిధముగ ప్రకటింపగలవని అనుమానము కలుగుచున్నది. బ్రిటిష్‌వారు మన దేశమునకు రాకపూర్వము ఇవి సర్వస్వాతంత్ర్యము ననుభవించుచుండినవనియు, వారి అధికారము తొలగగనే అట్టి స్వాతంత్ర్యము వాటికి తిరిగి లభింపవలసియున్నదనియు ఆ ప్రభుత్వములవారి వాదము. కాని కాంగ్రెసుపక్షమువారు ఈ వాదమునకు అంగీకరించక ఈ సంస్థానములన్నియు రాజ్యాంగపరిషత్తులో వెంటనే చేరవలెనో, లేక ఇదివరకు బ్రిటిష్ సామ్రాజ్యాధికారమునకు (Paramountcy) లొంగియుండినట్లు ఇకమీదట ఐక్యభారతమును పరిపాలించుటకై ఏర్పడు నూతన ప్రభుత్వమునకు లోబడియుండవలెననియు వాదించుచున్నారు. ఇందులో ఏ వాదము నెగ్గదగియున్నది? ఏ వాదము నెగ్గును? అను విషయము నిర్ణయించుట అవసరము. కాంగ్రెసుపక్షమువారి వాదమే నెగ్గదగియున్నదని చెప్పవచ్చును. దేశములో అనేక స్వతంత్ర రాష్ట్రము లుండుటకు బదులు, అన్నిభాగములు ఒక కేంద్రప్రభుత్వమునకు లోబడియున్నయెడల రక్షణ విషయమందును, వ్యాపారవిషయమందును, రవాణా సౌకర్యములు చెలామణి బ్యాంకింగు మొదలగువాటియందును ఎక్కువసౌష్ఠవము, లాభము, అనుకూలము తప్పక లభింపగలవు. ఇవి కాదని చెప్పసాహసించువారెవ్వరు ఉండరు. కనుక సర్వస్వామ్యమును వదలుకొని ఐక్యభారతములో అంతర్భాగములుగ నుండుటయే సంస్థానములు అనుసరించతగిన విధానము. ఇదియే ధర్మము, న్యాయము. కాని ఇది జరుగునా? అన్న విషయము వేరు.

## ధర్మము, న్యాయము, శక్తి

ధర్మము ఫలానిది అని తెలిసియు దాని ననుసరించుటకు మనము సిద్ధపడుట లేదను విషయము అందరి అనుభవములోనిదే. రాజకీయములలో కూడ ఇట్టి విపరీతము కనుపించుచునే యుండును. కాంగ్రెసువారి వాదము నెగ్గతగినది కావచ్చును. కాని అది నెగ్గునట్లు

చేయుటకు గల శక్తి కాంగ్రెసుప్రభుత్వమునకు కలిగి నప్పుడే అట్టి వాదమువలన లాభముండును. శక్తి లేని వాడు అట్టివాదము చేయుట నిష్ప్రయోజనము. ప్రస్తుతము కాంగ్రెసుకు అట్టిశక్తి ఉన్నదా అను విషయములో అభిప్రాయభేదమునకు అవకాశము లేనట్లు చెప్పవచ్చును. అట్టి శక్తి లేదనియే చెప్పవలసియున్నది. అలాటి శక్తి లేకపోవుటచేతనే కాంగ్రెసు నాయకులు లీగ్ వారికిని, బ్రిటిష్ వారికిని లొంగిపోయి పాకిస్థాన్ స్థాపనకు అంగీకరించిరి. అట్టి శక్తి సంపాదించినగాని వారు హైదరాబాదు తిరువాన్కూరు మొదలగు సంస్థానములు విశాలభారతములో చేరునట్లు చేయజాలరు. శక్తి అనగా సైన్యములు, ఆకాశవిమానములు, నౌకలు మొదలగునవిమాత్రమే కాదు. ప్రజల ఆమోదము, అనురాగము, భక్తివిశ్వాసములుగూడ శక్తిలోని అంతర్భాగములే. పాకిస్థాన్ స్థాపనవిషయములో లీగ్ వారు కాంగ్రెసును భయ పెట్టినట్లు, ప్రస్తుతము కొన్ని రాష్ట్రములలో సోషలిస్టులు, కమ్యూనిస్టులు వారిని బెదిరించుచున్నారు. ప్రజామోదమును సంపాదించుటకు కాంగ్రెసుతో ఈ పక్షములవారికి పోటీ ఏర్పడగలదు. అట్టి పోటీలో ఏపక్షమువారు గెలుతురో చెప్పజాలము. కాని, జయమును సంపాదించుటకు కావలసిన శక్తిని కాంగ్రెసువారు సమకూర్చుకొనగలిగినగాని వారు గెలువజాలరు.

## రాష్ట్రప్రభుత్వము

ప్రస్తుత పరిస్థితులలో ప్రజామోదమును సంపాదించుటకు పాటుపడవలసిన సంస్థలు రాష్ట్రములను పాలించు పూచీ వహించిన కాంగ్రెసుమంత్రివర్గముల వారు. ప్రజలకు కావలసినది అన్నము, బట్ట, తలదాచుకొనుటకు ఇల్లు మొదలైన సామాన్యసౌకర్యములు. వీటి నన్నిటిని సమకూర్చుగలవారు రాష్ట్రమంత్రివర్గము వారే. కేంద్రమందుండు కాంగ్రెసునాయకులు గొప్ప రాజకీయములలో నిమగ్నులైయుండుటచేత ఇట్టి దైనిక వ్యవహారములను చక్కబెట్టుటకు అవకాశము లేని వారైయున్నారు. కాని రాష్ట్రములోని మంత్రివర్గము వారు ఈ విషయములనుగురించి ఎంతటి శ్రద్ధ వహించవలెనో అంతటి శ్రద్ధ వహించుటలేదు. ౧౬ మాసములుగా వారు అధికారమందున్నను రాష్ట్రపు ఆర్థికాభివృద్ధికై వారెట్టి ప్రణాళికను తయారుచేసినవారు కారు. వ్యవసాయమందుకాని, చేతిపనులయందుగాని, మిల్లుల విషయమునగాని లెక్కపెట్టదగిన మార్పులేవియు కలుగలేదు. పర్యటనములలో మంత్రులైన వారు వాగ్దానము లనేకములు చేయుట మామూలైపోయినది. ఓపికతో ఎవరైనగాని ఈ వాగ్దానముల పట్టిక నొకదానిని తయారుచేయగలిగినయెడల ఆదర్శములకును, ఆచరణలకును ఎంతటి తారతమ్య ముండునది బోధపడగలదు. ఈలోపమును మన మంత్రివర్గము వారు వెంటనే సవరించినగాని కాంగ్రెసుపక్షమునకు శక్తి కలుగజాలదు. ఇప్పుడున్న శక్తిగూడ తగ్గిపోవు సూచనలు కనుపించుచున్నవి. వ్యవసాయదార్లకు అత్యవసరముగ కావలసిన పనిముట్లనుకూడ ప్రభుత్వమువారు సరఫరా చేయలేకున్నారు. ఇంతకంటె విపరీతము వేరు కలదా?

(2 7-47)



# కలగూరగంప

## మా ధర్మయాత్ర

ఇంకా ఒకరినొకరు తెలుసుకోలేదు. వివాహం అయ్యి నెలరోజు లయింది. అంతే. తీర్థయాత్రలు చేసిరావాలని అన్నారు. మమ్మల్ని తీసుకొని పెద్దలు తిరిగిరావా లనుకున్నారు.

ఎంతదూరమో! మద్రాసు వచ్చాము. అక్కడ నుంచి షోరనూరు వచ్చాము. ప్రయాణమంతటిలోనూ ముక్తసరిగా తెలుసుకోవడముతప్ప చనువుగా మాట్లాడుకోనే లేదు. ఆమెను పలుకరించి చేరికగా మాట్లాడి ఆమెను తెలుసుకోవాలని ఎన్నిసార్లు తాపత్రయ పడ్డానో. పెద్దలు కూడావున్నారు. భార్యచెంత భర్త చేరకూడదు. కాదూ? కొంచెం ఎడం వుండాలి; పిల్ల కట్టుబాట్లలో వుండాలి. మొగవాడికి ఒకవిధమైన ఘరానా వుండాలి. కొత్తపెళ్లి కూతురు భర్తతో మాట్లాడిందని తప్పుపట్టగల పెద్దలు చాలామంది వున్నారు. అందుకు అంతదూరం ప్రయాణం చేసినా దగ్గరగా కూర్చోలేక పోయాము. షోరనూర్ నుంచి ముప్పై రెండు మైళ్ల బస్సు ప్రయాణము. విపరీతమైన వర్షము. మలబారు సౌందర్యమునకు ఆటపట్టయిన చోటులో ప్రయాణము. ఒకచోట బస్సు తిరుపతికొండ ఎక్కినంత ఎత్తు ఎక్కిపోతుంది. క్రింద పెద్ద వాగు. ఆ ప్రక్కనా ఈ ప్రక్కనా సరిహద్దులు [illegible] కన్పించే పొలాలు. ఈ త్రోవలో ప్రయాణముచేస్తే రక్తమున్న మానవునికి ప్రతీవానికీ మమత కలుగుతుంది. వెర్రి అలమటింపు ప్రారంభిస్తుంది. వచ్చే ఆనందము తనతో ఎవరైనా పంచుకోవా లనిపిస్తుంది. ఈ లోయ ఎంత బావుందో అని తనకు చేరిన వారితో చెప్పకపోతే నిజమైన ఆనందము కలుగనే కలుగదు. రసానుభూతి పైకి వెలువడాలి.

ఆమెతో, నా సహధర్మచారిణితో, "ఈ అందం చూశావా? నా ఆనందము నాతో నువ్వు పంచుకోవూ?" అని అడగా లనుకుంటాను. ఎదురుగా, కాదు-పక్కగా కూర్చున్నా ఇంత చనువుగా మాట్లాడడానికి వీలు లేదు కాదూ? మామగారు! అత్తగారు!!

నాలో ప్రవహించే చక్కని ఆత్మ ఒక్కసారిగా నాలో అరికట్టబడిపోయింది. సౌందర్యము తన్మయుని చెయ్యగలదు; పిచ్చివానిగా చెయ్యగలదు. గురువాయూర్ వెళ్లేవరకూ ఆలోచనతే లేని స్వరూపంతో కూర్చున్నాను.

గురువాయూర్ చిన్న ఊరు; ప్రతిభ వున్న దేముడుట. గురువాయూర్ అప్పన్ అంత సాత్విక స్వరూపాన్ని నేను ఎక్కడా చూడలేదు. నంబూద్రీలు పది సానలమీద గంధం తీస్తున్నారు. ఎర్రని గుత్తిపువ్వులు పూజారి యిస్తాడు. పాలపాయసమూ, నేయ్యప్పమూ నైవేద్యము. వెర్రిబాధపడే మొక్కులూ, విపరీతపు ఆచారాలూ లేవు. ఎవరికైనా త్రాసులో తూచి తులాభారం యిస్తారు.

మా ఆవిడను నేంద్రంఫలములతో తులాభారము యిస్తామని మొక్కుకున్నారుట. ఆమెను త్రాసులో కూర్చోబెట్టేరు. ఎర్రని పట్టుచీర, ఎర్రని రంగుజాకెట్టు. మెడనిండా మొయ్యలేనన్ని నగలు. సిగ్గు పడిపోతూంది నా ఎదురుగా అలా కూర్చోడానికి. కాని అందమైన సందర్శనమంటే అదే. మొక్కుబడి అయిపోయింది. విడవలేక విడవలేక గురువాయూర్ విడిచిపెట్టేము.

అక్కడ ఆమెతో కొంచెము పరిచయమైంది. తెలుసుకో వీలుకలిగింది. పెద్దలూ ఆ ఉద్దేశ్యముతోనే వదిలిపెట్టేరు. అక్కడనుంచి యిద్దరమూ చేరికగా

మసీలేవాళ్లము. గురువాయూర్ నుంచి పళనీప్రయాణము. ౬౦ మైళ్లు బస్సులో ప్రయాణం చేసి పాల్ఘాటు వచ్చి, అక్కడనుంచి రైలులో రాత్రికిచేరాము.

పళనిలో మా ఉమచేత పాలకావిడ మోయిస్తామని మ్రొక్కుకున్నారుట. సోమవారంనాడు ప్రొద్దున్నే తలంటి నీళ్లుపోశారు, నీలంచీర పెద్దజరీ అంచుది కట్టబెట్టేరు. చక్కని వట్టివేళ్ల కావిడ కట్టి రెండు పాలచెంబులు రెండువేపులా వుంచారు. ఆమె మెడలో గులాబీలు గన్నపు పువ్వులదండలు వేశారు. నుదుట ఎర్రని బొట్టు. గుళ్లో కూర్చునే దేవతలా వుంది. ఆ కావిడతో మెట్లు కొన్ని ఎక్కేసరికి ఆమెకు ఆయాసంవచ్చింది. మెట్లెక్కలేక బాధపడుతూ ఆమె కావిడ మొయ్యలేకపోయింది. భార్యాభర్తలలో ఎవరు మోసినా ఫలం ఒకటే అన్నాడు. మాతో వచ్చిన నటరాజ ఓవర్సీర్. నేను ఆమెభుజంమీదనుంచి ఆ కావిడ తీసుకున్నాను. ఆమెకు ఎంతో ఆయాసం తగ్గింది. అలసిపోయిన శరీరంతో, మాటలు చెప్పనవసరములేని చూపులతో ఆమె కృతజ్ఞత వెలిబుచ్చింది. ఆ క్షణములో ఆమె నా అర్ధాంగి అయ్యింది. అంతటితో మా ధర్మయాత్ర ప్రారంభమయింది-ఉమతో నా సహధర్మచర్యం.

ఉమానంద్





# విమర్శనము



## ఉపనిషత్సారము

శ్రీనిత్యానందేంద్ర సరస్వతీస్వామి ప్రోక్తము. పుటలు 223. వెల రూ. ౨-౮-౦ గ్రంథప్రాప్తిస్థానము: శ్రీ బందారు సీతారామయ్యగారు, గాంధినగరము, కాకినాడ.

ఆత్మలాభముకంటె ఎక్కువైనది లేదు. ఆత్మ అమృతము. మానవుడు ప్రపంచమంతటిని జయించి అమృతమగు తన ఆత్మను గోల్పోయిననేమి ప్రయోజనము? ఉపనిషత్తులు ఆత్మోపలబ్ధిసాధనములను తల్లివలె, గురువువలె, ప్రభువువలె మనకు ఉపదేశించుచున్నవి. ఈ ఉపనిషత్తులను పఠించి, వానియందలి ధర్మములను అనుష్ఠించి, ప్రతివాడు పరమపురుషార్థమగు మోక్షమునకై ప్రయత్నింపవలెనని వేరుగా చెప్పనవసరము లేదు.

ఉపనిషత్తులు నూటఎనిమిది. వీనిలో పండ్రెండు ముఖ్యమైనవిగా ఎంచబడుచున్నది. వీనిలో కాఠక, శ్వేతాశ్వతరోపనిషత్తులుమినహా తక్కిన పదింటిసారము ఉపనిషత్స్వామి యని ప్రసిద్ధిగాంచిన శ్రీ నిత్యానందేంద్రసరస్వతీస్వాములవారు ఈ గ్రంథములో ఉపన్యసించియున్నారు. వీరి వ్యాఖ్యానవివరణ, అనువాద వైఖరులు రమ్యముగా నున్నవి. ఉపమానములతోను, ఉదాహరణలతోను వీరు వేదాంతార్థమును పాఠకులకు సుబోధకము గావించుచున్నారు. ఐతరేయోపనిషత్తులో 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను మహావాక్యార్థవిచారణ [illegible]ప్తముగా నున్నది. కొంచెము విపులముగా తెలిపిన బాగుండునని తోచెడిని. ఛాందోగ్యోపనిషత్తునందలి షష్ఠప్రపాఠకసారమును అనగా 'తత్త్వమసి' వాక్యార్థవివరణఘట్టమును, బృహదారణ్యకోపనిషత్తునందలి షష్ఠాధ్యాయములో ౫ బ్రాహ్మణములసారమును అనగా, జనకునికి యాజ్ఞవల్క్యుడు తత్త్వోపదేశము గావించు ఘట్టమును మైత్రేయీ యాజ్ఞవల్క్యసంవాదమును వీరు విపులముగా, చక్కగా ఉపన్యసించియున్నారు. అనేక ఉపాసనలను గూర్చియు, ముఖ్యముగా ఓంకారోపాసనను గూర్చియు వీరు విపులముగా వ్రాసియున్నారు. గ్రంథము పాఠయోగ్యముగాను, అద్వైతసత్సంప్రదాయ సిద్ధముగాను ఉన్నది. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తముగా నుండగలదు. గ్రంథాంతమున దశోపనిషత్తులు పొందుపరుపబడి యున్నవి.

ఓ. వెం. శా.

---

## ఆకుకూరలు

## కాయకూరలు

## దుంపకూరలు

రచయిత: ఆంధ్ర శేషగిరిరావుగారు, బి. ఏ. ప్రకాశకులు: జయానికేతన, మదరాసు-7.

దేహపుష్టికి, ఆరోగ్యానికి, అవసరమైన ప్రాణకృత్తులూ, ఖనిజలవణాలూ మెండైనవి మన మనాదిగా వాడుతూ వస్తున్న శాకాహారద్రవ్యాల్లో సమృద్ధిగా ఉన్నవి. కాని, నేటి వారికి నవనాగరికతతో సీమసరుకులమీద వ్యామోహం పెరిగి మన నాటుసరుకులు కొరగానివై పోయినవి. వాటిలోని గుణవిశేషాలను, ఆహారవిలువను శాస్త్రీయంగా, వివరంగా నిరూపిస్తున్న ఈ గ్రంథత్రయ పఠనంతోనైనా అటువంటివారికి కనువిప్పు కలగగలదని మా నమ్మకం. శాస్త్రీయవిషయాలైనా సులభసుందరంగా తేటమాటలతో తీర్చిచెప్పిన శేషగిరిరావుగారి కృషి సంభావింతదగినది.

ఇందులో కొన్ని విదేశకూరల వివరణ కూడా చేర్చడం వీరి నిష్పక్షపాతదృష్టికి నిదర్శనంగా ఉన్నది.

## చందమామ

బాలబాలికలకు విజ్ఞానవినోదాలను కల్పించుటకై 'బాల'కు తోడు పత్రికగా ప్రారంభమైన పిల్లల మాసపత్రిక. మొన్న ౧-వ తేదీనాడే ప్రథమ సంచిక వెలువడింది. ముచ్చన్న చొరన్న బొమ్మలతో ముచ్చటగా ముస్తాబై, కమ్మని కథలా గాథలతో నిండి నిర్వాహకుల ఉత్సాహోత్సుకతయాన్ని చాటుతున్నది ఈ సంచిక. క్రమక్రమంగా వికాసాన్ని సంతరించుకొని, పరిపూర్ణత్వం గడించి తీరుతుందని ఆశిస్తున్నాము. చక్కని కూర్పు తీర్పులు పత్రిక అందానికి పుష్టినిస్తున్నవి. సంపాదకులు: చక్రపాణి గారు. విడి సంచిక వెల ౬ అణాలు. కార్యస్థానం: ౩౭, ఆచారప్పన్ వీధి, జి. టి. మద్రాసు ౧.

---

## హిందూస్తానీ శిక్షక్

గ్రంథకర్త: ముక్తినూతలపాటి హనుమంతరావుగారు, హిందీప్రచారక్, నరసారావుపేట. వెల ౧ రూ.

గురువుతో నిమిత్తం లేకుండానే మామూలు వ్యవహారాలకు పనికివచ్చే హిందీ వాడుక భాషను ఎవరికి వారు నేర్చుకొనుటకై రచింపబడిన దీ గ్రంథం. హిందీప్రచారోద్యమం ముమ్మరంగా సాగుతున్న ఈరోజుల్లో అభ్యాసకులకు ఇది తప్పక ఉపయోగకరంగా ఉండగలదు.

---

## శ్రీ రమణాశ్రమ లేఖలు

లేఖకురాలు: నాగమ్మగారు. ప్రకాశకులు: శ్రీ నిరంజనానందస్వామి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై. ద్వి. వెల ౧-౮-౦.

భగవాన్ శ్రీరమణమహర్షి సన్నిధిలో అనునిత్యమూ జరిగే మంచిమంచి విషయాలూ, ఆయా సందర్భాల్లో భగవానులు చెప్పేమాటలూ ఎప్పటికప్పుడు ఈ రచయిత్రి తన సోదరునికి వివరిస్తూ వ్రాసిన జాబులు, వీనిలో భగవానులు యథాలాపముగా పలికిన భావగర్భితమూ క్తిరత్నాలు నిండి నిబిడీకృతమై ఉన్నవి లేఖలుకూడా కథలా కబుర్ల రూపంలో ఉండి మరిమరి చదువ మభ్యర్థింపజేస్తున్నవి. శ్రీవారి తత్వబోధలను తెలుసుకోగోరువారు దీనిని తప్పక చదువవలెను. మామూలు చదువరికి కూడ అర్థమయ్యే చక్కని వ్యావహారికంలో ఉండడంవల్లకూడా ఈ లేఖలు నిరాక్షేపంగా ఎక్కువ మందిని ఆకర్షిస్తాయి.



---

# గ్రంథ స్వీకారము

---

## వనమాల

ఖండికా గీతికాసంపుటి. కవి: రాయప్రోలు సుబ్బారావుగారు. సాహితీసమితి పక్షమున తెనాలిలోని ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీవారు ప్రచురించినది. వెల రూ. ౧-౮-౦.

### కుమారదేవ పండితీయము

ప్రౌఢవ్యాకరణవివరణము—రచయిత: విద్వాన్ శొఠ్లూరు అర్యగంపిళ్ళగారు. ప్రకాశకులు: వేదము వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు, ౪, మల్లికేశ్వర గుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మద్రాసు. వెల రూ. ౨-౪-౦.

### ఋతుగానము

కవి: ఎ. కృష్ణమాచార్యగారు. ప్రాప్తిస్థానము: దుర్గామాడరన్ బుక్ సప్లయి, బెజవాడ. వెల ౧ రూ.

### రత్నపాంచాలిక

సర్వజ్ఞసింగభూపాలుని సంస్కృత నాటికకు ఆంధ్రీకృతి. రచయిత: పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు. ప్రకాశకులు: చిదంబర గ్రంథమాల, కాకినాడ. వెల ౧ రూ.

### గాంధిచరిత్రము.

గాంధీమహాత్ముని పూర్తియగు జీవితచరిత్ర. రచయిత: కొమాండూరి శఠకోపాచారిగారు, వకీలు, కాకినాడ. ద్వితీయముద్రణ. వెల ౩ రూ.

### జయశ్రీ

కథలు. కథకుడు: చర్ల వెంకటనరసింహారావుగారు. ప్రకాశకులు: సుందరరాం అండ్ సన్సు, తెనాలి. వెల ౧ రూ.

i అశ్విని నాడీమీమాంస
ii అశ్విని ఆంగ్లేయ ఔషధగుణ దీపిక
iii అశ్విని ఆయుర్వేద అనుభూత యోగావళి.

రచయిత: డాక్టరు జి. వి. [illegible]. ఆచారిగారు, చేబ్రోలు, పశ్చిమగోదావరి. వెలలు: మొదటిది ౧౨ అ.; మిగిలినవి చె౹ ౧ రూ.

### గాంధీ - గాంధీతత్వము

రెండుసంపుటములు. రచయిత: డా. భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు. అనువాదకులు: కొడాలి ఆంజనేయులుగారు. ప్రకాశకులు: ప్రభాత ప్రచురణసమితి, ఖమ్మంమెట్టు (నైజాం). వెల సంపుటము ౧ ౹ ౪ రూ.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.